# చతుర

## ఫిబ్రవరి 1979

సంపుటి : 2 సంచిక : 1

### ఈ నెల సమగ్ర నవల

'రేపు' గురించి ఆలోచించటానికే భయపడే ఆ కుటుంబంలో ఆకస్మికంగా అనూహ్యమైన మార్పు వచ్చి పడింది. మారిన ఆర్థిక పరిస్థితులు కుటుంబ వాతావరణాన్నే కాదు, మనుషుల మానసిక ధోరణుల్ని కూడా మార్చి వేశాయి. ఇంటి ఆడబిడ్డ శకుంతల పేర మొదలయిన బ్యాంక్ ఎకౌంట్ క్రమక్రమంగా పెరిగి పోసాగింది. 'మా అమ్మాయి వల్ల మాకు మంచిరోజులు వచ్చాయి' అని సంబరపడి పోయింది తల్లి. కానీ...తల్లి కళ్ళ ఆనందంతో మెరిసి పోతూన్న సమయంలోనే అందుకు కారకురాలైన శకుంతల కళ్ళు విషాదంతో వాలిపోవటానికి కారణమేమిటి? ఆ విషాదం నుండి బయట పడేందుకు ఆమె పలికించిన...

# సామగానం

ఏ అవసరాలను ఎత్తిచూపింది? ఆమె జీవితాన్నెటు నడిపింది?

## శ్రీవిరించి

కలం నుండి జాలువారిన మధురగాన స్రవంతి ఈ నెల చతుర సమగ్ర నవల 'సామగానం'

## ఈనెల ముఖపత్రం

మానవ రూప సౌందర్యాన్ని మరింత సుందరంగా ప్రదర్శించుటకు తోడ్పడే కళాశైలులు అనేకం. సాంప్రదాయికమైన అలంకరణ శైలిలో మలచ బడిన ఆధునిక యువతి ముగ్ధ రూపం ఈ నెల చతుర ముఖపత్రం. చిత్రకారుడు ప్రభాకర్.

## రెండవ కవరు

బౌద్ధమతం భారత దేశంలోనే పుట్టినా ఆశియా ఖండమంతటా అప్రతిహతంగా వ్యాపించిందా కాలంలో. దాదాపు ఆశియా దేశాలన్నింటా ఆనాడు బౌద్ధశిల్పాలతో ఆలయాలూ, గుహాలయాలూ వెలిశాయి. అలాంటి వాటిలో చైనాలోగల ఒక గుహాలయంలో బయల్పడిన శిల్పం ఇది. బౌద్ధజాతక కథలలో ఒకదానికి ఆనాటి శిల్పులు చేసిన రూపకల్పన.

## మూడవ కవరు

వైశాల్యంలో బహుపెద్దదైన ఆ గుహాలయంలోని ఒక భాగం. ఈ గుహలో దాదాపు ప్రతి అంగుళాన్నీ శిల్పాలతో నింపి వేశారానాటి శిల్పులు.


చతుర

ఈనాడు కాంపౌండ్,

సోమాజిగూడ, హైదరాబాద్–500 004

మిరమిట్లు గొల్పే తెలుపు
చూడగానే
అందరి నోట ఒకే మాట...



ఇది తప్పక

**డెట్**

డిటర్జెంట్
బిళ్ల వుతుకే




Shilpi DM 35A/78 Tel

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని వివిధ కోణాలనుండి ప్రతిబింబించగల సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి.

* ఈ పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా రాసిపంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి. ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100-112 పేజీల పాకెట్ సైజు నవలాను బంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు చతురలో అచ్చులో 60-70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.

* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత వరకూ కుదించవలసివచ్చే పక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.

* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతోసహా నవల పంపాలి.

* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పిపంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పని సరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు.

* 'చతుర'లో ప్రచురించే ప్రతి నవలకూ పారితోషికం రచనను బట్టి రు. 1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

**చతుర**

ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్–500 004

# విదేశాల్లో ఉండే తెలుగువారికోసం ఉదయిస్తున్న వినూత్న పక్షపత్రిక

‘ఈనాడు తెలుగునాడు’. ఇది ‘ఈనాడు’ గ్రూపు సమర్పణ. విదేశాల్లో ఉంటున్న తెలుగువారికోసం ప్రత్యేకంగా వెలువడుతున్న పత్రిక.

తెలుగుదేశపు వార్తలూ, విశేషాలు, జ్ఞాపకాలూ అందజేసే నూతన పక్షపత్రిక.

తాజా తాజా రాష్ట్ర రాజకీయాలు....
సాహితీ, సాంస్కృతిక కార్యక్రమాలు....
ఆయా రంగాల్లోని ప్రముఖుల పరిచయాలు....
పండుగలు .... పబ్బాలు ....
కథలూ.... కవితలూ ....
చరిత్రాత్మక స్థలాల సచిత్రవ్యాసాలు....
తెలుగు సినిమా కబుర్లు ....
బాలల కోసం బొమ్మల కథలు....
వ్యవసాయ, పారిశ్రామికరంగ విశేషాలు ....

–ఇలా మరెన్నో ప్రతి సంచికలోనూ ఉంటాయి. పఠితలను అలరిస్తాయి. తెలుగు దేశాన్ని వారి ముందు సాక్షాత్కరింపజేస్తాయి.

**ఈనాడు తెలుగునాడు**

ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ,
హైదరాబాద్ – 500 004.



# విదేశాల్లో ఉన్న మీ బంధుమిత్రులకు ఒక సుదీర్ఘ లేఖ రాయడం ఎలా?

## ఇదిగో ఇలా...



Name: ____________________

Address: ____________________

____________________

____________________

చుక్కల గుర్తుల భాగాన్ని కత్తిరించండి.

ఒక్క ఉత్తరంలో మీ రెన్ని విశేషాలు రాయగలరు ? ఎన్నోకొన్ని రాయగలరేమో కాని.... 'ఈనాడు' కుటుంబం నుంచి వెలువడే వినూతన పత్ర పత్రిక 'ఈనాడు తెలుగునాడు' అందించినన్ని వార్తలు, వ్యాఖ్యలు రాయలేరు.

విదేశాల్లోని తెలుగువారికోసం ప్రత్యేకంగా 'ఈనాడు తెలుగునాడు' వెలువడుతున్నది. తెలుగుదేశంలో ఎక్కడెక్కడ ఏం జరుగుతున్నదో తెలుసుకోవాలన్న వారి కోరిక నెరవేర్చడం దాని ధ్యేయం.

'ఈనాడు తెలుగునాడు' ప్రతి సంచికలోనూ....

తాజా తాజా రాష్ట్ర రాజకీయాలూ....
సాహితీ, సాంస్కృతిక కార్యక్రమాలు....
ఆ యా రంగాల్లోని ప్రముఖుల పరిచయాలు....
పండుగలు....పబ్బాలు....కథలూ....కవితలూ....
చరిత్రాత్మక స్థలాల పవిత్ర వ్యాసాలు....
తెలుగు సినిమా కబుర్లు.... బాలల కోసం బొమ్మల కథలు....
వ్యవసాయ, పారిశ్రామికరంగ విశేషాలు....ఇలా మరెన్నో ఉంటాయి.

ఒక్క మాటలో - తెలుగునాటి జనజీవనానికి 'ఈనాడు తెలుగునాడు' సర్వసమగ్ర ప్రతిబింబం.

విదేశాల్లో ఎక్కడయినా సరే, మీ బంధు మిత్రులు ఎవరున్నా - పై కూపన్‌ను కత్తిరించండి. దాన్ని నింపి మాకు పంపండి. మీకు కాని, మీబంధువులకు కాని పైసా ఖర్చు లేకుండా 'ఈనాడు తెలుగునాడు' సంచిక ఒకటి పంపుతాము. మీ ప్రేమాభిమానాలూ, మా శుభాకాంక్షలూ కలగలిపి వారికి అందజేస్తాము.

బంధుమిత్రుల పట్ల మీకున్న ఆదరాభిమానాలు వ్యక్తం చేయడానికి ఇంత కంటె మంచి మార్గం మరేముంటుంది ?

**ఈనాడు తెలుగునాడు**

ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ - 500 004.

**"ఈనాడు తెలుగునాడు" కేవలం విదేశాలలో వుండే తెలుగువారి కోసమే ప్రచురిస్తున్నాము. కనుక అక్కడి మీ బంధుమిత్రుల చిరునామాలను మాత్రమే పంపగోరుతున్నాము. ఒకటికి మించి చిరునామాలను పంపదలుచుకున్న పక్షంలో తెల్ల కాగితంపై వ్రాసి పంపండి.**

# ప్రపంచం చాలా చిన్నదే..!

ఎవరేమన్నా 'విపుల' పాఠకులు మాత్రం ఈ విషయాన్ని ఏకగ్రీవంగా ఒప్పుకుంటారు. ఈ సంగతి ఇతరులకన్నా వారికే స్పష్టంగా తెలుసు. వారు ప్రతినెలా 'విపుల' చదువుతూ ప్రపంచాన్ని చుట్టి వస్తూనే ఉన్నారు. ఈ విశాల విశ్వానికి ఉన్న ఎల్లల్ని, భాషా పరిధుల్ని చెరిపివేసి, దూరాల్ని తగ్గించిన విశ్వకథా విపంచి 'విపుల'. రంగుల ఆఫ్ సెట్ ముద్రణలో **132** పేజీల విలువైన 'విపుల' కేవలం **125** పైసలకే మీకు అందుబాటులో ఉంది.

అనేకానేక భారతీయ భాషలనుండి, ప్రపంచ భాషలనుండి సేకరించిన అత్యుత్తమ కథలకు వేదిక విపుల. అనువాదాలు అనిపించని జాను తెలుగులో ప్రతి నెలా విందు చేస్తోంది 'విపుల' మాస పత్రిక.

ప్రతి కథకూ రెండు రంగుల్లో ఆకర్షణీయమైన, భావస్ఫోరక చిత్రాలు మరో ప్రత్యేకత.

కథలు గాక అదనంగా ఎన్నో కార్టూన్లు, జోకులు, విచిత్ర విశ్వ విజ్ఞానం... అన్నీ కలిపి కేవలం **125** పైసలకే అందిస్తోంది 'విపుల' మాస పత్రిక.

**విపుల**



Marketed By
Margadarsi Marketing
PRIVATE LIMITED
Eenadu Compound, Hyderabad-500 004



# సర్వప్రియుడు

ఆస్ట్రేలియాలో జాన్, బ్రైటీ దంపతులకు చాలాకాలంవరకు పిల్లలు కలగక పోవడంతో 'సుశీ'ని పెంచుకున్నారు. 'సుశీ' అంటే పాప అనుకునేరు. అదొక కొండచిలువ పేరు.

సుశీని వారు కన్నబిడ్డలా ప్రేమిస్తూ వచ్చారు. జాన్ రోజూ సమీపంలోని చెరువుకి స్నానానికి వెళ్ళేటప్పుడు సుశీని కూడా తనవెంట తీసికెళ్ళేవాడు. వాళ్ళతో పాటు పెంపుడు కుక్కపిల్ల కూడా తోకాడిస్తూ వెళ్ళేది. జాన్‌తోపాటు సుశీ కూడా చెరువులో స్నానంచేసేది. జాన్ కాసేపు సుశీతో ఆడుకునేవాడు.

ఓసారి మామూలుగా చెరువులో స్నానం చేస్తూ జాన్ సుశీతో ఆడుకుంటుండగా హఠాత్తుగా అది తన శరీరంతో అతన్ని చుట్టి బిగించసాగింది. జాన్ నిశ్చేష్టుడయ్యాడు ఈ హఠాత్పరిణామానికి. అతనికి ఊపిరిసలపలేదు. ఎంత ప్రయత్నించినా సుశీ పట్టు సడలించలేదు. జాన్ ప్రక్కటెముకలు పటపటలాడాయి. సహాయంకోసం అతను గావుకేకలు పెట్టాడు.

ఒడ్డున నిలబడి చూస్తున్న జాన్ పెంపుడు కుక్కపిల్ల తన యజమాని ప్రమాదంలో ఉన్నట్లు అర్థంచేసుకొని మొరగసాగింది. అటుగా ఎవరూ రాలేదు. దాంతో ఇంటికి పరుగెత్తికెళ్ళి, ముందు కాళ్ళతో సొరుగు తెరచి అతని పిస్తోలు నోటితో కరుచుకువచ్చి పనిచేసుకుంటున్న బ్రైటీకి ఇచ్చింది.

బ్రైటీ ఆ హడావుడి చూసి, కుక్క వెనుకే చెరువు దగ్గరికి పరుగెత్తుకొచ్చింది. అక్కడ మృత్యువుతో పోరాడుతున్న భర్త పరిస్థితి చూసి నిర్ఘాంతపోయింది. వెంటనే కొండచిలువ తలకు గురిచూసి



పిస్తోలు పేల్చింది. కొండచిలువ బాధతో మెలికలు తిరిగిపోతూ జాన్‌ని వదిలేసింది.

సుశీని అమితంగా ప్రేమిస్తున్న జాన్ వెంటనే గాయపడ్డ ఆ కొండచిలువను వెటర్నరీ డాక్టర్ దగ్గరికి తీసికెళ్ళి దాని ప్రాణాలను కాపాడాలని ఎంతో ప్రయత్నించాడు. కానీ, సుశీ చచ్చిపోయింది.

జాన్ ఆ మృతసర్పాన్ని ఒక షో బాక్సులో జ్ఞాపకచిహ్నంగా ఉంచుకుని, ఆ పెట్టెపై ఇలా రాయించాడు. "మిత్రులారా! ఇందులో ఉన్నది నా ప్రియమైన సుశి" అని. దీన్నే అపకారికి ఉపకారం అంటారు కాబోలు.

# టెలివిజన్ సాంఘిక సేవ

టెలివిజన్ ప్రస్తుతం ఇక్కడ మనకు కాలక్షేపాన్ని మాత్రంఇస్తుంటే, బ్రిటన్‌లో సామూహిక సాంఘిక సేవా సాధనంగా ప్రయోజనాన్ని కూడా సాధించిపెడుతోం దట. ఈ పథకం 300 అనాథ బాలలకు సంరక్షకులను సంపాదించిపెట్టింది.

నాలుగేళ్ళక్రితం బిబిసి టి. వి. యూనిట్‌లో వారంవారం ఇలాంటి సాంఘిక సేవా కార్యక్రమాలు ప్రారం భించారు. వాటిని వ్యతిరేకిస్తూ వివాదా స్పద చర్చల్లూ జరిగాయి. అయితే అనాథ బాలల సంక్షేమ సంఘం డైరె క్టరు జాన్‌ఫిట్జెర్ల్డ్ ఆ విమర్శల్ని తట్టుకుని




నిలబడి ఓపికతో ఆ కార్యక్రమాల్ని అలాగే కొనసాగిస్తూ రావడంతో ఇప్పు డవి ఎంతో ప్రయోజనాత్మకంగా రూపొం దాయి.

ప్రతివారం 30 మంది అనాథ బాలల ఫొటోలు, వివరాలు టి. వి. లో ప్రదర్శి స్తారు. వారిలో కనీసం 20 మందికైనా సంరక్షకులు దొరుకుతూ ఉంటారు. ఈ సామూహిక సాంఘిక సేవాపథకంలో ఇప్పటికే 310 మంది అనాథ బాలల్ని దత్తత చేసుకున్నారు.

ఆరుగురు సంతానంగల శ్రీమతి వివియన్ ఈ టి. వి. కార్యక్రమాల్ని చూసి ప్రభావితురాలై ఒక అనాథ బాలుణ్ని దత్తత తీసుకుంది.

# పోస్ట్‌మేన్‌లకు కుక్కకాట్లు

పోస్ట్‌మేన్ తన ఉద్యోగ నిర్వహణలో ఉన్నప్పుడు తనకు కేటాయించిన ప్రాంతంలో ఎలాంటి సందుగొందుల్లోకైనా వెళ్ళి ఉత్తరాలు ఇచ్చి రావాల్సి వుంటుంది. అలాంటప్పుడు కొన్నిచోట్ల వారు కుక్కకాట్లకు గురి అయి ప్రాణా పాయ స్థితిని కూడా ఎదుర్కొనవలసి వస్తుంది.

ఫ్రెంచి తపాలాశాఖ తన తపాలా బంట్రోతుల్ని ఇలాంటి కుక్కల బెడద నుంచి కాపాడేందుకు కొన్ని పద్ధతుల్ని ప్రవేశ పెట్టింది.

అక్కడ గత ఏడాది 3 వేల మంది తపాలా బంట్రోతులు కుక్క కాట్లకు గురి అయిన ఫలితంగా 6 వేల పని దినాలు వ్యర్థమయ్యాయి. గత అయి దేళ్ళుగా ఫ్రాన్స్‌లో ఈ సమస్య తీవ్ర రూపం దాల్చింది. ఈ విషమ పరిస్థితిని అరికట్టేందుకు తపాలాశాఖ ఆలోచించి ఫ్రాన్స్‌లో 'బ్రిటాని' అనే ప్రాంతంలో

కొన్ని ఆంక్షల్ని విధించింది.

'బ్రిటాని' ప్రాంతంలో పెంపుడు కుక్కలు అధిక సంఖ్యలో వున్నాయి. గత సంవత్సరం జరిగిన 3 వేల కుక్క కాట్లకు గురైన వారిలో 128 మంది తపాలా బంట్రోతులు ఆ ప్రాంతానికి డ్యూటీపై వెళ్ళిన వారే. ఎక్కువ మంది పోస్ట్‌మేన్‌లు కాళ్ళు, తొడల భాగంలోనే కుక్కకాట్లకు గురి అయ్యారు.

పోస్ట్‌మేన్ వచ్చే సమయానికి తమ కుక్కల్ని కట్టేసి వుంచాలని పెంపుడు కుక్కల యజమానులపై తపాలాశాఖ ఆంక్షలను విధించింది. ఈ ఆంక్షలను అలక్ష్యం చేసినట్లయితే వారికి మొదటి హెచ్చరిక చేస్తారు. దానినీ నిర్లక్ష్యంచేస్తే శిక్షగా వారికి వచ్చే ఉత్తరాలపై కొంత రుసుమును వసూలు చేస్తారు. ఈ పద్ధతుల వల్ల చాలా వరకు ఫలితం కానరావటంతో ఫ్రాన్స్ మొత్తం మీద ఇలాంటి ఆంక్షల్ని



అమలులోకి తెచ్చారు.

తపాలాశాఖ పోస్ట్‌మేన్‌లు కుక్క కాట్ల నుండి తమను తాము సంరక్షించు కొనేందుకు కొన్ని మార్గాలను నిర్దేశించింది. పద్నాలుగేళ్ళ అనుభవజ్ఞుడైన బ్రిటాని పోస్ట్‌మేన్ తను తిరిగే ప్రాంతంలో ఎక్కువ శాతం వున్న కుక్కల జాతికి చెందిన ఆడ కుక్కల్ని తనూ పెంచే వాడట. అతడు డ్యూటీపై వెళ్ళినప్పుడు ఆ ప్రాంతాల్లోని కుక్కలు అతడిదగ్గర తమ జాతికి సంబంధించిన 'కుక్కల వాసన' రావటంతో ఎంతో స్నేహ పూర్వకంగా తోకాడిస్తూ కాళ్ళ చుట్టూ తిరిగేవి తప్ప కరిచేవి కావట. ఈ పద్ధతి వల్ల తను కుక్క కాట్ల బెడద నుంచి తప్పించుకోగలిగానని అంటాడా అనుభవ శాలి.

## మాట్లాడే గొరిల్లా

కోతుల్ని ఆడించటం, వాటితో కొన్ని పనులు చేయించటం సర్వసామాన్యంగా మనకు తెలిసిన విషయమే. అయితే అమెరికాలో స్టాన్‌ఫర్ యూనివర్శిటీకి చెందిన మిస్ పెనీపీటర్సన్ అనే యువతి ఏడేళ్ళ వయసుగల గొరిల్లా 'కోకో'కు మాటలు నేర్పే ప్రయత్నంలో చాలావరకు కృతకృత్యురాలయింది.

కోకో మాట్లాడుతుంది. నవ్వుతుంది. తన ఆట బొమ్మలతో కబుర్లు చెపుతుంది. పద్యపాదాలు వప్పచెబుతుంది. రాజకీయ నాయకుడిలా 'లంచం' కూడా పుచ్చుకుంటుంది. చెవిటివారితో సంజ్ఞల ద్వారా మాట్లాడినట్లు కోకో తన యజమానురాలైన పెనీతో సంభాషిస్తుంది.

ఆరేళ్ళక్రితమే మిస్ పెనీ కోకోను

జూ నుంచి తెచ్చి పాఠాలు చెప్పడం ప్రారంభించింది. పారిస్‌లో ప్రదర్శన నిమిత్తం గొరిల్లాకు పాఠాలు చెప్పడాన్ని డాక్యుమెంటరీ చిత్రం కూడా తీశారు.

కోకోకి 375 సంజ్ఞలు తెలుసు. వాటి ద్వారానే మిస్ పెనీకి తన అభిప్రాయాల్ని వ్యక్తం చేస్తుంది కోకో. అయితే ఏదైనా తినుబండారం చేతికిస్తే తప్ప అది ఏ ప్రశ్నకీ సమాధానం చెప్పదు. ఒక్కోసారి కోకో పత్రికలలో బొమ్మల్ని చూసి తనలో తాను నవ్వుకుంటుంది.

రోజూ ఉదయం 8 గంటలకి పెనీ వెళ్ళి కోకోకి ఫలహారం పెడుతుంది. మధ్యాహ్నం భోజనం. అయిన తర్వాత నగరంలో షికారుగాతిప్పేందుకు కోకోను తన కారులో తీసుకెళుతుంది పెనీ. రాత్రి 7.30 గంటలకు కోకో నిద్రకుపక్రమిస్తుంది.



కోకో టి.వి. సహాయంతో ఇంగ్లీషు నేర్చుకొంటోంది. కోకో చాలా చిన్న పిల్లగా ఉన్నప్పుడు పెనీ తన స్నేహితురాళ్ళతో తేలిగ్గా కబుర్లు చెప్పుకునేందుకు అవకాశం ఉండేది. కానీ, ఇప్పుడు, కోకో ప్రతిమాటకు అడ్డువచ్చి సమాధానాలు చెప్పడం చేస్తోంది. కోకో ఆటోమేటిక్ కెమెరాతో స్వయంగా తీసుకున్న ఫొటోలు ఎన్నో పత్రికలలో ప్రచురింపబడ్డాయి. మూడు నాలుగేళ్ళ పసిపిల్లల మనస్తత్వాన్ని, ప్రవర్తనని గుర్తు తెచ్చే కోకో చర్యలకు పెనీ మురిసిపోతూ ఉంటుంది.

# నాటకరాజం

మీరెప్పుడైనా కలకత్తా వెళ్ళినప్పుడు 'బార్ బోధో' నాటకం చూడకపోయినట్లయితే మీ జీవితం వ్యర్థమే. అందర్నీ ఆశ్చర్యంలో ముంచెత్తేలా అద్భుతమైన రికార్డు సృష్టించిన ఆ నాటకం గొప్పదనమేమిటో తెలుసా ?

గత ఆరేళ్ళనుండీ ఇంకా ప్రదర్శింపబడుతూ 1500లకు పైగా ప్రదర్శనలు ఇవ్వబడిన ఆ బెంగాలీ నాటకంవంటిది భారతదేశంలో మరొకటి లేదనే చెప్పొచ్చు. ఇన్నేళ్ళలోనూ అవసరాన్ని, అవకాశాన్నిబట్టి నటీనటుల మార్పులు జరుగుతూ వస్తున్నా ప్రదర్శనలు మాత్రం ఆగలేదు. ప్రస్తుతం ఈ నాటకంలో కథానాయిక 'లత' పాత్రను మంజుచక్రవర్తి పోషిస్తోంది. ఆమె 21 ఏళ్ళ వయసున్న కాలేజీ విద్యార్థిని.

ఈ ఆరేళ్ళలోనూ 'బార్ బోధో' నాటక ప్రదర్శనను తిలకించడానికి ప్రజలు ఎగబడటమేకాక, టిక్కెట్లు బ్లాక్ మార్కెట్‌లో విపరీతంగా అమ్ముడుపోవటాన్నిబట్టి ఈ నాటకానికి ఎంత




ప్రాముఖ్యత, ప్రచారం లభించిందో అర్థమవుతుంది. గురు, శని, ఆదివారా లలో మాత్రమే ఈ నాటక ప్రదర్శన ఉంటుంది.

కొన్ని కారణాలవల్ల ఈ నాటకాన్ని కలకత్తాలో ఎక్కడా ప్రదర్శించడానికి వీల్లేదని కొందరు అభ్యంతరపెట్టారు.



చాలాకాలం కోర్టు విచారణ పిమ్మట, "ఈ నాటకం ప్రదర్శించినంత మాత్రాన ప్రజలకెలాంటి అపకారం జరగదని" జడ్జి తీర్పు ఇచ్చారు.

దాంతో ఆ నాటకానికి ప్రజల్లో మరింత ప్రచారం లభించింది. అసిమ్ చక్రవర్తి కథ, మాటలు, దర్శకత్వం కూర్చిన ఆ నాటకరాజం అఖండ ఖ్యాతిని ఆర్జించింది.

నాటక ప్రదర్శనలో అన్ని రంగాల లోనూ పనిచేసే సాంకేతిక నిపుణులు, పనివాళ్ళతో కలిపి మొత్తం 44 కుటుంబా లకు ఆ నాటకమే భుక్తిని కల్పించి, ఆధారభూతమయింది.

ఎన్నెన్నో ధర్మసంస్థలు నిర్వహించే సహాయ కార్యక్రమాలలో ఆ నాటకమే ప్రదర్శింపబడేది.

# పాడుబడిన లైట్‌హౌస్

పసిఫిక్ మహాసముద్రం పశ్చిమ కనుమలో ఓ పెద్ద కొండమీద అందమైన ఒక లైట్‌హౌస్ ఉంది. 'మాక్స్ షైలాక్' అనే ఇరవై ఐదేళ్ళ యువకుడు ముచ్చటపడి 27వేల డాలర్లకు దాన్ని కొనేశాడు. అయితే ఇప్పుడు దాన్ని ఏం చేయాలో అతనికి అంతుబట్టటం లేదు పాపం!

సముద్రంలో ప్రయాణించి వచ్చే ఓడలకు మార్గదర్శిగా ఉండేందుకు పది అంతస్తుల భవనంకంటే ఎత్తుగా ఉండే విధంగా 1881లో నిర్మించిన ఆ లైట్ హౌస్‌లో కొన్ని విశ్రాంతి గదులూ ఉన్నాయి.

మొదట్లో దాని నిర్మాణానికి 1,23,493 డాలర్లు ఖర్చయిందట. ఆ లైట్ హౌస్‌కిగల అతిశక్తివంతమైన లైట్ల కాంతి 18 మైళ్ళవరకు కనిపిస్తుంది. ఆ లైట్లకు ఎంతో విద్యుచ్ఛక్తి ఖర్చవుతుంది. అందువల్ల అమెరికా ప్రభుత్వం 1957లో ఆ లైట్‌హౌస్‌ను పూర్తిగా మూసేసింది. దాన్ని ఎవరికైనా అమ్మివేసేందుకు ప్రకటన కూడా చేసింది.

మాక్స్ మాత్రం సాహసించి మొదట దాన్ని కొనేశాడు. హెలికాప్టర్‌ద్వారా ఆ లైట్‌హౌస్‌లో కాలుపెట్టిన వెంటనే అక్కడ దుమ్ముతో నిండి అసహ్యంగా ఉన్న గదులు, చెడిపోయిన యంత్ర సామాగ్రిని చూసి మాక్స్ చాలా నిరుత్సాహపడ్డాడు. కానీ, లైట్‌హౌస్

శిఖరం మీదినుంచి కనిపించిన విచిత్రమైన, సుందరమైన ప్రకృతి దృశ్యం అతన్ని ఆశ్చర్యచకితుణ్ని చేసింది.

అక్కడొక హోటల్ తెరిస్తే బాగుంటుందని మాక్స్‌కు ఆలోచన కలిగింది. కానీ, హెలికాప్టర్ మీద ఆ లైట్‌హౌస్ హోటల్‌కు రాకలిగేంత స్తోమతు ఎంత




మందికుంటుంది? అందుకే అతడా ఆలోచనకు స్వస్తిచెప్పి దానిస్థానే అక్కడ 'పిక్‌నిక్ స్థలం' ఏర్పాటుచేస్తే ఎలా ఉంటుందా అని యోచించాడు. అదీ అతనికి నచ్చలేదు.

చివరికి ఆ లైట్‌హౌస్‌ను దేనికి ఉపయోగించాలో తెలియక దాన్ని బేరం పెట్టి ఎవరికైనా అమ్మివేసేందుకు నిర్ణయించుకున్నాడు.

# కుక్కల నర్సింగ్ హోమ్

కలకత్తా గరియాహట్ రోడ్‌లో ఉన్న అనేకానేక ఆకర్షణలలో ఈ మధ్యే ఏర్పాటుచేసిన 'కుక్కల నర్సింగ్‌హోమ్' ప్రత్యేక ఆకర్షణ.

'చినీ మెమోరియల్ కేనియల్ నర్సింగ్ హోమ్' ప్రఖ్యాతమైన సింగీ ప్యాలెస్‌లో ఉంది. సింగీల కుక్క పిల్ల పేరే దానికి పెట్టారు.

ఇక్కడ కుక్కలకి శస్త్రచికిత్స కూడా చేస్తారు. గర్భం దాల్చిన కుక్కల రక్షణకి బోర్డింగ్ సౌకర్యాలు కల్పించటమే కాక, శలవుల్లో దూర ప్రాంతాలకు,విహార యాత్రలకు వెళ్ళేవారు, తమ పెంపుడు కుక్కల్ని ఇక్కడ వదలి వెళ్ళితే వాటి ఆహారవిహారాదుల విషయంలో వీరు శ్రద్ధ తీసుకుంటారు.

ప్రస్తుతం అలాంటివి 33 నర్సింగ్ హోమ్‌లున్నాయి. వాటిలో లస్టర్, రష్యన్, బర్గియో ప్రప్రథమంగా 40ఏళ్ళ క్రితం హైదరాబాద్ నిజాంచే ప్రారంభించబడింది. మరొకటి 'బితూ' అనేది అల్వార్ మహారియనౌకు సంబంధించింది.

ఈ నర్సింగ్ హోమ్‌ల కార్యదర్శి మిస్ లుకూ ఘోష్ మాట్లాడుతూ–"మన కుటుంబంలో పసిపిల్లలకీ, ఈ కుక్కలకీ ఏమీ తేడాలేదు. అవీ పసిపిల్లలతో సమానం. అందుకే వాటి విషయంలో ఎంతో శ్రద్ధ తీసుకోవలసిన అవసరం ఉంది. తమ బాధల్ని గురించి అవి మనతో చెప్పలేవు కదా!" అంటుందామె.

ఆ నర్సింగ్ హోమ్‌లలో కుక్కల రక్షణకు వాటి సైజును బట్టి మూల్యాం




నిర్ణయింపబడుతుంది. ఆల్షేషన్ కుక్కకు రోజుకు రూ. 50/-లు ఉంటుంది. దాని



ఆహారం రోజూ రెండు కిలోల మాంసం, పాలు, బిస్కెట్లు. అమెరికన్ కుక్క కయితే బుల్గా' అనే ప్రత్యేక ఆహారాన్ని పెట్టాలి. అంతేకాక కుక్కలన్నింటికీ విటమిన్లు, కాల్షియం, ఇన్ క్రిమిన్ మొదలైనవి ఉంటాయి. చిన్న కుక్కలకు మాత్రం రోజూ పరిమితమైన ఆహారం చాలు.

# జంతువుల వేగం

**జం**తువులకు కూడా ఒలింపిక్ క్రీడల పోటీలు జరిపితే, అవి ఆ పోటీల్లో మనుషుల్ని మించి పోవడం ఖాయం. ముఖ్యంగా పరుగు పందెంలో, బంగారు పతకాన్ని చిరుతపులి దక్కించు కుంటుంది. రెండవ స్థానం జింకకి, మూడవస్థానం వేట కుక్కకి లభిస్తాయి. మనిషి మాత్రం ఎనిమిదవ స్థానంలో ఉంటాడు.

ఎలాగంటే, 100మీటర్ల దూరం పరుగెత్తేందుకు మనిషికి 9 సెకన్ల కాలం పడితే, అదే దూరాన్ని చిరుతపులి 3.7 సెకన్లలోను, జింక 4.5 సెకన్లలోను పరుగెత్త గలవు. ఇక నాలుగవ స్థానం లేడిది. ఐదు, ఆరు, ఏడు స్థానాలు వరుసగా దుప్పి, గుర్రం, 'ఎమూ' అనే ఓ పెద్ద పక్షి గెల్చుకుంటాయి. వీటన్నిటి తరువాత స్థానమే మనిషి దన్నమాట!

ఎక్కువదూరం పరుగెత్తవలసినప్పుడు, జింక చిరుతపులిని మించిపోతుంది. చిరుతపులి గంటకి 95కి.మీ వేగంతో బయలు దేరినా, త్వరల్లోనే అలసిపోయి, ఆవేగాన్ని నిలుపుకోలేదు. కానీ, జింక మాత్రం గంటకి 80కి.మీ వేగంతో స్థిరంగా పరుగెత్త గలదు. వేటకుక్క గంటకి 67కి.మీ.



వేగంతో పరుగెత్తుతుంది. లేడి వేగం గంటకి 65కి.మీ, దుప్పిది 62కి.మీ!

గడియారం నాలుగు గంటలు కొట్టింది.

పడక కుర్చీలో జారగిలపడి ఏదో పుస్తకం చదువుకుంటున్న వాడల్లా సుందరం ఉలిక్కిపడ్డట్టు లేచి గడియారం వంక చూచాడు.

మెట్లెక్కి భానుమూర్తి గదిలోకి అడుగు పెట్టాడు.

"చూశావా నువ్వు యింకా యిలాగే వున్నావు. నేను అనుకుంటూనే వున్నాను" అన్నాడు భానుమూర్తి హడావుడిగా. సుందరం అతన్ని చూసి ముసిముసిగా నవ్వాడు.

"నీకు వేళాకోళంగా వున్నట్లుంది. నాకు మాత్రం టైమంటే టైమే!

"కోప్పడకు మిత్రమా! తాపీగా కూర్చో. ఓ కప్పు కాఫీ తాగి ముందు కర్తవ్యం యేమిటో ఆలోచిద్దాం."

"అయ్యో - తాపీ మాష్టరూ! నేను ఉదయం చెప్పినదంతా మరచిపోయావా?"

"ఏమీ మరచిపోలేదు. కాకపోతే ఈ పుస్తకం చదువుతూ నన్ను నేనే మర్చిపోయాను. గడియారం దెబ్బలకు ఇప్పుడే ప్రపంచంలో పడ్డాను. ఇంతలో నీవు రానే వచ్చావు."

"మరి బయలుదేరుదాం పద"

"ఒక్క నిమిషంలో వస్తాను. ఈ పేపర్లు చూస్తూవుండు" అని సుందరం కిందకు వెళ్ళాడు. భానుమూర్తి అక్కడున్న వారపత్రికలుతిరగవేయసాగాడు. పత్రికలు అతనికి అట్టె రుచించవు. ఎంతసేపూ 'సమస్యలు', 'సంఘర్షణలు' తప్ప వాటిల్లో ఇంకేమీ వుండవు. ప్రపంచంలో యింక చదువుకోవలసిందీ, తెలుసుకోవలసిందీ యేమీలేనట్లు రాజకీయాలు తప్ప మరేమీ రాయరు వాళ్ళు. కాస్త రిలీఫ్ అంటే - సినిమా బొమ్మలు, ఎడ్వర్‌టయిజ్‌మెంట్లు మాత్రమే - భానుమూర్తి ప్రగాఢమయిన అభిప్రాయం ఇది. దీనిని ప్రచారం చేయడానికి అతను యేం చేయమన్నా సిద్ధమే.

అతనింకా పత్రిక విషయం యేం చదవాలా అని ఆలోచిస్తూ వుండగానే సుందరం ముఖం కడుక్కుని వచ్చాడు. వస్తూ రెండు చేతుల్తో రెండు కాఫీ కప్పులు తీసుకువచ్చాడు. తన కప్పు అందుకుంటూనే భానుమూర్తి "ఇప్పుడెందుకోయ్ బయటకు వెడుతున్నాంగా యెలాగూ. ఎక్కడయినా తీసుకునే వాళ్ళంగా" అన్నాడు.

"ఆదివారంనాడు కూడా బయటి కాఫీ దేనికోయ్"

"అవును-యివాళ నీకు ఆదివారం కదూ!" అన్నాడు భానుమూర్తి నవ్వుతూ.

"ఏం, నీకు కాదాయేమిటి?"

"నాకు అన్ని రోజులూ ఆదివారాలే. ఉద్యోగికి దూరభూమి లేదన్నట్లుగా నిరుద్యోగికి వారాలతేడా అంటూ యేం లేదు."

"కొత్త సామెతలు తయారు చేయడంలో నీకు నీవే సాటి."

"ప్రతివాడికీ యేదో ప్రజ్ఞ వుండాలిగా!"

సుందరం కాఫీ పూర్తిచేసి తిరిగి ఈజీ చైర్‌లో జారగిల పడ్డాడు.

"మళ్ళీ కుర్చీలో కూనిరాగం-మొదలెట్టకు. బట్టలు మార్చుకో బయలుదేరుదాం" అన్నాడు భానుమూర్తి.

"ఇంకా నాలుగే కదుటోయ్ అయింది





అయిదు గంటలకు బయలుదేరితే చాలదూ ?"

"నయం. అరున్నరకు అలా మొక్కుబడి తీర్చుకున్నట్లు వెళ్ళివస్తే సరిపోదా అన్నావు కాదు"

"ఆరుగంటలకు కదా ప్రోగ్రాం ప్రారంభం అన్నావు"

"అవును. మనం పెద్దలం-ఒకగంటయినా ముందుగా అక్కడ వుండద్దూ ?

"ఎందుకు ? అందరినీ భయపెట్టటానికా??"

"నీకు ఎన్నిమార్లు చెప్పినా అర్థంకాదు. నన్ను ఊరికే ఏడిపించకు. ఊఁ ఊఁ... బయలుదేరు."

సుందరం ఏమీ మాట్లాడలేదు. ఊరికే వాదన పెంచటం అతనికి యిష్టంలేదు.

మాటమార్చి మళ్ళీ పెడదామనుకున్నా అంత తేలికగా బోల్తాపడే మనిషికాదు భానుమూర్తి. అతని మనసులో పురుగు తొలవడం ప్రారంభం కావాలేగాని, తను తిన్నగా వుండడు, ఇతరులను అలా వుండనివ్వడు.

సుందరం తయారయ్యేటప్పటికి నాలుగున్నర అయింది.

"పేపర్లో విశేషాలు ఏమిటి ?"

"ఆ గందరగోళంలో నేను యిరుక్కోను"—

సుందరం తాను ఉదయంనుండి చదువుతూవున్న పుస్తకం గురించి చెప్పటానికి ప్రయత్నం చేశాడు. భానుమూర్తి అతన్ని వినిపించుకోలేదు.

ఇద్దరూ రోడ్డుమీదకు వచ్చిన తర్వాత టాక్సీని పిలవడానికి ప్రయత్నం చేశాడు భానుమూర్తి.

"ఎందుకయ్యా అనవసరమయిన ఖర్చు, సాయకాలంపూట చల్లగాలికి నాలుగు అడుగులు వేస్తే సరిపోతుందిగా ఎక్కువమీరమా యేమన్నానా ?" అన్నాడు సుందరం.

వాళ్ళు యెంత విరామంగా నడుచుకుంటూ టౌన్ హాలుకు వెళ్ళినా యింకా పావుగంట సమయం వుండనే వుంది.

జనం అప్పుడప్పుడే వస్తున్నారు. అప్పటికో యాభైమంది హాల్లో కూర్చున్నారు. వేదికమీద ఎవరూ లేరు. గులాబీ రంగు కర్టెన్ యింకా విడలేదు. పక్కనున్న గదిలో శకుంతల, పక్కవాద్యాల వాళ్ళు 'శృతులు' సరి చూసుకుంటూ కూర్చున్నారు. "ఆ గదిలోకి వెడదాం" అన్నాడు భానుమూర్తి.

"పానకంలో పుడకల్లాగ మనం ఎందుకు? హాల్లో కూర్చుందాం"అన్నాడు సుందరం.

"కాదు-కాదు కాస్త తెలిసిన ముఖాలు కనిపిస్తే మా చెల్లాయికి ఉత్సాహం వస్తుంది"అని భానుమూర్తి అటుగుంజుకుపోయాడు.

ఆ గదిలో పదిమంది దాకా కూర్చుని వున్నారు. అందరూ యేదో హడావుడిగా తీవ్రావేశంలో వున్నట్లే కనిపిస్తోంది. భానుమూర్తి చెల్లెలు యింకో చిన్న అమ్మాయితో యేమో మాట్లాడుతోంది. ఆ అమ్మాయి చేతిలో 'తంబుర' వుంది. వీళ్ళిద్దరికీ వెనకగా ఓ యాభైయ్యేళ్ళ ఆసామి కూర్చుని వున్నాడు. తాపీగా ఏవో సలహాలు అవీ యిస్తున్నాడు-అలా వుంది ఆయన ధోరణి.

"శకూ! నా స్నేహితుడిని తీసుకు వచ్చాను" అన్నాడు భానుమూర్తి.

శకుంతల చిరునవ్వు చిందించింది.

''నమస్కారం'' అని రెండు చేతులూ జోడించింది. ప్రతి నమస్కారం చేశాడు

సుందరం.

"వీరే మా చెల్లాయి గురువుగారు' అన్నాడుసుందరానికి వెనకాల కూర్చున్న పెద్ద మనిషిని పరిచయం చేస్తూ భాను మూర్తి.

సుందరం ఆయనకు నమస్కారం చేశాడు. ఆయన మందహాసం చేస్తూ తన పనిలో తాను వుండిపోయాడు. భాను మూర్తి కల్పించుకుని అక్కడున్న ప్రతి వాళ్ళతోనూ యేదో మాట కలుప బోయాడు. కానీ వాళ్ళు అతన్ని అంతగా పట్టించుకోలేదు. సుందరానికి యింకా అక్కడే నిలబడి వుండడం అసందర్భ మయిన పనిలాతోచింది.

"హాల్లోకి పోదాం పద" అన్నాడు భానుమూర్తితో చెవిలో.

"సరే పద" అంటూ అతను యివతలకు వచ్చాడు.

ఈసరికి హాలంతా దాదాపు నిండి పోయింది.

"చూశావా నేను చెప్పలేదూ?" అన్నాడు భానుమూర్తి.

''ఏమిటది?''

''హాలు నిండిపోయింది''

"అవును"

ముందువరసలో ఒక చివర 'రిజర్వ్డ్' అన్న అట్టలు పక్కకు పడేసి యిద్దరూ కుర్చీలలో ఆసీనులయినారు.

నియమిత సమయానికి రెండు నిమిషాలు ముందుగా శకుంతల వేదిక మీదకు వచ్చింది. పక్కవాద్యాల వాళ్ళు తమ పరికరాలతో వచ్చి కూర్చున్నారు. వాళ్లు వచ్చాక, హాల్లో అంతకు ముందువరకూ వున్న అలజడి, మాటల గందరగోళం క్రమక్రమంగా తగ్గిపోసాగింది. గుసగుసలుకూడా క్రమంగా తగ్గుతున్నాయి.

సుందరం మనసంతా కుతూహలం నింపుకుందుకు ప్రయత్నిస్తూ కూర్చున్నాడు.

సంగీత కచేరీ ప్రారంభం అయింది.

శకుంతల 'వాతాపి గణపతింభజే!' అన్న కీర్తన ప్రారంభం చేసింది. సుందరం స్తబ్ధుగా వింటూ కూర్చున్నాడు.

సంగీతాన్ని గురించి అతనికి యేమీ తెలియదు. కాకపోతే సంగీతం వినడంలో కొంత ఆనందం వున్నదని విన్నాడు.

ఒకదాని తర్వాత మరొకటిగా శకుంతల పాటలు పాడుతోంది. ఏకాగ్రంగా విననివ్వకుండా, భానుమూర్తి 'రన్నింగ్ కామెంటరీ' లాంటిది యిస్తున్నాడు సుందరం చెవిలో.

''ఇది శంకర భరణం''

"ఇది త్యాగరాజుగారి కీర్తన"

''ఈ రాగంలో ప్రత్యేక శిక్షణ యిచ్చారు మా గురువుగారు''

ఈకీర్తన 'నెరవు' చేసి పాడుతుంది, గమనించు-

''ఆహా స్వరం చక్కగా తాళానికి వస్తోంది...'' యిలా...

అతని వ్యాఖ్యానాలు సాగిపోతున్నాయి.

బహుశా యివన్నీ సంగీతం తాలూకు 'టెక్నికల్' వివరాలు అనుకున్నాడు సుందరం. భానుమూర్తికి యివన్నీ ఎలా తెలుసును ? అనుకున్నాడు కూడా మధ్య మధ్య. అతనికీ వివరంగా తెలిసి వుండవు. ఇంట్లో వాళ్ళు అనుకుంటూ వుంటే ఆ మాటలు పట్టుకుని వుంటాడు. తనకూ సంగీత జ్ఞానం వున్నది అని




ప్రదర్శించటానికి అన్నీ తెలిసినట్లుగా మాట్లాడుతున్నాడు. భానుమూర్తి పద్ధతి అది.

సుందరం హాలంతా కలయచూశాడు. జనం ఉత్సాహంగా కనిపిస్తున్నారు.తలలు వూపేవాళ్లు, చేత్తో కుర్చీ బద్దల మీద తాళంలాగ వేసేవాళ్లు, నోరంతా తెరచుకుని ఆవలించబోతున్న వాళ్ళలాగ కనిపిస్తున్నారు కొందరు.'కచేరీలో యింతగా 'ఇన్‌వాల్వ్' అయిపోయి వుంటారన్నమాట జనం' అనుకున్నాడు సుందరం.

మైకులోనుంచి సంగీత స్వరాలు అతిసూక్ష్మంగా ముందుకు వెళ్ళిపోతున్నాయి. లౌడ్‌స్పీకర్ల ద్వారా హాలంతా, హాలు బయటకూ ప్రసారం అవుతున్నాయి. వాతావరణం అంతా సంగీత తరంగాలతో నిండిపోతోంది.

పాటకు పాటకు మధ్య రెండు మూడు నిమిషాలు విరామం వచ్చినప్పుడు కూడా హాలంతా నిశ్శబ్దంగా అయిపోవడం లేదు. చప్పట్లు వినవస్తున్నాయి. చప్పట్ల నించి తేరుకున్న మనుషులు కబుర్లు చెప్పుకుంటున్నారు.

మళ్ళీ పాట ప్రారంభం కావటంతోటే హాలంతా కిక్కురు మన్నట్లు అయిపోతోంది.

శకుంతల 'రాగాలాపన' చేస్తున్నది.

సుందరం నిదానంగా వింటున్నాడు. ఒకే రోడ్డుమీద-చాలదూరంగా, దీర్ఘంగా ప్రయాణం చేస్తున్నట్లుంది ఈ ఆలాపన పద్ధతి. ఒక్కొక్కమారు ఈ ప్రయాణం సూటిగా వెడుతున్నట్లు వుంటుంది. మరోసారి గుండ్రంగా తిరుగుతూ వెడుతున్నట్లు, ఇంకోసారి అడుగులు ముందుకు వేసి మళ్ళీ వెనక్కు వస్తున్నట్లు వుంటుంది. కానీ ఒకటే రోడ్డు, ఒకే రహదారి. కొంతసేపు అయిన తర్వాత ఒక శిఖరాన్ని ప్రదక్షిణం చేసుకుంటూ పైకి ఎక్కుతున్నట్లు తయారయింది.

వింటూ కూర్చున్న సుందరానికి అకస్మాత్తుగా ఒక్క 'కుదుపు' వచ్చినట్లు అయింది. ఉన్నట్లుండి చాలా ఎత్తు మీద నుంచి కిందకు పడిపోయినట్లు అనిపించింది. ఈ అనుభూతి ఆశ్చర్యం. ఆలోచించగా రాగాలాపన ప్రారంభం అయి అలా పైపైకి వెళ్ళి కిందకు దిగుతూ వున్నానన్న స్పృహలేకుండా నేలమీదకు తిరిగి తెచ్చినట్లు సాగింది.

సుందరానికి ఆశ్చర్యం అనిపించింది.

ఇదంతా రెండు మూడు నిమిషాలలో జరిగింది. జాగ్రత్తగా పునరాలోచన చేసుకుందుకు ప్రయత్నించాడు - ఈ కాసేపు సమయంలో తనను ఏదో 'మెరుపు' ఆక్రమించు కున్నది; 'మరుపు' లోగున్నట్లు అయింది.

శకుంతల కీర్తన ప్రారంభం చేయడానికిముందు 'ఫిడేలు' ఆసామి చాలసేపు ఆ రాగాన్ని తను స్వంతంగా వాయించాడు. శకుంతల రాగాలాపన ప్రారంభం చేసినప్పుడు సుందరం స్పృహ లో నే వున్నాడు. హాల్లో జనాన్ని పరిశీలిస్తున్నాడు. తరువాత రాగాలాపన గురించి ఆలోచించాడు. ఆ ఆలోచనల్లోనే దానితో కలిసి పోయాడు. మనసు పరవశం అయింది. కొన్ని నిమిషాలు తన మనస్సును ఆకట్టుకునేట్లుగా రాగాలాపన జరిగిందన్నమాట. తనను తాను మరిచిపోవడంతోపాటు—యిక్కడ మనస్సు ఒక కొత్త ఉల్లాసాన్ని కూడా ఏర్పరచుకుంది. ఈ ఉల్లాసానికి కారణం- 'సంగీతమే' నని వితర్కించు కుంటున్నాడు అతను.



"ఇదేం రాగం ?" అనడిగాడు భాను మూర్తిని.

భానుమూర్తి అతని ముఖంలోనికి కాస్త వింతగా చూస్తూ "ఏం...కళ్యాణి కదూ" అన్నాడు.

సుందరం ఆ పేరు గుర్తుపెట్టుకున్నాడు.

ఈ సందర్భం నుండి సంగీత కచేరీ అంతా కొత్త స్థాయిలో జరుగుతున్నట్లు అనిపించసాగింది అతనికి.

ఇప్పుడే తాను నిజంగా సంగీతంలో పాలుపంచుకుంటూ వింటున్నాడు. ఒక రకమయిన రసానుభూతి అతన్ని ఆవరించింది. దీన్ని మరింత చేసుకోవాలని, పూర్తిగా ఆకట్టుకోవాలని అనుకుంటూ వుండగానే 'కచేరీ' ముగిసింది.

జనం చప్పట్లు ఆగడానికి ఈమారు పదిహేను నిమిషాలు పట్టింది. ఎవరో పెద్దమనిషి శకుంతల గానమాధుర్యాన్ని గురించి పావుగంటసేపు ఉపన్యాసం యిచ్చాడు.

సుందరానికి మటుకు యిందాకటి రాగఛాయలే యింకా చెవులలో వినిపిస్తున్నాయి.



## 2

"మా చెల్లెలు సంగీతం నువ్వు తప్పకుండా వినాలి. ఆహూతులయిన సదస్యుల ప్రథమ శ్రేణిలో నీకో కుర్చీ యేర్పటయి పోయింది. కాదనటానికి వీలులేదు!'' అని భానుమూర్తి అన్నప్పుడు ''చూద్దాంలే'' అని కొట్టి వేయడానికి చూశాడు సుందరం.

"చూద్దాంలే అంటే కాదు. ఎన్నిమార్లు చెప్పినా నీవు మాయింటికి రానేలేదు. ఇదే మొదటి కచేరీ. అందుకు తెలిసిన వాళ్ళలో ఎవరినీ వదలడం లేదు"

"క్షమించు భానుమూర్తి, కచేరీలు వినడం నాకు అలవాటులేదు. అంతసేపు కూర్చోగలనో లేదో!"

"నేను పక్కనే వుంటానుగా!"

తరవాత, సంభాషణ యింకేదో విషయం మీదికి మళ్ళించాడు సుందరం. అయినా గిరగిర తిరిగి సంగీతం మీదనే వాలింది, రెండు మూడు నిమిషాలన్నా గడవకుండానే.

"మన సంస్కృతి అంతా సంగీతంలోనే వుంది" అన్నాడు భానుమూర్తి.

సుందరం నీరసంగా నవ్వాడు.

"ఏం నీకు నమ్మబుద్ధి కావడం లేదా? మన త్యాగరాజు, శ్యామశాస్త్రి, దీక్షితులు, సుబ్బలక్ష్మి, మురళీకృష్ణ ..." అంటూ దండకం ప్రారంభించాడు భానుమూర్తి. అతనిదంతా అదో ధోరణి. ఏ విషయం పట్టుకుంటే అదే వారం పదిరోజుల వరకూ సాగదీస్తూ వుంటాడు. మరో విషయం దొరకడంతోటే వెనకటిది తేలికగా మరచి పోతాడు. కోతి ఒక కొమ్మ మీద నుంచి మరో కొమ్మ మీదకు దూకినట్లే అతని పద్ధతి.

"బొత్తిగా యీ మధ్య నీవు సంగీతం కళ్ళజోడు తగిలించుకొన్నావుసుమా!"

"అవును. త్యాగరాజుగారి కీర్తన కూడా వుంది అట్లాగని-"

"ఉంటే వుందిలే. నువ్వు మాత్రం యిప్పుడు పాడకు."

"జోక్ గనుక ఊరు కుంటున్నాను. ఈ జగ తంతా సంగీతమయం - ఆ విష యం తెలుసునా నీకు?"

-"అవునుగాని భానుమూర్తీ! ఒక విషయం చెబుతాను, కోపం చేయవు గదా?"

"ఎంతమాట-చెప్పు"

"మన సంస్కృతిలో కళలు ఒక భాగం. ఆ కళలలో సంగీతం ఒకటి. దీని మోస్తరుగానే మనసుకు ఆనందం యిచ్చేవి, మైమరపించేవి అనేక కళలు వున్నాయి. అటువంటప్పుడు సంగీతమే సర్వమూ అంటే యెలాగోయ్. ఈ రోజున నీకు యిష్టం అయింది గనుక దానికి పెద్దపీటవేస్తా నంటావు. అంతేగా!"

"తర్కించడం నాకు చేతకాదుగాని- సంగీతం సూటిగా మనిషి హృదయం లోనికి వెడుతుంది."

"ఏ కళయినా అంతే!"

"శిశుర్వేత్తి ... పశుర్వేత్తి ... అని సంగీతానికే చెప్పారు."

"ఆపు, దయచేసి. సంగీతం అంటే యేమిటి?"

"రాగయుక్తంగా పాటలుపాడడం-"

"అదికాదు నేను అనేది. కర్ణాటక సంగీతమా, హిందుస్తానీయా రవీంద్ర సంగీతమా లేకపోతే సినిమా పాటలా? యేది సూటిగా వెళ్ళేది?"

"శాస్త్రీయ మయిన సంగీతబాణి..."

అతని వాక్యం యింకా పూర్తి కాకుం డానే సుందరం "ఎందుకని? మీచెల్లాయి నేర్చుకుంటోంది కనుకనా?" అన్నాడు ఆ మాటలలో యేమీవేళాకోళం లేకుండా జాగ్రత్తపడుతూ.

"తినబోతూ రుచులెందుకోయ్. రేపు ఆదివారం వింటావుగా, అప్పుడు నువ్వే చెబుదువుగాని-"

అతని ఉత్సాహాన్ని పూర్తిగా చంపి వేయడం యిష్టంలేక సుందరం అక్క డితో ఆపివేశాడు.

* * *

ఆదివారం ఉదయం భానుమూర్తి ఎనిమిది గంటలకే వచ్చి కూర్చున్నాడు.

సుందరం యింకా న్యూస్ పేపర్లోంచి ముఖం పైకి తీయలేదు. స్నానం సంధ్య యేమీ అవలేదు.

"ఇంకా యిట్లాగే కూర్చున్నావ్? తొందరగా తెములు. నిన్న సాయంత్రం చెప్పిందంతా బూడిదలో పోసిన పన్నీరు అయిపోయిందా?" అన్నాడు, భానుమూర్తి

సుందరం పేపర్లోంచి ముఖంపూర్తిగా యెత్తకుండానే "ఏమిటి హడావుడి?" అన్నాడు.

"పొద్దున్నే వెడదామని చెప్పాను గదూ?"

"నేను రానన్నానుగా"

"నువ్వు అన్నావులే. కానీ నేను ఒప్పు కున్నానా?"

నిన్న సాయంత్రం యీ ప్రస్తావన వచ్చిన మాట నిజమే.

"మా చెల్లాయి రేపు ఉదయం యింటి దగ్గర ఫైనల్ రిహార్సల్ చేస్తుంది. నువ్వు కూడా రావాలి" అన్నాడు భాను మూర్తి అప్పుడు.

"రిహార్సల్ చూడటానికి ఇదేమన్నా నాటకమా? భానుమూర్తీ!"

"నీకు తోచిన సలహాలు..."

"చంపేశావు పో. నాకు సలహాలు తోచటమేమిటయ్యా"

"ఏం?"

"సప్తస్వరాలు యేమిటో తెలియని వాడిని పట్టుకుని..."

"అలా అంటే కుదరదు. నీవు వచ్చి తీరాలి"

"సంగీత కచేరీకి రమ్మన్నావుగా. వస్తానన్నాను. రిహార్సల్ వింటే కచేరీలో స్వారస్యం వుండదు భానుమూర్తీ నన్ను మానివేయి"

"ఆదివారం నీకు తీరుబడే గదా. యేం చేస్తావు?"

"తీరుబడేగదా అని అనవసరమయిన పనులు చేయమంటావా ?"

"అనవసరమా? స్నేహితుడిననే గౌరవం కూడా తీసి పారేస్తున్నావే. ఏదో సామెత చెప్పినట్లు..."

"కోపం తెచ్చుకోక భానూ! నేను వచ్చి రిహార్సల్ వినడం అనవసరం అన్నాను. అంతే! ఏ పని చేసినా ఎవరికయినా ఉపయోగంగా వుండాలిగా!"

"అసలు నీకు అభ్యంతరం యేమిటి చెప్పు?"

"ఒకటి కాదు. లక్షలు"

"అబ్బో చెప్పు చూద్దాం"

"నాకు సంగీతం రాదు..."

"సాయంకాలం కచేరీ ఎలాగూ విం టాం గనుక, ముందుగా రిహార్సల్ వినడం అనవసరం.

"నేను నీ స్నేహితుడినిగాని శకుంతలతో నాకేం పరిచయం లేదు"

"శకుంతల గురువుగారిని నేను ఎరగను. ఆయన యేవో సలహాలు సూచనలు యిస్తూ వుంటారు. సంగీత స్వారస్యం తెలియని వాడిని నేను. అక్కడ ఉండడం దండుగమారి పని.

"ఉదయం వార్తాపత్రిక చదువుతూ గడిపి వేయడమే నాకు ఆనందం.

"ఉదయం 'రొటీన్' భంగం అయిందంటే నాకు ఆ రోజంతా మామూలుగా వుండదు. ఏదో వెర్రి త్తి పోయినట్లు అవుతుంది. అందుచేత సాయంత్రం కచేరీకి రావడం కుదరకపోయినా ఆశ్చర్యం లేదు.

"............."

"చాలు మహానుభావా, చాలు. నోరు మూసుకు వింటూ వుంటే నీవు లక్ష కారణాలూ ఒప్పజెప్పేట్టున్నావు. నీతో వాదించి లాభం లేదు. రేపు ఉదయమే

వస్తాను. రెడీగా వుండు" అని వెళ్ళి పోయాడు భానుమూర్తి, అది నిన్న సాయంకాలం.

ఇప్పుడు మరిచి పోకుండా రానూ వచ్చాడు. సుందరం వాలకం చూసి అతనికి దాదాపు యేడుపు వచ్చినంత పనయింది.

"నువ్వు వస్తావని చాల ఆశ పెట్టుకున్నాను. నన్ను నిరాశ పుచ్చడం నీకు ధర్మం కాదు" అన్నాడు ఆఖరు అస్త్రం ప్రయోగిస్తూ.

"ఎందుకంత యిదవుతావు? సాయంత్రం ఎలాగూ వస్తానంటినిగా. ఈ పూటకు నన్ను వదిలెయ్యి"

"శకుంతలకూ చెప్పాను. నువ్వు వస్తున్నావని"

"చాల తప్పు చేశావు అంటాను. నన్ను అడిగితే, ఈ రిహార్సల్‌కు నువ్వు వుండడం కూడా అనవసరం"

"ఇంకా నయం. శకుంతల అసలు సంగీత కచేరీ చేయడమే అనవసరం అన్నావు కాదు"

భానుమూర్తి ముఖం చూస్తే సుందరానికి చాల జాలివేసింది. కానీ అతని అమాయకత్వానికి, అజ్ఞానానికి తాను కరిగిపోతే ఎట్లా?

సుందరం తమ్ముడు యిద్దరికీ కాఫీ తెచ్చి యిచ్చాడు.

భానుమూర్తి రెండు గుక్కల్లో కాఫీ పూర్తి చేసి "మరయితే సాయంత్రం నాలుగు గంటలకల్లా వస్తాను. నువ్వు మాత్రం సిద్ధంగా వుండాలి సుమా! కొత్తసాకుల కోసం వెదకకు" అంటూ పరుగు తీశాడు.

సుందరం నవ్వుకున్నాడు.



# 3

మధ్యాహ్నం యేమీ తోచక పుస్తకాల బీరువా సర్దడం మొదలు పెట్టాడు. రెండు మూడు నెలలకు ఒకమారయినా ఇలా చేయడం సుందరానికి అలవాటు. ఇంట్లోవున్న పుస్తకాలన్నీ దుమ్ముదులిపి జాగ్రత్త చేసుకోవడం అవసరం. అతని దగ్గర కొన్ని వందల పుస్తకాలు వున్నాయి. నవలలు, నాటకాలు, కథలు, ప్రబంధాలు... రకరకాలవి వున్నాయి. అవన్నీ చదవాలని పోగుచేసుకున్నాడు. కొన్నింటిని అయితే అసలు అట్ట విప్పి కూడా చూడకుండానే పడేశాడు.

తప్పకుండా చదవాలని తెచ్చుకున్న పుస్తకాలు చాలా భాగం అసలు చదవకుండానే వుండిపోతాయి. చదవాలనివుండే కాంక్ష చదవడంకంటే తీపి అయినది. ఇంట్లో అప్పుడప్పుడు పుస్తకాలు సర్దుతూ వున్నప్పుడు రెండు మూడు అతన్ని అమితంగా ఆకర్షిస్తాయి. వాటిని పక్కకు తీసివుంచుతాడు. సాంతం చదివేయాలని ఉబలాటంగా వుంటుంది. తీరా పుస్తకం తెరిచేసరికి ఇంకేదో పని గుర్తుకు రావడమో, ఇదివరకే చదివినట్లుగా వుండడమో, కాస్తజటిలంగావుంటే నిద్రరావడమో జరుగుతుంది. ఒక్కో పుస్తకం పేజీలు తిప్పడంతోనే సరిపోతుంది. మళ్ళీ పుస్తకాలు దుమ్ము

దులిపే 'టరన్' వచ్చినప్పుడు ఈ రెండు మూడు బీరువాలోకి వెళ్ళిపోయి, వాటి స్థానాన్నే మరో జత బయటకు తయారవు తాయి.

మధ్యాహ్నం భోజనం చేసిన తర్వాత రెండు పుస్తకాలు పక్కన పడేసుకుని కూర్చున్నాడు. ఒకటి కథల పుస్తకం. నాలుగుగయిదు పేజీలు చదివేసరికి ఇదివరకు చదివిన వాసన వచ్చేసింది. పక్కన పడేశాడు. రెండో పుస్తకం చేతుల్లోనికి తీసుకున్నాడు. ఏదో ప్రబంధం. ఇదీ ఇదివరకు చదివిందే కావచ్చునుగాని యెప్పుడు విప్పినా చదవ నట్లుగానే తెలియనట్లుగానే అర్థం కాకుం డానే వుండిపోతుంది ప్రబంధం. 'సాహిత్యపు' లోతుపాతులు అను భూతికి అందవు. సామాన్య వ్యక్తికి ఇవి సుదూరంగానే వుండిపోతాయి. అర్థంకాని పద్యాలు అదే పనిగా చదువుకుంటూ పోవడం కష్టంగదా! పోనీ కాస్త కష్ట పడి నిఘంటువు దగ్గర పెట్టుకుని చదువు కుందామంటే 'పద విభాగం' అయినా సరిగ్గా తెలియాలి గదా! —ఈ పుస్త కాలు చదవడంలో చాలా యిబ్బందులు వున్నాయి. వీటన్నిటినీ గడిచి 'కవి హృదయం' పట్టుకోవడం అంటూ జరి గితే అప్పుడు నిజమయిన ఆనందం చేకూరుతుంది. 'ఆనందానుభూతి' లో మునిగిపోగలిగిన వాడు 'ధన్యుడు' అంటారు. కానీ ఈ స్థితి తన లాంటి వాళ్ళకు అసాధ్యం అనుకున్నాడు సుందరం.

ఒక పద్యం చదివాడు. చాలా కష్టం క్రింద వేసిన టీకా తాత్పర్యాల సహా యంతో - విశేషాల వివరణలతో చదివి నప్పటికీ దాని భావం ఏమిటో లీలగానైనా తెలిసిరాలేదు. ఈ పద్యంలో ఒక స్త్రీ ముఖ సౌందర్యాన్ని వర్ణిస్తున్నాడు. ముఖం 'ముగ్ధమోహనం'గావుందంటాడు. మాటలు 'మోహనరాగం' ఆలపించినట్లు వున్నా యంటాడు. పద్యం పొడుగునా ఇలాగే అటు సాహిత్యపరంగానూ, ఇటు సంగీతపరంగానూ అర్థం చెప్పుకు ఆనం దించడానికి వీలువున్నదని క్రింద వ్రాసిన విశేషార్థాలలోవుంది. కవిత్వంలో యిదో చమత్కారమట! అలంకార ప్రాయంగా వుంటాయట యిటువంటి రచనలు. ఇక్కడ యింత విపులంగా రాశాడు గనుక యిటువంటి 'ప్రయో గాలు' వుంటాయని తెలిసిందిగాని లేక పోతే తనకు 'మోహన' రాగం అంటూ వొకటి వున్నదని యేం తెలుసును! ఆ రాగం పాడినప్పుడు యెలా వుంటుందో తెలిసేగదా ఆ అనుభూతి పొందడం జరిగేది! ఆ రాగ లక్షణాలు యేమిటో, దానిని పాడుతూ వున్నప్పుడు మోహన రూపం కళ్ళముందు కనిపిస్తుందో లేదో- యేం తెలుస్తుంది? మళ్ళీ యీ కళ్ళు మామూలువి కావు. మనసు తాలూకు, హృదయం తాలూకు కళ్ళు, ఇదంతా వెర్రి ఆలోచన కిందికి వస్తుంది దాదాపు. దీనివల్ల కాలయాపనతప్ప యింకేం ప్రయోజనంలేదు. ఎందుకంటే భావం తెలియకుండా మనసుకు ఆవేశంరాదు. ఆవేశం రాకపోతే అందులోవున్న ఆనందం యేమిటో తెలియదు.

* * *

కచేరీ అయిపోయినాగానీ యింకా రాగ ఛాయలను గురించే ఆలోచించు కుంటూ వుండగా మిత్రుడు భుజం మీద చేయి వేసి కుదపడంతో సుందరానికి

స్పృహ వచ్చినట్లయింది. కుర్చీలోంచిలేచి హాలు బయటకు నడిచాడు.

"ఇంక వస్తానోయ్. రేపు కలుసు కుందాం" అన్నాడు సుందరం.

"అప్పుడేకాదు, నీవు కూడా మాతో పాటు యింటికి రావాలి. అక్కడే భోజనంచేసి యింటికి వెళ్లుదువుగాని—" అన్నాడు భానుమూర్తి.

"వద్దు వద్దు భానుమూర్తీ! నన్ను మా యింటికి వెళ్ళనీ. రేపు తప్పకుండా కలుసుకుందాం" అంటూ సుందరం అతని జవాబు కయినా ఎదురు చూడ కుండా గబగబ రోడ్డు మీదకు వచ్చే శాడు.

అతని మనసంతా సంగీతమే ఆక్ర మించుకునివుంది యిప్పుడు.

ఇంటికివెళ్ళి యాంత్రికంగా భోజనం చేశాడు. చదువుకుందామని యేదో పుస్తకం చేతికి తీసుకున్నాడుగాని మనసుదాని మీద సుతరామూ నిలవలేదు.

ఉపేక్షగా చూస్తూవచ్చిన 'సంగీతం' యిప్పుడు పరవశంచేసింది. అతనికి ఆశ్చర్యం అనిపిస్తోంది. అంటే తనకు సంగీతాన్ని గురించి నిరసన వున్నదని కాదు. యాదృచ్ఛికంగా 'రసాస్వాదన' అనేది దానిలో ఇమిడివున్నదన్న సంగతి తనకు యింతవరకూ తెలియదు. ఈ ఆస్వాదనలో మనసుకు కావలసిన 'ఆనందం' లభ్యం కావడం యిప్పుడు తనకు ప్రత్యక్షంగా అనుభవంలోకి వచ్చింది.

ఇది అనుభవానికి రాకముందు యిలా జరిగేందుకు అవకాశం వున్నదని యెవ రయినా చెప్తూంటే తను నమ్మగలిగేవాడు కాదు. ఆ విద్యమీదవున్న ప్రత్యేక అభిమానంవల్ల వాళ్ళలా చెబుతున్నారని అనుకునేవాడు. ఈవిషయం భానుమూర్తి ముఖతఃచెప్పినట్లు అయితే అస్సలు నమ్మ బుద్ధి అయ్యేది కాదు. శకుంతల అతనికి చెల్లెలుగదామరి!

భానుమూర్తి నిజానికి యిలాంటి రసానుభూతి పొందే మాట్లాడుతున్నా డేమో అనిపించింది సుందరానికి, ఒక్క క్షణంపాటు. ఏమో! అనుభూతులకు పరీక్షలు, మీటర్లు వుంటాయిగనుకనా?

ఇంతవరకూ తనకు యిటువంటి మానసికమైన అనుభూతి కలిగినట్లే జ్ఞాపకంలేదు సుందరానికి. మనసుకు యెంతో నచ్చిన పుస్తకం చదువుతున్న ప్పుడు కూడా, తను పుస్తకం చదువు తున్నాననే విషయం మరుపునకు రాలేదు అతనికి. చదువులో యెంతో నిమగ్నుడై పోయినా, తనను తాను మరచిపోయినట్లు గుర్తులేదు. మొత్తంమీద సంగీతంలో 'మెస్మరిజం' లాంటి విచిత్రం యేదో వున్నదనిపించింది.

వింటూ వున్నప్పుడు కొన్ని క్షణాలు తనకు కలిగిన అనుభూతి మనసుకు మరుపురాకుండా వుండిపోయిందిగదా! తనకే యిలా అనిపిస్తున్నప్పుడు ఆ 'సంగీత కర్త' విషయం యింకెంతగా ఊహించుకుందుకు అవకాశం వున్నదో గదా! మరో విషయం కూడా సబబే అని పించింది. అదేమిటంటే, సంగీత కర్త తనకు తెలియకుండానే అటువంటి అను భూతిని శ్రోతలకు అందించగలగడం సాధ్యమేమో!' తనకు ఎంతో గొప్పగా 'అప్పీలింగ్'గా వుండే రసానుభూతి కలిగించిన అంశం యితర శ్రోతలకు పేలవంగా, నీరసంగా వుండేందుకు అవకాశం వున్నది.అందరి అభిప్రాయాలూ




ఒకేతీరుగ వుండవుగదా! అనుభూతులు మాత్రం ఒకే మూసలో పోసినట్లుంటాయని అనుకోవడం ఎట్లా?

ఏ అభిప్రాయాలు,ముందు ఆలోచనలు లేని తనకే యిటువంటి అనుభూతి కలిగినప్పుడు ఆశ్చర్యంలోకల్లా ఆశ్చర్యం యింతకు మించింది యింకేం వుంటుంది ?

—ఇలా ఆలోచించుకుంటూ వోయిన కొద్దీ సుందరానికి తాను ఆ క్షణాలలో విన్న సంగీత తరంగాలే చెవులచుట్టూ తిరుగాడుతున్నట్లు అనిపించసాగింది. అవి తన మనస్సులో గూడు కట్టుకున్నాయి.

ఇంత చక్కటి, చిక్కటి అనుభూతి ఆశ్చర్యమే అనిపించింది. కేవలం తన 'అపోహ'అనుకుందుకు లేదు. యదార్థం. ఈ విషయంలో మటుకు యెటువంటి అనుమానాలకు ఆస్కారం లేదు.

సుందరం దీనిని గురించే పుంఖానుపుంఖాలుగా ఆలోచించుకుంటూ నిద్రపోయాడు.



## 4

మిత్రుడు తన మాట కాదని గబగబ యింటికి వెళ్ళిపోవడంతో భానుమూర్తి అవాక్కై అయాడు. ఇంకా నయం-కచేరీ మధ్యలోనే అలా వెళ్ళిపోయినట్లైతే యెంతో రసాభాస అయిపోయేది అనుకున్నాడు.

తనతోపాటు సుందరాన్ని కూడా యింటికి తీసుకు వెళ్ళాలనీ, ఈ రాత్రంతా చెల్లెలు సంగీతాన్ని గురించే కబుర్లు చెబుతూ కూర్చోవాలనీ ఉబలాట పడిపోయాడు. అందుకనే ఉదయంనుంచి దాదాపు అతన్ని వదలకుండా జాగ్రత్త పడుతూ వచ్చాడు. ఆ ఉబలాటమంతా యిలా మధ్యలోనే తుంచివేసినట్లవడంతో అతను కొంతసేపు తలక్రిందులయిపోయాడు.

రెండు మూడు నిమిషాలు నిదానించి చూసుకుంటే, ఆలోచిస్తే సుందరం చేసినదానిలో అంత అసందర్భం యేమీ వున్నట్లు కనిపించలేదు అతనికి. ఏమంటే మొదటినుంచి చెబుతూనే వస్తున్నాడు సంగీతానికీ, తనకూ అంత సంబంధం లేదనీ, దీనిలో తనకు 'ఇంటరెస్ట్' అంటూ యేమీ లేదనీని. ఈ మూడు గంటలు కూర్చోమడమయినా తన బలవంతంవల్ల కూర్చొని వుంటాడు. బలవంతం చేస్తే చేశాడుకానీ, తన స్నేహితుడికి సంగీతంలో కాస్తో కూస్తో 'ఇంటరెస్ట్' కలిగించే ప్రయత్నంలో తను ఓ మెట్టు పైకి ఎక్కినట్లే లెక్క అని తేల్చుకున్నాడు భానుమూర్తి.

భానుమూర్తి, చెల్లెలున్న గదిలోకి వెళ్ళాడు. పక్క వాద్యాలవాళ్ళు అప్పుడే తమ సరంజామా సర్దుకుని ప్రయాణానికి సిద్ధంగా కూర్చున్నారు. గురువుగారు కుర్చీలో తాపీగా, నిండుగా కూర్చుని తనను పలుకరిస్తున్నవాళ్ళతో మాట్లాడుతున్నారు.

శకుంతల చుట్టూ అయిదారుగురు పోగయి వున్నారు. ఆమెను అదే పనిగా అభినందిస్తున్నారు. ఆమె చిరుమందహాసంతో వాళ్ళ మాటలను వింటూ

కూర్చున్నది.

భానుమూర్తిని చూడడం తోటే "వచ్చావా అన్నయ్యా, నీ స్నేహితుడితో కలిసి మమ్మల్ని మరచిపోయావేమోనని భయపడుతున్నాను" అంది శకుంతల.

అతను ముసి ముసిగా నవ్వుతూ "అతను...అతను...వేరే అర్జంటు పని వున్నదంటూ కచేరీ కావడంతోటే పరుగు తీశాడు. అందుకనే నేను రావడం యింత ఆలస్యం అయింది..." అన్నాడు. తన మాటలు పరస్పర విరుద్ధంగా వున్నాయన్న సంగతి గమనించే స్థితిలో లేడు భానుమూర్తి.

కార్యకర్తలలో ఒకరు వచ్చి "కారు సిద్ధంగా వున్నదమ్మా" అన్నారు.

స్నేహితురాళ్ళు, యితర శ్రేయోభిలాషులు శకుంతలకు చెప్పేసి వెళ్ళిపోయారు.

"గురువుగారూ రండి" అన్నాడు భానుమూర్తి. ఆయన చుట్టూ మూగివున్న మనుష్యులను పంపించి వేయడానికి యింతకంటే యింకో మార్గంలేదు కనుక-ముందు ఆయనగారి పీఠం కదిలిస్తేగాని వాళ్ళందరూ ఇళ్ళకు వెళ్ళరు. ఆయన చేతిలోని నశ్యం పట్టు అంతా ముక్కుల్లోకి ఎక్కించేసి, దుమాలుతో చేయి దులుపుకుని కుర్చీలోంచి పైకి లేచాడు. భానుమూర్తి ఆయన్ను వెంటబెట్టుకుని రోడ్డు మీదకు దారి తీశాడు. శకుంతల, బృందం వాళ్ళను అనుసరించారు. అందరూ కారులో కూర్చున్నాక కార్యకర్త వాళ్ళ వద్ద సెలవు తీసుకుని డ్రైవర్‌తో "అందరినీ ఇళ్ళ దగ్గర వదిలేసి త్వరగా వచ్చేసెయ్యి" అని




చెప్పాడు.

పది నిమిషాలలో శకుంతల ఇంటి ముందు ఆగింది కారు.

భానుమూర్తి, గురువుగారు, శకుంతల దిగారు.

వాద్యగాళ్ళతో సహా డ్రైవర్ ముందుకు నడిపించేశాడు కారు.

శకుంతల ఇంటి గుమ్మంలోనికి రావడంతోటే తల్లి దిష్టి తీసే ప్రయత్నం చేసింది.

"ఏమిటమ్మా యీ చేద స్తమంతా" అంది శకుంతల.

తల్లి ఆ మాటకేమీ పట్టించుకోకుండా తనపని తను చేసుకుపోయింది. అందరూ లోపలకు వచ్చి కూర్చోవటానికి దాదాపు అయిదు నిమిషాలు పట్టింది.

గురువుగారు కుర్చీలో సుఖాసీనులయిన తర్వాత శాంతమ్మ - శకుంతల తల్లి-ఆయన వంక ఆదరంగా చూస్తూ "అంతా బాగా జరిగిందా బాబుగారూ?" అనడిగింది.

"బహు భేషుగ్గా జరిగిందనుకోండి. శకుంతల నాకు తగిన శిష్యురాలు అనిపించుకుంది. నిజానికి నేనే ఇంటికి వెళ్ళి దిష్టి తీయించుకోవాలి - అనుకున్నాను" అన్నాడు గురువుగారు. ఆయన మాటల్లో ఆప్యాయత అంతటా రంగరించుకుని వుంది.

"అంతా మీ దయ బాబుగారూ! గురువు అనుగ్రహం వుంటే మా అమ్మాయి సంగీతంలో కాస్త పేరు తెచ్చుకుంటుంధి. మీ పేరు చెప్పుకుని రోజూ మా ఇంట్లో దీపం వెలిగించుకుంటాం" అంది.

ఆమె కళ్ళు సంతోషంతో, కృతజ్ఞతతో నిండి పోయాయి. ఎవరూ గమ

నించకుండా చీరకొంగుతో కళ్ళు ఒత్తుకుంది.

గురువుగారు గర్వంతో పొంగిపోయారు.

"నాదేం వుందమ్మా. అమ్మాయిది చక్కని గొంతు. ఓపికగా సాధన చేసిందంటే మరో సుబ్బులక్ష్మి అయిపోతుంది."

"తప్పకుండా అవుతుంది. అంతా మీ ఆశీర్వచనం" అన్నాడు భానుమూర్తి, సంభాషణ అంతా తనతో నిమిత్తం లేకుండా సాగిపోవడం ఇష్టంలేక.

"నీవు కూడా నన్నే పెద్ద చేస్తున్నావా? నాదేముందోయ్. నిమిత్తమాత్రుడిని. నేర్చుకునే వాళ్ళకు శ్రద్ధ వుంటే నేర్పే మనిషి ఎలాంటి వాడైనా పరవాలేదు. శిష్యుడు సిద్ధంగా వుంటే గురువు తనంత తానే సాక్షాత్కారం అవుతాడట!"

"మీకు కోపం వచ్చినా సరే-ఆ మాట నేను ఒప్పుకోను. మంచి 'నడవడి' లేకపోతే ఎంత చక్కటి గాత్రం అయినా ఎన్ని సంవత్సరాలు విడవకుండా 'సాధనం' చేసినా ఏం లాభం చెప్పండి. సంగీతానికి ముఖ్యమయినదల్లా చక్కని సాంప్రదాయం అబ్బడం అని మీరే చెబుతూ వుంటారు గదా!"

"అవుననుకో! కానీ, సాంప్రదాయానికి నేను ఒక్కడినేనా ఏమిటి? శకుంతల వంటి శ్రద్ధగల శిష్యురాలు దొరకడం నా అదృష్టం"

"గురువుగారిని ఈ పూట యిక్కడే భోజనం చేయమనవే" అని పక్కగదిలో నుంచి అరిచాడు గోపాలం.

గోపాలం శకుంతల తండ్రి. మూడేళ్ల క్రితం పక్షవాతం రావడంతో ఆయనక్కు పక్కలోనుండి లేచే అవకాశం లేదు.

ఆయన గొంతు వినడంతోటే గురువుగారు ఒక్కమారుగా కుర్చీలోనుంచి లేచి నిలబడ్డారు. ఆయన గదిలోకి పరుగు తీశారు.

"బాబుగారూ! మీరు నిద్రపోయినారేమోనని నేను లోపలకు రాలేదు. ఈరోజు నాకు చాల సంతోషంగా వుంది. అమ్మాయి అద్భుతంగా పాడింది సుమండీ! రసజ్ఞులు అందరూ మెచ్చుకున్నారు" అని గోపాలం ఎదురుగుండా కూలబడిపోయారు గురువుగారు.

గోపాలం పక్కలోనే కదలడానికి ప్రయత్నంచేస్తూ "అమ్మాయి చక్కగా పాడుతుంది. పాడక ఏం చేస్తుంది? దానికంతా వాళ్ళ నాయనమ్మ పోలికేవచ్చింది. పేరు కూడా అదే పెట్టుకున్నాం. మా అదృష్టం కొద్దీమీరు దొరికారు. అమ్మాయి మంచి సంగీత విద్వాంసురాలు అవుతుందని చిన్నప్పుడే దాని జాతకంలో రాశాను నేను" అన్నాడు ఎంతో భరోసాగా.

అందరూ మెచ్చుకునే విషయాన్ని ఆయన యింత సరళంగా 'కేజువల్'గా తీసిపారవేయడం భానుమూర్తికి కొద్దిగా కోపం తెప్పించింది. తండ్రి అంటే అతనికి చిరాకుగా వుండ డానికి యిదో కారణం.

గోపాలం యేదీ ఉన్నది ఉన్నట్లుగా ఒప్పుకోడు. ప్రతిదానికీ పూర్వాపరాలు జోడించి మాట్లాడుతాడు. ముఖ్యంగా తండ్రిగారి జ్యోతిష్యంలో అతనికి అట్టే నమ్మకంలేదు. అందుకు కారణం-తాను స్కూలు ఫైనల్ పరీక్ష తప్పుతానని ముందుగా తెలిసివుండి కూడ చెప్పకపోవడమే.

ఆ మాటకు వస్తే పరీక్ష ప్యాసవు

తానని భానుమూర్తి గూడ అనుకోలేదు. ఏ మాత్రం ఆశ పెట్టుకోలేదు. కాని తీరా పరీక్ష పోయిందని నికరంగా తెలిసిన మీదట తండ్రి తనను నాలుగు చివాట్లు వేయకుండా "అవును, ఎలా ప్యాసవుతావు? విద్యాస్థానాన్ని గురువు చూస్తూ వుంటే గదా! పైన కుజదృష్టి గూడాను. దశానాధుడయిన బుధ్ధుడు వక్రించి వున్నాడు.." అని తేల్చి చెప్పివేశాడు. భానుమూర్తికి అప్పుడు యేడుపు వచ్చింది, పరీక్ష పోయినందుకు కాదు- తండ్రి తనను యేమీ కోపం చేయనందుకు.

భానుమూర్తి యిప్పుడు, తనలో తానుగా వుండలేక "సరేలే, నాన్నా యిప్పుడు జాతకాల ప్రసక్తి ఎందుకట?" అన్నాడు.

ఇంతలో శాంతమ్మ లోపలకువచ్చి "అయ్యా. ముగ్గురికీ వడ్డించాను-రండి" అంది.

"బాబూగారూ! మీ భోజనం అయిందా?"

"ఇప్పటిదాకానా? నాకు వేరే పనేముంది గనుక!!"

భోజనాల దగ్గర యెవరూ యేమీ మాట్లాడ లేదు. శాంతమ్మ ముగ్గురికీ కొసరి కొసరి వడ్డించింది.

"బాబూ నీ స్నేహితుడిని తీసుకు వస్తానన్నావుగా!" అని అడిగింది ఆమె భానుమూర్తిని.

"అతను తొందర పని వున్నదని కచేరీ పూర్తిఅయి అవకుండానే పరుగు





తీశాడు. ఇంకోరోజు తీసుకువస్తాలే"—

ఆ జవాబు అతనికే సంతృప్తికరంగా లేదని అతని గొంతే చెబుతోంది. శాంతమ్మ యింకేమీ ప్రశ్నలు వేయ లేదు.

భోజనాలు అయ్యాక తాంబూలం సేవించి శిష్యురాలిని తృప్తిగా ఆశీర్వ దించి గురువుగారు తమ యింటికి వెళ్ళి పోయారు.

* * *

"నీకు ఎట్లా అనిపించిందిరా అన్నాయ్" అంది శకుంతల.

"గురువుగారు పెద్ద సర్టిఫికెట్ యిచ్చాక యింకా నాకు ఎట్లా అనిపించిం దని ప్రశ్నయేముంది? జనం కూడా అనేకమార్లు చప్పట్లు చరిచారుగదా!"

"చప్పట్లకేమిలే. ఒక మూల ఎవరేనా మొదలుపెడితే చాలు అందరూ అందుకుంటారు. అలా చప్పట్లు వినిపి స్తున్న సమయంలో పాడాలో, మానాలో తెలియక ఉక్కిరి బిక్కిరి అయిపో యాను నేను. మొత్తం మీద యేమీ చెడ గొట్ట లేదనుకుంటానులే. యేం?"

"ఏమయినా లోపాలు వుంటే గురువు గారు రేపు చెబుతారులే" అని భాను మూర్తి మళ్ళీ ఒక్క క్షణం తర్వాత "నా స్నేహితుడు చివరికంటా శ్రద్ధగా విన్నాడు సుమా!" అన్నాడు.

"అతనికి సంగీతం వచ్చునా?"

"అబ్బే రాదు. కానీ, మంచివాడు"

శకుంతల యింకేం మాట్లాడలేదు. భానుమూర్తి "రేపు అతన్ని గట్టిగా కనుక్కుంటాను - కచేరీ ఎలా వున్న దనీ!" అన్నాడు దాదావు స్వగతంగా.

శకుంతల తల్లి దగ్గరకు వెళ్ళి కూర్చుంది.

శాంతమ్మ అప్పుడే భోజనం కానిచ్చి లేచి, వంటగది సర్దు కోవడంలో మునిగి వుంది. కూతురును చూడడం తోటే "మళ్ళీ యిటు యెందుకు వచ్చావు? విశ్రాంతిగా పడుకోక పోయావా?" అంది. ఆమె మాటల్లో యెంతో ఆప్యా యత ఉట్టిపడుతోంది.

"నాకు నిద్దుర రావడం లేదమ్మా" అంది శకుంతల.

మళ్ళీ కాస్సేపాగి "నువ్వుకూడా రావాల్సిందమ్మా" అంది.

శాంతమ్మ శకుంతలను దగ్గరకు తీసుకొని తల నిమురుతూ "పిచ్చిపిల్ల!" అంది.

"మీ నాన్నగారు మంచంలో పడిన తర్వాత నేను యిల్లు కదిలి బయటకు అడుగువేసి యెరుగుదునా? నీవుచక్కగా సంగీతం నేర్చుకుంటే అంతే చాలమ్మా!" అంది.

శకుంతల తల్లి ఆప్యాయతలో కరిగి పోయింది.

కొన్ని క్షణాలు ఆలోచనలో పడి పోయింది.

నిజమే! నాన్నగారు పక్షవాతంతో మంచంలో పడినతర్వాత అమ్మ ఒక్క మారు యిల్లు కదిలి బయటకు రాలేదు. కానీ ఆమె యెందుకు రానంటున్నదో యిన్నాళ్ళూ కారణం మటుకు ఊహించ లేక పోయింది తను.

అమ్మకు ఎంత ఓపిక!

ఇంటి పనంతా తను ఒక్కత్తే చేసు కుంటుంది. పని మనిషిని కూడా పెట్టు కోదు. తనుగానీ, అన్నయ్యను గానీ జోక్యం కలిగించు కుంటే మీకెందు క్రా ఈ పనులన్నీ, మీచదువుసంధ్యలు మీరు చూసుకోండి చాలు" అంటూ

మందలిస్తుంది.

శకుంతల ఎందరో సాటి వాళ్ళను చూసింది.

వాళ్ళందరూ తమ యిళ్ళల్లో ఊడిగం చేస్తున్నట్లు, తప్పనిసరి అయి చాకిరీ చేస్తున్నట్లు, తమ యింట్లో తామే బానిసలం అన్నట్లు మాట్లాడతారు. కానీ తల్లి మటుకు ఒక్కనాడు అటువంటి మాటలు అనదు. సరిగదా, బాధగా నిట్టూర్చిన క్షణం కూడా తనకు గుర్తులేదు.

శాంతమ్మ వంట యింటి తలుపులు మూసి హాలులోనికి వచ్చింది. శకుంతల ఆమె వెనుకనే వచ్చింది భానుమూర్తి అప్పటికే తన పడకమంచం వాల్చుకుని పడుకున్నాడు. శాంతమ్మ ఒక్కమారు భర్త గదిలోకి వెళ్ళి చూసి వచ్చింది.

శకుంతల తనకు, తల్లికి పక్కలు పరిచింది. ఇద్దరూ మేను వాల్చారు. అయిదారు నిమిషాల్లోనే తల్లి నిద్రలో మునిగిపోవడం శకుంతల గమనించింది. తనకుమాత్రం నిద్రరావడంలేదు.

నిజానికి ఎంతో అలసిపోయింది గనుక పడుకున్న వెంటనే వేరే ఆలోచన ల్లేకుండా నిద్రపోవలసిన మాట. అలా కాకపోయినా, సంగీత కచేరీ చక్కగా జరిగిందన్న మానసిక ఆనందంతో ఉబ్బి తబ్బిబ్బు అవుతూ వుండవలసిన మాట ! కానీ యిప్పుడు మనసుకు నిద్రరావడం లెదు. ఆనందంతో తూగి పోవడమూ లేదు. మనసులోని లోపల పొరలు కదల బారినాయి.

పక్కమీద అటుయిటు దొర్లుతోంది తప్ప కంటిమీదికి కునుకు అన్నదే రావడంలేదు. అదే స్థితిలో శకుంతల చాల సేపు పడుకుని వుండిపోయింది. ఎప్పుడో నిద్రపట్టేసింది.

ఒక్కమారు ఉలిక్కిపడి లేచింది. లేచి కూర్చున్న తర్వాత యింతసేపూ నిద్రపోతున్న సంగతి గుర్తుకువచ్చింది.

అంటే యీ చప్పట్లు! సంబరం, పూలు, మాలలు-యివన్నీ కలలో జరగా యన్న మాట !

కలలో కూడా తను సంగీత కచేరీ చేసింది.

శ్రోతలు చప్పట్లు చరిచారు. ఎందరెందరో తనకు పూల మాలలు వేశారు. ఆ గందరగోళంలో, పూలమాలల బరువులో తను గొంతు విప్పి పాడలేక ఉక్కిరి బిక్కిరి అయిపోయింది. ఆ పరిస్థితిలోనే తనకు మెలుకువ వచ్చింది.

కలలో కూడా తను పాడుతూనే వుందా? కొన్ని క్షణాలు నివ్వెరపాటు కలిగింది శకుంతలకు. ఈ ఆలోచన రావడంతోటే కలను గుర్తు తెచ్చుకుందుకు ప్రయత్నించింది.

తన గొంతే తనకు బాగా గుర్తే. అయితే తన గొంతులో వున్న తియ్యదనానికి వెయ్యిరెట్లు మాధుర్యం.ఆ మాధుర్యానికి వెయ్యిరెట్లు సౌకుమార్యం ధ్వనించింది ఆ గొంతులో. తన గొంతేననడానికి యేం సందేహం లేదు. తన గొంతును పోలిన పోలికలన్నీ ఆ స్వరంలో వున్నాయి.

"కల కల్ల" అంటారు గదా!

తను కలలో పాడుతూ వుంటే, నిజంగా పాడడం చేతకాకుండా పోవాలి తనకు. ఈ ఆలోచన రావడంతోటే శకుంతల గజగజ వణికిపోయింది. పాటకు దూరం కావడం, ఊహకు అందని విషయం. పాడడం తప్ప తనకు యింకేమీ

చేతకాదు. తన జీవితం అంతా 'పాట కే అంకితం అయిపోవాలి. ఇదే అతి సహజ మయిన పరిస్థితి.

ఈ ఆలోచనలలో మళ్ళీ యెప్పుడు నిద్ర పట్టిందో శకుంతలకు తెలియదు.



# 5

జీవితం అనే పేరులోనే ఎన్నో యిరుకులు వంకరలు వున్నాయి.

ఎవరి జీవితమూ సరళ రేఖలాగ నడవదు. అలా నడిచి పోయేట్లయితే వేరే చెప్పుకోదగ్గ అనుభవాలంటూ యేమీ వుండవు. అనుభవాలు లేకపోతే యేది మధురమో, యేది కఠినమో తెలియదు.

కొన్ని జీవితాలు యెక్కువ చేదును జీర్ణించుకో గలుగుతాయి. ఏదో విపరీత మయిన సంఘటన జరిగి తాను ఎందుకూ పనికిరాకుండా మూల పడిపోయినప్పుడు తప్ప మనిషికి జీవితాన్ని గురించి యెక్కువ ఆలోచన కలుగదేమో అనిపిస్తుంది

అప్పుడు ఆ ఆలోచన కలగడంవల్ల ప్రయోజనం యేమిటి ? కానీ ముందు ముందు జీవితాలు భావ స్ఫూరకం అవడానికి అది అవకాశం కల్పిస్తుంది.

గోపాలం చరిత్ర కూడా దాదాపు యిటువంటిదే.

కాకపోతే ఆయనకు యీ ఆలోచనల వల్ల మరింత నిర్లిప్తత యేర్పడింది. విచిత్రంగా విడ్డూరంగా చెప్పుకోవలసిన సంఘటనలు యేమీ లేకుండా ఆయన జీవితం నలభైయి సంవత్సరాలు గడిచి పోయింది.

శ్రోత్రియమయిన కుటుంబం అనే పేరు తప్ప ఆయనకు యింకేమీ చెప్పుకో దగిన ఆస్తిపాస్తులు లేవు. సంసార బాధ్యతలు మీదపడిన తరువాత ఆయనో చిన్న ఉద్యోగంలో చేరుకున్నాడు. ఏ లోపమూ లేకుండా ఆ ఉద్యోగాన్నే చివరివరకూ జరుపుకుంటూ వచ్చాడు. ఉద్యోగం సంపాదించి పెట్టే జీతం డబ్బులతో సంసారం మితంగానే దొర్లించుకుంటూ వచ్చాడు. అతి ఆశలకు పోవడం గానీ, లేనివి కావాలనుకోవడంగాని ఆయన ఎప్పుడూ చేయలేదు. ఉన్న దానితో తృప్తి పడడం 'అంతా ఈశ్వరేచ్ఛ' అనుకుంటూ నిరామయంగా కళ్ళుమూసుకుని కూర్చోవడం ఆయనకు మొదటి నుంచి సహజమైన ప్రకృతి అయిపోయింది.

తనకు దేహ సంబంధమయిన బాధ వచ్చి మంచంలో నుంచి కదలలేని స్థితి యేర్పడినప్పటికీ ఆయన తన నిండు తనాన్ని పోగొట్టుకోలేదు.

"అన్ని రోజులూ ఒకటిగా నడుస్తాయా ? ఎలా నడవాలనివుంటే అలాగే నడుస్తాయి" అన్నారాయన తనను పరామర్శించటానికి వచ్చిన వాళ్ళలో ఆయనకంటే వాళ్ళే యెక్కువ బాధపడ్డారు ఆయనకు తటస్థించిన విపత్తుకు. అంటే ఆయనకు ఏమీ బాధలేదనికాదు. జీవితంలోని కష్టాలకు కుమిలిపోతూ కుంగిపోవడం కంటే, వాటిని యధాతథంగా స్వీకరించి వాటితో రాజీపడిపోవడం సజావయిన పద్ధతి అని ఆయన ఉద్దేశం.

ఆయన మంచంలో పడేటప్పటికి పెద్ద కుర్రాడు స్కూలు ఫైనలు పరీక్షకు వెళ్ళివున్నాడు. రెండవవాడు కింది తరగతులలో వున్నాడు. మూడవది ఆడపిల్ల శకుంతల.

ఇంకో పది సంవత్సరాలు ఆయన జీవితం యింతకుముందులాగానే సజావుగా నడిచినట్లయితే, యీ అనారోగ్యం కుటుంబ పరిస్థితులను అంతగా దెబ్బ తీయకపోయినట్లయితే బాగుండేది.

కానీ యేం అనుకుంటే లాభం ఏముంది ?

తిరుగులేని బాణంలాగ పక్షవాతం ఆయన్ను పడతోసింది.

భగవంతుడు తనకింకో పదేళ్ళు కులాసా జీవితం రాసి వున్నట్లయితే, కుటుంబ బాధ్యతలన్నీ పరిపూర్ణంగా నిర్వర్తించటానికి వీలుకలిగేది. పిల్లల చదువులు తాను అనుకున్నట్లుగా పూర్తి అయ్యేవి. వాళ్ళే ఒక మాదిరి ఉద్యోగాలలో చేరుకునివుండేవాళ్ళు. అమ్మాయికి తగిన వరుడిని చూసి హాయిగా పెళ్ళి జరిపించివుండేవాడు. అన్ని బాధ్యతలూ వదిలించుకుని తామిద్దరూ నిరామయంగా రోజులు గడుపుకుందుకు అవకాశం వుండేది.

కానీ అలా జరగలేదు. బాధ్యతలన్నీ మిగిలిపోయాయి. తానేమో నిరామయంగా మిగిలిపోయాడు. అన్ని బరువులు శాంతమ్మ మీద విరుచుకుపడ్డాయి.

జీవితంలో ఆ పది సంవత్సరాల కాలం తుడిచి పెట్టుకుపోయింది. పదేళ్ళలోనూ తాను చేయగల పనులు మాత్రం అట్టే వుండిపోయాయి. అనారోగ్యం నెత్తి మొత్తింది. చాలామంది యిటువంటి విపర్యయాలు జరిగినప్పుడు 'విధి వక్రించింది' అని చెప్పుకుని వాపోతారు. కనిపించిన వాళ్ళతోనల్లా. గోపాలం మటుకు 'ఈశ్వరేచ్ఛ' అంటాడు.

శాంతమ్మ దుఃఖం పైకిచెప్పుకుందుకు వీలయినదికాదు. ఎవరికని చెప్పుకోవడం? ఏమని చెప్పుకోవడం??

ఇంకా పదహారేళ్ళయినా నిండని పెద్దకొడుకుమీద కుటుంబభారం అంతా పడడం తలుచుకుంటే ఆమెకు లోలోపల దుఃఖం పొంగివస్తుంది.

ఆయన పక్షవాతంతో మంచంలో పడకముందు కుర్రవాడిని కాలేజిలో చేరుద్దాం అనుకున్నారు. కాలేజిలో చదువుకోవడాన్ని గురించి పాపం ఆ కుర్రవాడు యెన్నో ఆశలు పెంచుకున్నాడు కూడా. తీరా ఆ సమయం వచ్చేసరికి తల్లక్రిందులయిపోయింది అంతా. ఆఖరుకు స్కూల్ ఫైనల్ పరీక్ష బాగా ప్యాసయినాడన్న సంతోషం అనుభవించటానికయినా వీలులేకుండా పోయింది. గోపాలం మందుమాకులకు నిలవవేసుకొన్న కాస్త డబ్బు హరించిపోయింది. బంధువర్గంలో ఎవరి దగ్గర నుంచి ఆర్థిక సహాయం రాలేదు. నాలుగయిదు నెలలు గడిచేటప్పటికి గోపాలం సుస్థిరమయి కూర్చుంది. ఈ కుటుంబం యింక ముందు యెలా గడుస్తుంది – అన్న ప్రశ్న మటుకు మిగిలిపోయింది.

పెద్ద కుర్రవాడు రమణకు యెక్కడయినా ఉద్యోగం చూసుకోవడం యోగ్యమయిన పనిగా అనిపించింది. ఓ ఉద్యోగం సంపాదించుకుని నాలుగు రాళ్ళు తెగలిగితే తప్ప జీవితం జరగదు. కుటుంబం నడివీధిని పడకుండావుంటుంది




అయితే ఉద్యోగాలు అంత అవలీలగా దొరుకుతాయా ?

రమణ విసుగు విరామం యెరగకుండా ఉద్యోగ ప్రయత్నాలు చేశాడు. ప్రతిరోజు సాయంత్రం పూట తల్లికి వివరించి చెబుతూవుండేవాడు తను చేసిన ప్రయత్నాలు, పడ్డశ్రమ అంతా. ఆమె నిర్వికారంగా వింటూ కూర్చునేది.

ఒకరోజు అమ్మా, నా చదువుకు చిన్న గుమాస్తా ఉద్యోగం సంపాదించగల అర్హత వున్నమాటనిజమే. అయినా కొద్దిపాటి ఉద్యోగాలకే బాగా చదువుకున్న వాళ్లు కూడా ఎగబడుతున్నారు. గుమాస్తా ఉద్యోగంకంటె కిందివుద్యోగం చేస్తావా—అని అడిగారు యివాళ ఒకాయన. ఏం జవాబు చెప్పాలో తెలియక ఆలోచిస్తున్నాను" అన్నాడు.

ఆమె మాత్రం యేం సలహా యివ్వగలుగుతుంది ?

కొడుకు ముఖం వంక ఆర్ద్రంగా చూసింది.

రమణ ఆమె ముఖంలోని భావాలను అతి అవలీలగా చదవగలిగాడు.

ఫలితంగా అతను తాలూకా ఆఫీసులో 'అటెండరు' ఉద్యోగానికి కుదురుకున్నాడు.

ఉద్యోగంలో చేరి వచ్చిన సాయంకాలం తల్లితో ఇలా అన్నాడు "సరేనని చెప్పానమ్మా. ఈ రోజే మంచిరోజని చేరిపొమ్మన్నారు. ఒకటి రెండేళ్ళు యీ ఉద్యోగం జాగ్రత్తగా చేసుకుంటే 'గుమస్తా'గా ప్రమోషన్ యిస్తానన్నారు. ఊరకే ఉండడం కంటే యిదయినా చేస్తూ వుండడం మంచిదని చేరిపోయాను. నాకేం కొత్తగా లేదమ్మా. చదువుకున్నవాడిని కదా అని అందరూ గౌరవంగానే చూస్తున్నారు."

ఈ మాటలకు శాంతమ్మ యేమీ సమాధానం చెప్పలేదు.

ఆనాటి నుండి ప్రతిరోజూ ఉద్యోగానికి వెళ్ళడం, నెల నెలా జీతం డబ్బులు తల్లికి అందిస్తూ వుండడం అతని వంతు అయింది. కొడుకు తెచ్చియిచ్చే కొద్దిపాటి డబ్బుతో కుటుంబం గుంభనగా వెళ్ళదీయడం శాంతమ్మవంతు అయింది.

* * *

రోజులు నెలలు, నెలలు సంవత్సరాలు అయే సరికి యీ కొత్త వాతావరణానికి యింటిల్లిపాదీ అలవాటు పడిపోయారు.

మంచంలోనే వుంటూ యెవరయినా పలుకరించినప్పుడు జవాబులు చెబుతూ వేళపట్టున నాలుగు మెతుకులు తిని పడుకోవడం గోపాలం పని.

నిర్లిప్తంగా యింటెడు చాకిరీ చేసుకుంటూ, యే సమయానికి యెవరికి యేం కావాలో అన్నీ అమరుస్తూ వుండడం శాంతమ్మ పని.

పెద్ద కొడుకు రమణ అటెండర్ నుంచి గుమాస్తాగా అవనే అయ్యాడు. రాబడి కొద్దిగా పెరిగింది. దీనితోపాటు సంసారం ఖర్చులూ తగు మాత్రంగా పెరగనే పెరిగాయి.

రెండవ కుర్రవాడు భానుమూర్తి పెరుగుతూవున్న సమయంలోనే అతన్ని గురించి శ్రద్ధగా పట్టించుకున్నవాళ్ళు గానీ, అతని చదువుసంధ్యలను గురించి వాకబు చేసినవాళ్ళు గానీ లేకపోయారు. అందుచేత అతను కింది తరగతులలో యెలాగో నెట్టుకు రాగలిగినా, స్కూల్ ఫైనల్ దగ్గర బోల్తా కొట్టక తప్పలేదు.

అతనికి స్కూలు చదువుల మీద కంటే ప్రాపంచిక విషయాలు, స్నేహితులతో కలిసి కులాసాగా కాలక్షేపం చేయడం వంటి పనుల్లో ఉత్సాహం, ఆసక్తి ఎక్కువ. ఇంట్లో వున్న వాళ్ళందరూ యేమాత్రం యింగిత జ్ఞానం లేని వాళ్ళనీ, కాస్తో కూస్తో లెక్కలో మనిషి తను ఒక్కడే నేననీ అతని దృఢ విశ్వాసం. అతని విశ్వాసాన్ని యింట్లో యెవరూ పనికట్టుకుని ఖండించలేదు కూడా. దీన్ని పట్టించు కుందుకు యెవరికి తీరుబాటు గనుక ?

ఇకపోతే - శకుంతల. ఎలిమెంటరీ స్కూలు చదువుతూనే బడికి వెళ్లడం మానేసింది. ఇంటిపట్టునే వుండి తల్లికి యేదయినా సాయంచేస్తూ వుండడం, తీరిక సమయాలలో యిరుగు పొరుగు ఆడ పిల్లలలో ఆటపాటలతో గడిపి వేయడం ఆ అమ్మాయి పనులు. అమ్మాయి 'కంఠం' చాల శ్రావ్యంగా వుంటుందని తల్లి తండ్రి చిన్నతనం నుంచి అనుకుంటూ వుండే వాళ్లు. గోపాలం బాగావున్న రోజులలో "మన అమ్మాయి గొప్ప జాతకురాలు అవుతుంది" అని చెబుతూ వుండే వాడు భార్యతో

"మంచిదే-ఎంత గొప్ప జాతకురాలు అయినా మనకు ఒరిగేది యేంవుంటుంది? ఆడ పిల్లను ఎప్పటి కయినా ఒక అయ్య చేతిలో పెట్టి నమస్కారం చేయవలసిందేగా! అబ్బాయిల విషయం చెప్పండి." అనేది ఆమె.

"సామాన్యం, సామాన్యం-" అనే వాడు ఆయన చాలా సేపు ఆలోచించి.

ఆయనకు శకుంతలను గురించి మాట్లాడుతున్నప్పుడు వుండే హుషారు కొడుకులను గురించి ప్రస్తావించేటప్పుడు కనిపించదు.

బడి మానివేసిన తర్వాత శకుంతల తల్లి దగ్గర ఆధ్యాత్మ రామాయణ కీర్తనలు, ఇతర సాంప్రదాయపు పాటలు నేర్చుకుంటూ వుండేది కానీ శాంతమ్మకు తానువున్న స్థితిలో కూతురుకు ఉత్సాహంగా పాటలు నేర్పే బలం కూడా లేకుండా పోయింది. గొంతెత్తి పాడటానికి ఆమెకు చేతనయేదికాదు. మనసులో ఆనందం లేకపోవడం, శరీరంలో నీరసం! అయితేనేమి, కూతురుకు యెలాగయినా సంగీత జ్ఞానం నేర్పించాలనే పట్టుదల మాత్రం ఆమెలో క్రమక్రమంగా ఎక్కువవుతూ వచ్చింది.

కేవలం సంగీతం చెప్పే స్కూళ్ళు ఆ ఊళ్ళోలేవు. ఎవరయినా మంచి సంగీతం మాష్టరును పెట్టి యింటి దగ్గరే చెప్పించు దామంటే అందుకు చాల ఖర్చవుతుంది. తమబోటి వాళ్ళకు యిటువంటి ఆలోచన చేయబోవడమే దుస్సాహసం!

"ఘటన అంటూవుంటే యేదో దారి యేర్పడకపోదు" అన్నాడు గోపాలం, శాంతమ్మ యివన్నీ తలుచుకుని కుమిలి పోతూ వున్నప్పుడు.

* * *

అన్నట్టుగానే గోపాలంగారి స్నేహితుడు ఒకాయన ఉన్నట్లుండి యీ వూరు వచ్చి పడ్డాడు. గోపాలంగారికి ఆయన చాల చిన్ననాటి స్నేహితుడు. పాతికేళ్ళ కిందట నుంచి యిద్దరూ ఒకరినొకరు చూసుకోవడం కూడా పడలేదు.

ఎక్కడో కొన్ని వందల మైళ్ళ దూరంలో వుండేవాడు. ఆయన ఈ ఊరు రావడమే విచిత్రం.

ఆయన సంగీతంలో మంచి కృషి చేసి, పేరు సంపాదించి, దాదాపు యిప్పుడు 'రిటైర్' అవబోయే స్థితిలో వున్నారు.

"మా ఊరి షావుకారు అరుణాచలం గారికి నా సంగీతం అంటే మక్కువట. తన పిల్లలకు ఇద్దరికీ సంగీతం నేర్పించ టానికి నన్ను యిక్కడకు పిలిపించాడు" అన్నాడు రామనాథం ఈ ఊరు వచ్చిన కొత్తలో గోపాలంగారిని కలుసుకున్నప్పుడు.

"అరుణాచలానికి అసలు సంగీతంలో ఇంటరెస్ట్ వున్నట్లు తెలియదే నాకు-"

"ఆయన అంటే ఆయనకే కాదు; ఆయన భార్యకు నా సంగీతం అంటే మక్కువట. నాపాత గ్రామ్‌ఫోన్ రికార్డులన్నీ వాళ్ళయింట అతిభద్రంగా వున్నాయి" అన్నాడు రామనాథం ముసిముసి నవ్వుతూ.

ఈ నవ్వులో కాస్తో కూస్తో స్వాతిశయం, గర్వం కూడా నిండి వున్నాయి.

రామనాథంగారికి ఈ ఊళ్ళో ఒకటే పని. అరుణాచలంగారి అమ్మాయిలకు రోజూ ఒక గంటసేపు సంగీతం చెప్పడం, సాధన చేయించడం, ప్రతినెలా ఆయన ఇచ్చే డబ్బుతో గుట్టుగా కుటుంబ పోషణ చేసుకోవడం!

"నేను వచ్చి వారంరోజులే అయింది. నిన్న ఏదో మాటల సందర్భంలో అరుణాచలం మీ పరిస్థితి చెప్పారు. అప్పటివరకూ మీరు యిక్కడే వున్నా

రన్న ధ్యాసే కలుగలేదు నాకు. మీరు, నేను ప్రాణస్నేహితులం అని చెపితే అరుణాచలం కూడా చాల సంతోషించాడు.

గోపాలం, రామనాథం కంటె అయిదారేళ్ళు పెద్ద. రామనాథం తనకు ఎంత చొరవ వున్నప్పటికీ ఆయన్ను 'మీరు.. మీరు' అని మన్నిస్తూనే వుంటాడు.

"ప్రాణస్నేహితులం అని నీవే ఒప్పుకుంటున్నావు గదా! ఈ మన్ననలు ఏమిటయ్యా మన మధ్య —" అన్నాడు గోపాలం.

"అయ్యో - బాబుగారూ! మీరు నా కంటె చాల పెద్దవారు. నేను మీతో ఏ విషయంలోనూ సరితూగను. ఒకవేళ 'సమానం' అనుకున్నా,-నాకు రాబోయే ఏడు జన్మలలోను ముక్తి దొరకదు-" అని రామనాథం తన గౌరవ ప్రపత్తులు తెలియ పరిచాడు.

స్నేహం ఈ రకంగా పునరావృత్తం అవడంవల్ల రామనాథం తన తీరిక సమయం చాలా మటుకు గోపాలంగారితోటే గడిపేవాడు. అలా కాలక్షేపం చేయడంలో ఆయనకు ఎంతో ఆనందం వున్నదని రోజుకోసారయినా గుర్తు చేస్తూ వుంటాడు.

ఒకరోజు రామనాథం గోపాలం ఇంటి గుమ్మం ఎక్కుతూ వున్నాడు. లోపల నుంచి శకుంతల పాట వినిపించింది. అరుగు పక్కన నిలబడి పాట పూర్తయే వరకూ తాపీగా నిలబడి పోయాడు.

లోపలకు వస్తూనే గోపాలంతో "బాబుగారూ అమ్మాయి గొంతు అతి శ్రావ్యంగా వుంది" అన్నాడు. శకుంతలను పిలిపించి తన దగ్గర కూర్చోబెట్టుకుని మరి రెండు పాటలు పాడించుకుని విన్నాడు, మురిసిపోయాడు.

"బాబుగారూ! నేనోమాట చెబుతాను వింటారా?"

"ఏమిటది ?"

"అమ్మాయికి శాస్త్రీయ సంగీతం చెప్పించండి"-ఆయన గొంతులో అనురాగం, అభినందన ఉట్టిపడుతున్నాయి.

గోపాలం ఏమీ మాట్లాడకపోవడంతో రామనాథమే మళ్ళీ "అమ్మాయికి సంగీతం నేర్పితే, శాస్త్రానికే అలంకార ప్రాయంగా తయారవుతుంది"అన్నాడు.

గోపాలం ఈ మారూ ఏమీ మాట్లాడలేదు.

"బాబుగారూ! ఏదో ఆలోచనలో పడ్డారేమిటి ? సంగీతం అంటే మీకేం ఇష్టం లేకపోవడం లేదుగదా! మీకేమీ అభ్యంతరం లేకపోతే అమ్మాయి సంగీత శిక్షణ వ్యవహారం అంతా నేను బాధ్యత తీసుకుంటాను. నాలుగు ముక్కలు సంగీతం నేర్చుకున్నందువల్ల ఏమీ నష్టం లేదుగా"

గోపాలం హృదయం ఆనందంతో నిండిపోయి వుండాలి. ఆయన కంఠంలో ఈ ఆనందం తొణికిసలాడింది "అలాగే కానివ్వండి. అంతకంటే భాగ్యమా!" అన్నప్పుడు.

లోపలిగదిలో నుంచి ఈ సంభాషణ వింటున్న శాంతమ్మ ఉక్కిరి బిక్కిరి అయిపోతోంది. తన మనసులోని కోరిక గమనించి, స్వర్గంలోని దేవతలు రామనాథం గారిచేత యిలా పలికిస్తున్నారు. మనసులోనే ముక్కోటి దేవతలకూ నమస్కారం చేసింది.

"శుభస్య శీఘ్రం. ఈ రోజు సప్తమీ




శుక్రవారం. చాలా మంచిరోజు. ఈ రోజే సంగీతపాఠం ప్రారంభిస్తాను" అన్నాడు రామనాథం.

శకుంతల ఆయనకు ఎదురుగా సుఖాసీను రాలయింది.

రామనాథం ఆమెచేత "స...ప...స" పలికించాడు.

మొదటి పాఠం పూర్తయింది. "ఇక వెళ్ళి ఆడుకో తల్లీ" అన్నాడు ఆయన.

శకుంతల దిగ్గున లేచి ఆయన పాదాలకు నమస్కారం చేసింది.

"చక్కగా సాధనం చేయమ్మా, నీలో సంగీత సరస్వతి అవతరిస్తుంది" అంటూ ఆయన గోపాలం గారితో "అమ్మాయిని మీరు కూడా ఆశీర్వదించండి" అన్నాడు.

శకుంతల తండ్రి దగ్గరకు వెళ్ళింది. ఆయన ప్రేమగా ఆమె తల నిమురుతూ క్షణంపాటు కళ్ళు మూసుకొని మనసులోనే ఆశీర్వదించాడు.

ఆ రోజు లగాయితు రామనాథం ప్రతి రోజూ అదేవేళకు శకుంతలకు సంగీత పాఠం చెబుతూ వచ్చాడు.

ఆ రోజు నుంచి ఆ యింట్లో ఆయన పేరు 'గురువుగారు'గా స్థిరపడిపోయింది. ఆయన స్థానం మరింత గౌరవప్రదంగా రూపొందింది.

శకుంతల చక్కగా అభ్యాసం చేసింది.

జంటస్వరాలు, సరళీస్వరాలు, పిళ్ళారి గీతలు, వర్ణాలు, కీర్తనలు-క్రమక్రమంగా స్వాధీనంలోనికి వచ్చాయి.

గిర్రున నాలుగు సంవత్సరాలు తిరిగేసరికి ఆమె సంగీత స్వరూపానికి స్థిరమయిన ఒరవడి ఏర్పడింది. చెప్పింది చెప్పినట్లుగా సాధన చేయడం, విన్నది విన్నట్లుగా ఆలాపన చేయడం అనే మెలుకువలు ఆమెకు అలవాటు అయినాయి. దీనితో గురువుగారికి మరింత ప్రోత్సాహం యేర్పడినట్లయింది. సంగీతంలోని మెలుకువలు అన్నీ జాగ్రత్తగా నేర్పుతూ వచ్చాడు. శకుంతల వీటి నన్నిటినీ ఆచరణలో పెట్టి రాగం ఆలపిస్తూ వున్నా కృతిపాడుతూవున్నా గురువుగారు సంతోషంతో పరవశం అయిపోతూ వుండేవాడు. సంగీత సముద్రంలో అతి సునాయాసంగా యీదుకుంటూ పోతున్నట్లు అయింది ఆయనకు.

"చూడండి బాబుగారూ! ఇదివరకు ఏమిటో అనుకునే వాడినిగాని యిప్పుడు నాకూ పూర్వజన్మ సంస్కారంలోను, కర్మలోనూ కొంత కొంత నమ్మకం ఏర్పడుతూ వుంది సుమండీ!"

"అంతా కృషి రాఘనాథం! చేసిన కష్టం ఎప్పుడూ ఉరికేపోదు. ఈజన్మలో కాకపోతే మరుజన్మలోనయినా పెట్టి పోషిస్తుంది."

"అరుణాచలం కూతుళ్ళకు తలబాదుకున్న సంగీతం నెత్తికి యెక్కడంలేదు. ఆయన సొమ్ము తింటూ వున్నందుకు నాకే సిగ్గుగావుంది. శకుంతలకు అందిస్తే చాలు, అల్లుకుపోయే తెలివి తేటలు వున్నాయి. పూర్వజన్మ సంస్కారం అంటే యింతకన్నా గొప్ప ఉదాహరణ ఏం కావాలి?"

"ఎక్కడో పడివున్న వాడివి నీ శిష్యరికం దొరకడంకదూ అసలు కారణం ఆ మాట చెప్పవేం?"

"నాదేముంది బాబుగారూ! నిమిత్త మాత్రుడిని. అతి కొద్ది కాలంలోనే అమ్మాయికి స్థిరమయిన ప్రజ్ఞ ఏర్పడడం మీ పూర్వజన్మ సుకృతమే-కాదనకండి"



"సంస్కారం ఎలావున్నా వుండనీ యండి. అది నిలదొక్కుకోవటానికి యీ జన్మలో అవకాశం లభించడం ఒకమెట్టు ఈ అవకాశాలు వినియోగించుకుంటూ సత్ఫలితాలు పొందడం మరో మెట్టు."

"ఏమయినా చెప్పండి. శకుంతలకు సంగీతం నేర్పడంవల్ల నా జన్మధన్యం అయిందనుకుంటున్నాను" అన్నాడు రామనాథం మనసారా ఆనందపడిపోతూ.



# 6

"ఏమోయ్ భానుమూర్తీ! కనిపించడమే మానేశావు?" అన్నాడు సుందరం; ఎదురుగా నిలుచున్న మనిషిని గమనించి

"ఎవరు కనిపించనిది ? నీవానేనా?" అంటూ భానుమూర్తి పేపరు అందుకున్నాడు.

"రెండు రోజుల నుంచి నీవు కనిపించకపోతే, నీకు కోపం వచ్చిందేమోనను కున్నాను"— సుందరం అప్పుడే నిద్ర మంచం మీదినుంచి లేస్తున్నాడు.

"నాకు కోపమా ? నీ నిద్రంతా పాడు చేశానని నన్ను తిడతావేమోనని భయపడి చస్తున్నాను."

సుందరం మంచం మీదనుంచి దిగి ఆవలించి శరీరం విరుచుకుని "రెండు నిమిషాలలో వస్తాను" అన్నాడు— లోపలకు వెళుతూ.

భానుమూర్తి దినపత్రిక తిరగవేయ సాగాడు.

అన్నట్లుగానే సుందరం రెండు నిమిషాలలో వచ్చాడు.

అతనితో పాటు రెండు కప్పుల కాఫీ కూడా వచ్చింది.

ఇద్దరూ కాఫీ తాగుతున్నారు. సుందరం తానే ముందుగా ప్రస్తావన ప్రారంభించాడు. "చెప్పు. ఎందుకు కనిపించకుండా మాయం అయిపోయావు'

భానుమూర్తి నవ్వుతూనే "రోజూ నీ దగ్గర అటెండెన్స్ వేసుకోవాలని నాకేమయినా రూలు వుందా ? నాకు తీరుబడి అయినప్పుడు వస్తాను" అన్నాడు.

"అదే, నీకు తీరుబడి కానంత పని ఏం వచ్చింది...అని"

"తీరుబడి వుండటానికి నాకు నీ మాదిరి స్థిరమయిన వుద్యోగంలేదు. ఊళ్ళో వున్న పనులన్నీ నావే. నిరుద్యోగికి ప్రతివాడూ పనిచెప్పేవాడే అయినా, నిన్న సాయంత్రం వచ్చాను. దొరగారు యింట్లోలేరు. నన్నేం చేయ మంటావు" అన్నాడు భానుమూర్తి.

"సరే! బాగానే వుంది. ఏమిటి చెప్పు కబుర్లు"

"నీవే చెప్పాలి"

సుందరానికి మనసులో చికాకు అయింది. సంగీతాన్ని గురించి 'వసపిట్ట' లాగ మాట్లాడే మనిషి తాను యిప్పుడు ఎంత 'డ్రైవ్' చేసినా మాట్లాడడమే లేదే! మొత్తంమీద వీడు ఘటికుడే-అను కున్నాడు.

"బజారుకు వెడదాం వస్తావా?"

"ఇప్పుడు బయటకు ఎందుకు ? ఆఫీసు టైంకూడా కావస్తోంది. ఇక్కడే

కబుర్లు చెప్పుకుందాం"

—సుందరానికి ఇంతకంటే యింకేం తోచలేదు జవాబు.

"ఇంట్లో కూర్చుంటే కబుర్లు యేం వుంటాయి? కబుర్లు, కాకరకాయలు కావాలంటే ఊళ్ళోకి ఎగబడాలి" అన్నాడు భానుమూర్తి యుక్తిగా.

సుందరానికి అతన్ని చితక గొట్టాలనిపించింది. కానీ తమాయించుకున్నాడు.

ఒక్క నిమిషం ఆగి భానుమూర్తే మళ్ళీ అన్నాడు. "ఈ రెండు రోజులూ యేం చేశావు? పోనీ ఒకమారు మా యింటికి వస్తావేమోనని అనుకున్నాను. తప్పించుకుంటున్నావు. ఆ రోజు రాత్రి కూడా అలాగే చేశావు!"

"ఏ రోజు రాత్రి?"

"అదేనోయ్. సంగీత కచేరీ జరిగిన రోజు రాత్రి. మా యింటికి రాకుండానే దూసుకుపోయావుగా. అయినా నీవు మాబోటి పేదవాళ్ళ యింటికి యెందుకు వస్తావులే" అన్నాడు భానుమూర్తి నిష్ఠూరం ధ్వనిస్తూ.

సంభాషణ తనకు కావలసిన మలుపు లోనికి వస్తున్నట్లు అనిపించింది సుందరానికి.

"అదేమిటోయ్. అలా కొత్తగా మాట్లాడుతున్నావు కావాలంటే ఇప్పుడు వస్తాను పద" అన్నాడు.

"ఇప్పుడెందుకూ ? తీరా నేను వచ్చి కూర్చున్న తరువాత!" అని ఒక్క-క్షణం ఆగి, "ఇంతకూ మా చెల్లాయి సంగీతం ఎలా వుందో నీవు చెప్పనేలేదు. నీ అంతట నీవే చెబుతావులెమ్మని నేను ఆ ప్రస్తావన తీసుకురావడం లేదు. ఇంతకూ ప్రత్యేకంగా చెప్పవలసింది నీకేం కనిపించలేదన్నమాట!" అన్నాడు.

"ఈ రెండు రోజులలో నీవు నిష్ఠూరాలు వేయడం బాగా నేర్చుకున్నట్లు వున్నావు. కచేరీ గురించి చెప్పటానికి నాకు అర్హత ఏముంది చెప్పు. ఆ సంగతి నీకు మొదటినించి విన్నవించుకుంటూనే వున్నానుగా!"

"బాగోగులు చెప్పటానికి సంగీత విద్వాంసుడే కానక్కర్లేదు. నీ లెక్క-ప్రకారమయితే—ఏదో సామెత చెప్పినట్లు కచేరీకి వచ్చేవాళ్ళంతా సంగీతం వచ్చిన వాళ్ళే అయి వుండాలి. ఈ రోజులలో కథలు రాసేవాళ్ళు మాత్రమే కథల పుస్తకాలు చదువుతున్నారులే....వేరే పాఠకులంటూ లేరు. అలా వుంది నీ ధోరణి".

"అబ్బా! బాగా దెబ్బతీశావయ్యా భానుమూర్తీ"

"ఒక మామూలు శ్రోతగా నీకు యేమనిపించిందో చెప్పు చాలు"

"మూడు గంటలపాటు ఓపికగా కూర్చుని విన్నానుగనుక సంగీతమంటే కొంత 'ఇంటరెస్ట్' యేర్పడింది. ఆ రాగాలాపన మళ్ళీ మళ్ళీ వింటే మనసుకు సంతోషం కలుగుతుందనిపిస్తోంది. ఇలా చెబితే నీవు నవ్వుతావేమోనని భయం నాకు. ఎందుకంటే యివన్నీ నీకు కొట్టిన పిండిగదా!"

"అబ్బా! సంగీతంతోపాటు నన్నూ పొగుడుతున్నావే! నీకు నిజంగా యింటరెస్ట్ కలిగిందంటే చాలా సంతోషంగా వుంది. మూడు గంటలపాటు నీ బంగారం లాంటి టైం వృధాచేశానని తిడతావేమో అనుకుంటున్నాను!"

"నిజం భానుమూర్తీ! నేను రెండు మూడు మార్లు ఆ సంగీతం వింటూ పరవశం అయిపోయినమాట యదార్థం! ఆ స్థితినుంచి యివతలపడిన తరువాత-నీళ్ళలో నుంచి ఒడ్డునపడిన చేపపిల్లలా అయింది నా పరిస్థితి!"

"చూశావా మరి! సంగీతంలో ఎటువంటి మహత్తు వున్నదో.మన ప్రయత్నం లేకుండానే ఆత్మానందం పొందుతాము. నా మాటలు యిప్పటికయినా నమ్ముతావనుకుంటాను".

"నీ మాటలు నమ్మకపోవడం ఏమిటి? విషయం చెప్పాను. అంతే!"

"కళ అంటే సంగీతమేనోయ్ కళ" అన్నాడు భానుమూర్తి.

సుందరం మనస్సు ఒప్పుకోలేదు. ఎందుకంటే, ఎప్పుడూ కళలలో వుండే





విషయం వేరు, మనం గ్రహించేది వేరు. మనం ఎంతవరకు గ్రహించామో, అవగాహన చేసుకోగలిగామో ఆ కళ అంతవరకే మనకు పరిమితం అవుతుంది, అర్థానికి అందుతుంది. ఏ కళ విషయమయినా అంతే! అయినప్పుడు సంగీతాన్ని యితర కళలకంటే మిన్నచేసి మాట్లాడడం సుందరానికి మామూలుగానే నచ్చలేదు. కానీ గ్రహింపు, అవగాహన అనేవి యేమీ లేకుండానే మనసుకు ఆనందం కలగడం ఒక పుస్తకం చదువుతున్నప్పటికంటే, ఒక పాట వింటున్నప్పుడు సాధ్యం అవుతుంది. ఒక మంచి బొమ్మ చూసినప్పుడు తటస్థపడుతుంది. బొమ్మలో వున్న అందాన్ని తెలుసుకోవటానికి ఆ బొమ్మ గీయడం రానక్కరలేదు. కాకపోతే బొమ్మ గీయడం వచ్చినవాడికి అందులోని లోతుపాతులు మరింత ఎక్కువగా తెలియడానికి అవకాశం వుంది. అలాగే శిల్పంలోనూ, అలాగే సంగీతంలోనూ! కానీ తనకు చిరపరిచితమయిన సాహిత్యంలో మటుకు అలా కాదు. ఒక పద్యంలో అందం-దాని అర్థం తెలిస్తేతప్ప పూర్తిగా తెలిసిరాదు. అర్థం తెలియనివాడికి పద్యం వింటున్న చప్పుడు, గులకరాళ్ళ చప్పుడు-రెండూ ఒకటే.

సాహిత్యానికి యెక్కువగా అవగాహన అవసరం అన్నమాట. సంగీతానికి అంత అవసరం వుండకపోవచ్చును. అయితే సంగీతం, మనిషిని మానసిక ఆనందానికి తీసుకుపోతుంది త్వరగా, అంతే అది సాహిత్యంకన్నా 'మిన్న' అని చెప్పుకోవాల్నా? లేక చౌకబారు అనుకోవాలా?? గొప్ప తికమకలో పడిపోయాడు సుందరం. అతని మనస్సులో ఒక ఆలోచన మెరిసింది. ఎప్పుడో పూర్వం చదివిన పద్యం గుర్తుకు వచ్చింది. సంగీత సాహిత్యాలు రెండూ సరస్వతీదేవి 'కుచద్వయం' అని ఆ పద్యం. ఆ భావం యథాతథంగా మనసుకు పట్టినప్పుడు యింక సంగీత సాహిత్యాలలో యేది మిన్న అనే ప్రసక్తి రాదు. రెంటినీ సరిపోల్చి చూసుకోవడం కూడా అవివేకమే అనిపిస్తుంది.

"ఏమిటోయ్! అంత ఆలోచనలో పడిపోయావు" అన్నాడు భానుమూర్తి.

సుందరం భావ జగత్తులోనుంచి బాహ్య జగత్తు లోనికి వచ్చాడు.

"ఏమీలేదు. నీవు చెప్పిందే ఆలోచిస్తున్నాను"

"అంత ఆలోచించవలసిన మాట నేను యేం చెప్పానబ్బా!"

"సంగీతం కళలన్నిటిలోనికీ గొప్పదన్నావు"

"ఆ విషయం నీవు అంగీకరించవని నాకు తెలుసులే"

"అంగీకరించటానికి కాదనటానికి నేనెంత వాడినిలే"

"ఎంతటివాడివో కాకపోతే నీకు సంగీతంలో ఇంటరెస్ట్ యేర్పడుతుందా?"

—సుందరం యేమీ మాట్లాడలేదు.

"ఒప్పుకోవడం నీకు యెంత మాత్రం యిష్టం వున్నట్లు లేదుగాని, సంగీతం మటుకు నిన్ను పూర్తిగా ఆకట్టేసుకుంది" అన్నాడు భానుమూర్తి.

సుందరం నవ్వి వూరుకున్నాడు.

"సరే ఇంక నేను వెడతాను. సాయంత్రం అయిదున్నరకల్లా మీ ఆఫీసుకువస్తాను. కాస్త ఆలస్యం అయినా అక్కడేవుండు"

"అట్లాగే"

భానుమూర్తి వెళ్ళిపోయాడు.

సుందరం మనసు కొంత కుదటపడి నట్లయింది. హాయిగా తన పని తాను చేసుకోగలిగాడు.



# 7

**సుం**దరం ఆఫీసుకు వెళ్ళి కూర్చున్నా డన్నమాటేగాని అతని మనస్సు మనస్సులో లేదు.

సంగీత కచేరీ విని వచ్చిన రోజు నుంచి అతనికి పరధ్యానం ఎక్కువై పోయింది.

మధుర తరంగాలు ఇంకా చెవులలో గింగురు మంటూనే వున్నాయి. మనస్సుకు ఆనందం కలిగిస్తున్నాయి. ఏదో తీపి తనను తినివేస్తోంది.

హాయిగా ఆనందంగా వింటూకూర్చో వాలని వుంది. ఏ పనీ చేయబుద్ధి కావడం లేదు.

ఆఫీసు కాగితాలు కదలడం లేదు.

ఎక్కువ ప్రమాదంలేదు గనుక సరి పోయిందిగాని లేకపోతే అదో కొత్త గొడవలో పడిపోయి వుండేవాడు.

"సంగీతంలో నాకు ఇంత ఇంటరెస్టు కలగడానికి కారణం యేమిటి?" అదీ అతన్ని యిప్పుడు పట్టి పీడిస్తున్న ప్రశ్న.

సంగీతం, సంగీత రసం, రసాస్వాదన అనే మాటలు మాటలుగా తనకు లోగడ తెలుసును. అనుభూతిగా ఇప్పుడు తెలుస్తు న్నాయి.

ఈ మాత్రం తెలుసుకుందుకయినా యేదో యోగ్యత వుండాలిగా.

ఒక మనిషి అంటే మనకు ఇష్టం వున్నప్పుడు అతను యేంచేసినా గొప్పగా కనిపిస్తుంది. అంటే మన ఆరాధన మనిషి మీదనుంచి అతని పనుల మీదకు దుముకు తుందన్నమాట. భానుమూర్తి విషయంలో అయితే ఈ ఆరాధనకు ఇలా అర్థం చెప్పుకోవచ్చును. తన సంగతి యేమిటి మరి ?

శకుంతలపట్ల తనకు వ్యక్తిగతమయిన అభిప్రాయాలు లేవు. ఆ అమ్మాయిని ఇంత వరకూ తాను తిన్నగా చూసిందైనా లేదు. తన స్నేహితుడి చెల్లెలు. అంత మాత్రాన ఆ మనిషిలో తనకు 'ఇంటరెస్ట్' వున్నదనుకోవడం భ్రమకదూ ?

ఇది సంగీతపరంగా వచ్చిన మార్పే గాని వ్యక్తిగతమయిన యిష్టాయిష్టాల మీద ఆధారపడినది కాదు అని తేలి పోతోంది.

సంగీతపరంగా మటుకు దీనికి అర్థం చెప్పుకోవడం ఎలా ?

సుందరానికి మళ్ళీ మళ్ళీ ఆ గొంతు వింటే బాగుండును అనిపించింది.

శ్రావ్యమయిన కంఠం. యథా లాపంగా రేడియో తిప్పినప్పుడు ఈ మాత్రం శ్రావ్యమయిన గొంతులు అనేకం విని వుంటాడు తను. కనుక ఈ ఆకర్షణ అంతా కేవలము శ్రావ్యతను బట్టి వచ్చిందనుకోవడానికి కుదరదు. ఈ కంఠంలో యేదో నిండుదనం, పరి పూర్ణత వున్నది. కేవలం తన అను భూతిని ఆధారంచేసుకుని దానికి పేర్లు

పెట్టటం ఏ మాత్రం ధర్మంకాదు. స్పష్టంగా కనిపిస్తున్న దానికి ఏదో ఒక పేరు పెట్టకపోతే అది అవగాహనకు అసలు అందకుండా పోతుంది.

భానుమూర్తితో మాట్లాడుతూ కూర్చుండే తన ఆలోచనలకు ఒక స్థిర మయిన రూపం రావడానికి అవకాశం వున్నది.

ఇన్నాళ్లు భానుమూర్తి మాటలు తాను అంతగా పట్టించుకోలేదు. సాయంత్రం ఎలాగూ వస్తాడు కదా!

* * *

సాయంత్రం అయిదున్నర అవడం తోటే భానుమూర్తి వచ్చి కూర్చున్నాడు. అప్పటికి సుందరం తన ఆఫీసు పని ముగించుకుని తీరుబడిగా వున్నాడు.

"అన్న ప్రకారం టైముకు వచ్చే శావే— ఇంకా నీవు ఆలస్యం చేస్తా వేమో కాలం గడపడం యెలాగా అను కుంటున్నాను" అన్నాడు సుందరం.

"భానుమూర్తి మాట అన్నాడంటే మాటే. ఇంకా ఆ విషయం నీకు తెలిసి రాలేదా?"

"మాట మాటీనని నాకు తెలుసును కాని అది 'చేత' కూడా అయిందే అనే ఆశ్చర్యం."

ఇద్దరూ నవ్వుకున్నారు.

"వెడదాం పద"

—లోకాభిరామాయణం చెప్పుకుంటూ కాఫీ హోటలుకు నడిచారు. సుందరం 'స్వీట్' ఆర్డర్ చేశాడు.

"ఇప్పుడెందుకోయ్ అట్టహాసం" అన్నాడు భానుమూర్తి మొహమాటం ప్రదర్శిస్తూ.

కాఫీ త్రాగిన తర్వాత మామూలు ప్రకారం సుందరం 'బిల్' చెల్లించాడు ఇద్దరు తిరిగి నడక సాగించారు.

"ఇంకా ఆరుగంటలయినా కాలేదు. అప్పుడే యింటికి వెళ్ళి ఏం చేస్తాం. కాస్సేపు ఏ పార్కులోనో కూర్చుందాం" అన్నాడు సుందరం.

"అలాగే" అన్నాడు భానుమూర్తి.

అతను అలా అనగూడదనీ తనను వెంటనే యింటికి తీసుకు వెడితే బాగుం టుందనీ సుందరం అభిలాష. కానీ పైకి ఏమీ అనేందుకు లేదు.

ఇద్దరూ పార్కులో కాళీ బెంచి చూసు కుని కూర్చున్నారు.

"ఏమయినా సంగతులు చెప్పు—" అన్నాడు సుందరం.

"నీవే చెప్పు నా దగ్గర ఏమీలేవు"

"పొద్దున్ననుంచి ఏం చేశావు?"

"నీ దగ్గర్నుంచి వెళ్ళిన తర్వాత యింటికి చేరుకున్నాను. ఏదో పాత నవల కనిపిస్తేచదువుతూ పడుకున్నాను. మా అమ్మ భోజనానికి పిలిచింది. సుష్టుగా భోజనంచేసి మళ్ళీ నాలుగు గంటలదాకా పడుకున్నాను. అప్పుడైనా లేచివుండే వాడిని కాదు. కాని మా గురువు గారు వచ్చి సంగీత పాఠం ఆరంభిం చారు. కాస్సేపు అటుయిటు తిరిగి తిన్నగా నీ దగ్గరకు వచ్చాను. ఇంత కంటె నా దగ్గర సంగతులు యేం వుంటాయి చెప్పు."

"అంటే గురువుగారు రోజూ నాలుగు గంటలకు వస్తారా?"

"అబ్బే, ఆయనకు ఒకవేళ అంటూ లేదు. ఎప్పుడు తీరుబాటు దొరికితే అప్పుడు వచ్చేస్తారు. మా చెల్లాయి ఎప్పుడూ సిద్ధంగానే వుంటుంది."

"విద్య మీద శ్రద్ధ అంటే అలా వుండాలి.

భానుమూర్తి ఏమీ అనలేదు.

పార్కులో రేడియో అంతవరకు మాట్లాడుతున్న మాటలు ఆపేసి ఏదో సంగీతం మొదలు పెట్టింది. ఆ మోతకు వాళ్ళు మాట్లాడుకోవడం కూడా కష్టం అయిపోయింది. పోనీ అదే వింటూ కూర్చుందామా అంటే ఆ గొంతు అంత శ్రావ్యంగాలేదు.

సుందరం యిలా అన్నాడు.

"సంస్కృతంలో ఒక నాటకంవుంది దానిపేరు మృచ్ఛకటికం. దానిలో విదూషకుడు కోట్లకు విలువయిన మాట అన్నాడు— ఆ మాట గుర్తువస్తోంది ఈ పాట వింటూ వుంటే—"

"ఏమిటా మాట ?"

"ఆడవాళ్లు సంస్కృతం మాట్లాడినా, మగవాళ్ళు సంగీతం పాడినా నాకు చెడ్డ చిరాకు అన్నాడు విదూషకుడు. ఈ సంగీతం వింటూవుంటే, యెంత విదూషకుడే అయినా అతడన్నమాటలు తీసి పారవేయడానికి వీలులేదుసుమా అనిపిస్తోంది.

"ఈ గొంతు సంగతి నేను చెప్పలేనుగాని, విదూషకుడి మాటలు నేను బలపరచాను సంగీతానికి సెక్స్‌తో సంబంధం లేదు.

"భలేవాడివోయ్ భానుమూర్తీ. సెక్స్ గొడవలు విప్పుతున్నావే !"

"సంగీతంలో అనేక అంశాలు వున్నాయి. కొన్ని కొన్ని ప్రక్రియలు కొందరు మాత్రమే చేయగలరు. కంఠం శ్రావ్యంగా వున్నంత మాత్రాన అందరూ అన్ని ప్రక్రియలూ చేయగూడదు. ఉదాహరణకు..."

"అయితే సంగీతాన్ని గురించి సోదాహరణ ప్రసంగం చేయబోతున్నావన్నమాట!" అన్నాడు సుందరం పైకి వేళాకోళంగా కనిపిస్తూనే. అతనికి భానుమూర్తి యిప్పుడు సంగీతాన్ని గురించి మాట్లాడడం యిష్టంగానే వుంది.

"నేనేం పాడనులే. భయపడకు-"

"థాంక్స్"

"నేను చెప్పేది యేమిటంటే ?..."

—సుందరం శ్రద్ధగా వినడానికి పూనుకున్నాడు.

"గొంతు అంత శ్రావ్యంగా లేనివాళ్లు రాగ ప్రస్తావం జోలికి వెళ్ళగూడదు. నేర్చుకున్న కీర్తన నేర్చుకున్నట్లుగా వప్పగించి వెళ్ళిపోతే శ్రోతలు బ్రతికి పోతారు. సంగీత విద్వాంసులు ఆ మెలుకువలు తెలుసుకుంటే విదూషకుడు యిలా మాట్లాడటానికి అవకాశం వుండేది కాదు-"

"సంగీతం కాలూకు సూత్ర ప్రాయమయిన మాటలన్నీ చెబుతున్నావు, యివన్నీ నాకు అర్థం అవుతాయా యేమన్నానా?"

"నీకు అర్థం అయ్యే భాషలో చెప్పమన్నా చెప్పగలను. సీసపద్యం రాయాలంటే శ్రీనాధుడే మొనగాడని ఎందుకంటారు? అంత మాత్రంచేత తతిమ్మా వాళ్ళు ఆ పద్యం వ్రాయడం మానేశారా? ఒక్కొక్క మనిషిలో ఒక్కొక్క సొంపు వుంటుంది. ఆ సొంపు యెరిగి ప్రదర్శిస్తే యితరులకు యిబ్బంది వుండకపోగా ఆనంద దాయకం కూడా అవుతుంది"

"సరే ! అంగీకరించాను."




"నీ వంత బలవంతంగా అంగీకరించి నన్ను తృప్తి పరచ నక్కర్లేదులే. నా అభిప్రాయం చెప్పాను. అంతే-" అన్నాడు భానుమూర్తి ఛాలెంజింగ్‌గా.

"భానుమూర్తీ! నీకు అనేక సంగతులు తెలుసును. మెట్రిక్యులేషన్ నిన్ను యెందుకు దగా చేసిందో నాకు అర్థం కావడంలేదు."

"చదువు సంగతి ఎత్తితే నాకుతలనెప్పి వస్తుంది, గురువుగారూ! చదువు, దాని అందచందాలు - ప్రయోజనాలు గురించి యెన్ని కబుర్లు చెప్పమన్నా చెబుతాను. కాని చదువుకోమంటే మటుకు నా వల్ల కాదు. మీరేమయినా అనుకోండి"

సుందరం అతని నిక్కచ్చి మాటలకు హాయిగా నవ్వసాగాడు. చివరకు "చదువు సంగతి చూసుకోకపోతే ముందు ముందు జీవితం అంతా ఎలా గడుస్తుందోయ్?" అన్నాడు.

"గడవక యేంచేస్తుంది? మన జీవితమంతా నిర్విచారంగా గడిచి పోతుందని మా నాన్నగారు రూఢిగా చెబుతున్నారు. ఇంక నాకెందుకు బెంగ!"

"అన్నట్లు మీ నాన్నగారికి జ్యోతిషం బాగా వచ్చును గదూ?"

"ఆయన దంతా విచిత్రం. వచ్చునడానికీ వీల్లేదు. రాదనికొట్టి పారెయడానికీలేదు. ఉండి ఉండి ఆరు నెలలకోసారి ఒక ముక్క అంటూ వుంటారు. పనిగట్టుకుని యెవరేనా అడిగితే మళ్ళీ ఆ పలుకే వుండదు. ఆయన చెప్పిన మాటలు మాత్రం తు.చ. తప్పకుండా జరుగుతాయని అందరూ అంటారు."

"నా జాతకం ఒకమారు మీ నాన్నగారికి చూపించాలి."

"ఇవ్వు. నష్టంలేదు. కానీ యేమీ తొణికకు."

"తప్పకుండా" అంటూ లేచాడు సుందరం. ఇద్దరూ నడక సాగించారు.

సుందరం ఓ పళ్ళ దుకాణం దగ్గర ఆగి డజను బత్తాయిలు, పూల దుకాణం దగ్గర ఆగి అరకిలో పూలు తీసుకున్నాడు.

"పెద్దల దగ్గరకు వెళ్ళేటప్పుడు రిక్తహస్తాలతో వెళ్ళగూడదని ఆర్యోక్తి" అన్నాడు.

"మరీ చాదస్తం మనిషిలా వున్నావే! నీవేంమాకు కొత్తవాడివా?" అని, భానుమూర్తి తనే మళ్ళీ "మా చెల్లాయికి మల్లె పూలంటే యిష్టం" అన్నాడు.

మల్లె పూలంటే యిష్టపడని ఆడపిల్లలు యెవరు వుంటారులే - అనుకున్నాడు సుందరం తనలో తను.

ఇద్దరూ భానుమూర్తి యింటికి చేరుకున్నారు. వాళ్ళు యింకా వీధిలో వుండగానే లోపలనుంచి సంగీతం వినవస్తోంది.

హాలు లోపలకు అడుగు పెట్టేసరికి శకుంతల తంబూర మీటుకుంటూ పాడుతూ కూర్చుని వుంది. ఎవరో లోపలకు రావడం గమనించి పాట ఆపి లేవబోయింది.

భానుమూర్తి "అక్కర్లేదు మన సుందరమే. నీ పాట వినాలని వచ్చాడు" అన్నాడు.

శకుంతల సుందరాన్ని ఒకమారు చూసి గుర్తుకు తెచ్చుకుంది.

"నమస్కారం" అంది మెల్లగా

భానుమూర్తి సుందరానికో కుర్చీ వేశాడు.

సుందరం పూల పొట్లం, పళ్ళు పక్కనేవున్న బల్లమీద వుంచి తను

కుర్చీలో కూర్చున్నాడు. శకుంతల పాడుతూ వున్న కీర్తన కొనసాగించింది

'యోచనా, కమల లోచన...' అన్నది ఆ కీర్తన.

సుందరం వింటూ కూర్చున్నాడు.

పాటలో సంగీతం కంటే, పాడే పద్ధతిలోని వేగం అతనిని ఎక్కువగా ఆకర్షించింది. తరువాత శకుంతల మరి రెండు కీర్తనలు పాడింది.

సుందరం తాను ఆ రోజు కచేరీలో విన్న కీర్తన, రాగం పాడమని అడుగుదామను కున్నాడు. కాని మొహమాట పడిపోయి మిన్నకుండిపోయాడు. అయినా యేమని అడగడం ? రాగం పేరు గుర్తు పెట్టుకున్నాడు గాని ఆ కీర్తన ఏదో మరిచి పోయినాడు ! మాట్లాడకుండా కూర్చోవడమే బుద్ధికి లక్ష్యంగా అనిపించింది, అతనికి అప్పుడు.

దాదాపు ఒక అరగంటసేపు పాడిన తరువాత శకుంతల తంబుర పక్కన పెట్టేసి ఊరికే కూర్చుండి పోయింది. సుందరానికి మౌనంగా కూర్చోవడం ఎబ్బెట్టుఅనిపించింది. ఏదో మాట్లాడాలి, కాని ఏమని...?

కాస్సేపు ఆలోచించి "ఆ రోజు మీ సంగీతకచేరి చాలా బావుంది" అన్నాడు.

తీరా అన్న తర్వాత తన మాటలే తనకు అసంపూర్తిగా అనిపించాయి.

ఏం బాగుంది - అని అడిగితే తను ఏం సమాధానం చెప్పగలడు ?

మరి కాస్సేపు అయిన తరువాత గుక్కతిప్పుకుని ఇలా అన్నాడు.

"మీ గురువుగారు చాలా సాంప్రదాయంగా నేర్పారు. మీ కచ్చేరి నిండుగా వుంది. ఇంతకంటె దానిని వర్ణించి చెప్పడం ఇంకెలాగో నాకు తెలియదు. నేను సంగీతం వచ్చిన వాడిని కాదు."

శకుంతల అతని మాటలను చిరునవ్వుతో వింటోంది.

"అవును. అంతా గురువుగారి ఆశీర్వాదం. నా పనల్లా సాధన చేస్తూ వుండడమే. అంతే!"

'మీరు చాలా పైకి వస్తారు.' అందామనుకున్నాడు సుందరం. కానీ ఆ అమ్మాయి ఏం అనుకుంటుందోనని బిడియపడి ఊరుకుండి పోయాడు.

"మీరు సంగీతం పాడడం చాలా బాగుంది" అన్నాడు మనస్సు నిలదొక్కుకోలేక.

అంతవరకూ మాట్లాడకుండా కూర్చున్న భానుమూర్తి "లోపలకు రా, మా నాన్నగారిని పరిచయం చేస్తాను" అన్నాడు.

సుందరం అతని కూడా వెళ్ళిగోపాలంగారికి నమస్కారం చేశాడు.

"మా వాడు చెబుతూ వుంటాడు బాబూ నిన్ను గురించి. అప్పుడప్పుడు వస్తూ వుండు" అన్నారాయన.

సుందరం శలవు తీసుకుని యివతలకు వచ్చేశాడు.

"ఇంక వెడతానోయ్ భానుమూర్తీ" అన్నాడు.

"ఉండు. అప్పుడేనా ?" అంటూ యివతలకు వెళ్ళి ఒక్క నిమిషంలో రెండు చేతుల్లో రెండు కాఫీ కప్పులతో ప్రత్యక్షం అయినాడు.

"ఇప్పుడే కదోయ్ బయట తీసుకున్నాం"

"ఇప్పుడు ఇంట్లో తీసుకుంటున్నాం"




—సుందరం కళ్ళు శకుంతల కోసం వెదుకుతున్నాయి. ఆమె అక్కడ లేదు. తను లోపలకు వెళ్ళినప్పుడే ఆమె కూడా లేచి వంటయింటి వైపు వెళ్ళి పోయి వుండాలి...

కాఫీ కప్పు కింద పెడుతూ "వస్తా నోయ్, రేపు కలుసుకుందాం" అంటూ సుందరం లేచాడు.

"ఓ. యస్. అలాగే!"

గుమ్మం దగ్గర అలికిడి అయితే సుందరం అటువైపు తిరిగీ తిరగ కుండా చూశాడు. శకుంతల గుమ్మానికి ఒక పక్క నిలిచింది.

"వస్తానండీ" అన్నాడు సుందరం.

ఆమె తలఊపి చేతులు జోడించింది.

సుందరం భానుమూర్తితోసహా రోడ్డు మీదికి వచ్చేశాడు.

స్నేహితులు ఇద్దరూ రోడ్డు మీదనే శలవు పుచ్చుకున్నారు.

సుందరం ఇంటిదారి పట్టాడు.



# 8

ఒక్కొక్క వేళా విశేషం, ఒక్కొక్క జీవితాన్ని తారస్థాయికి తీసుకు వెడుతూ వుంటుంది. ఈ 'వేళావిశేషం' అనేదాన్ని అర్థం చేసుకోవడం కష్టం. మొదలయిన వేళ మంచిదయితే ఆ పని యింకా నిర్విఘ్నంగా కొనసాగుతుంది అంటారు. 'మంచి ప్రారంభం – పని సగం పూర్తి అయినట్లే' అని ఇంగ్లీషులో ఒక సామెత కూడా వుంది. అయితే వేళ అంటే ఏమిటి? పని ప్రారంభం చేసిన సమయమా? లేక అలా చేయాలని మనసుకు సంకల్పం కలిగిన సమయమా??శరీరమా మనస్సా ఏది ఎక్కువ ప్రాముఖ్యం— ఇది తర్కానికి సంబంధించిన సమస్య!

శకుంతల సంగీతం ప్రారంభించిన వేళ శుభప్రద మయినదని చెప్పక తప్పదు. అయితే ఈవేళ - తల్లి మనసులో సంకల్పం చేసుకున్న రోజా? లేక గురువుగారు ముందుగా 'స...ప...స' పట్టించిన రోజా?...ముందుగా శకుంతల నోరు విప్పిన ముహూర్తమా ?-

విద్య లభించడం ఒక ఎత్తు. దానికి తగిన ప్రచారం లభించడం మరోఎత్తు. అలా అనుకున్నప్పుడు శకుంతల మొదటి సూరుగా కచేరీ చేసిన వేళగూడా ఎంతో గొప్పదయి వుండాలి.

ఎంతో ఆలోచించి లెక్కలు వేసి జాగ్రత్తగా ఎంచుకున్నా శుభ ముహూర్తాలు కూడా ఒక్కొక్క మారు బెడిసి కొడుతూవుంటాయి.ఆ పనులు చివరంటా నిర్విఘ్నంగా సాగకుండా మధ్యలోనే వికలం అయిపోతాయి.

ఏతావాతా చెప్పవచ్చింది ఏమిటంటే- శకుంతలకు మొట్టమొదటి సంగీత కచేరీ తోనే మంచి పేరు వచ్చేసింది. వారం రోజులయినా తిరగకుండాయెవరో ఇద్దరు వ్యక్తులు వెదుక్కుంటూ వాళ్ళ యింటి ముందుకు వచ్చారు. వాళ్ళువచ్చిన సమయంలో గురువుగారు లేరు.

వాళ్ళు చెబుతూ వున్నది యేమిటో శకుంతలకు అర్థం కాలేదు.

బొమ్మలా నించుండిపోయి విన్నదేగాని దాని సారాంశం అంటనే లేదు. వచ్చిన

వాళ్ళు పూర్తిగా తికమక పడిపోయేలోగా సైంధవుడిలా భానుమూర్తి వచ్చి అడ్డు పడ్డాడు.

భానుమూర్తి అయిదు నిమిషాల సేపు వాళ్ళు చెప్పిందంతా విని, ఎగిరి గంతు వేసినంత పనిచేసి "కూర్చోండి. ఇప్పుడే వస్తాను" అంటూ లోపలకు వెళ్ళాడు.

శకుంతల అతని వెనకనే వెళ్ళింది.

"వాళ్ళు అంతసేపు మాట్లాడారు. నాకు ఒక్కముక్క తెలియలేదు" అంది.

"నువ్వు వూరుకో. నేనంతా ఆలోచించి చెబుతాను" అన్నాడు.

భానుమూర్తి ఉక్కిరిబిక్కిరి అయిన గొంతుతో మాట్లాడుతున్నాడు. ఇద్దరూ తల్లిదగ్గరకు వెళ్ళారు.

"అమ్మా! చెల్లాయి సంగీత కచేరి ఏర్పాటు చేయడానికి త్యాగరాయ నగరు సంగీత సభవాళ్ళు వచ్చారు. వచ్చే గురువారమే కచేరీ కావాలట. సెట్టుకు మూడు వందలు యిస్తామంటున్నారు. ఏం చెప్పమంటావు?" అన్నాడు.

శాంతమ్మ ఒక్కక్షణం ఆలోచనలో పడింది.

శకుంతలకు యిప్పటికీ సంగతి పూర్తిగా అర్థం కాలేదు.

"తొందరగా చెప్పమ్మా! అవతల వాళ్ళను కూర్చోబెట్టి వచ్చాను—" అన్నాడు భానుమూర్తి.

"నాకేం తెలుస్తాయిరా ఈ గొడవ లన్నీ. అయినా దాని సంగీతం సంగతి మనకేం తెలుస్తుంది. గురువుగారు వచ్చాక ఆయనతో మాట్లాడమను వాళ్ళను. వారికి తెలియకుండా మనమేం చేయలేం" అన్నది ఆమె.

భానుమూర్తి మనసులోని గందర గోళం అంతా ఒక్కక్షణంలో మంచులా విడిపోయింది.

"అవునవును. నాకు ఆ సంగతే తోచలేదు సుమా!" అంటూ వసారా లోనికి వెళ్ళిపోయాడు.

"చూడండి. మా చెల్లాయికి సంగీతం చెప్పే గురువుగారు యిప్పుడో యింక కాస్సేపటికో వస్తారు. వారితో ప్రస్తావించి గాని మేం యేం చెప్పేందుకూ వీలులేదు. అందుచేత..."

ఆ ఇద్దరిలో ఒకతను రెండో అతనితో "అయితే కాస్సేపు కూర్చుందామా?" అన్నాడు.

"కూర్చుంటే ఎలా? అవతల బోలెడు పనులు! మళ్ళీ వద్దాం" అంటూ అతను భానుమూర్తితో "మేం మళ్ళీ యెప్పుడు వస్తే మీ గురువుగారు తప్పకుండా యిక్కడ వుంటారో చెప్పండి" అన్నాడు.

"సాయంత్రం నాలుగున్నర నుంచి ఆరు గంటల లోపల-మీ యిష్టం. పోనీ మీ అడ్రెస్ చెప్పండి. వారిని కనుక్కొని నేనే వచ్చి మీకు ఏ సంగతీ చెబుతాను" అన్నాడు భానుమూర్తి.

వాళ్ళను యిప్పుడు యిలా వదిలేస్తే మళ్ళీ వస్తారో రారో అన్న అనుమానం మనసులో కలిగినట్లయింది అతనికి.

"అబ్బే! మీరు రానక్కరలేదు. మేమే వస్తాం. రామనాథంగారితో మాట్లాడినట్లు అవుతుంది. సరిగా అయిదు గంటలకల్లా యిక్కడ వుంటాం. మీ గురువుగారిని యెక్కడకూ పోనీయకండి. ఎందుచేత నంటే-మాకు యీ రోజే ప్రోగ్రాం 'ఫిక్స్ అప్' అవడం అవసరం. మళ్ళీ కాగితాలు అచ్చు వేయించడం, టిక్కెట్లు పంచి పెట్టటం...ఎంతో తతంగం వున్నది"




అంటూ వాళ్ళు చరచర వెళ్ళిపోయారు.

భానుమూర్తి వాళ్ళను వీధి చివరి వరకూ పంపి వచ్చాడు.

అతని మనసంతా హడావిడి అయిపోతోంది. మనసులో యిప్పుడు 'మూడు వందలు' నాట్యం చేస్తున్నాయి. ఇదంతా కొత్తరకం అనుభవం. ఇన్నిరోజులూ అతను ఆరాధననే పెంచుకువస్తున్నాడు గానీ దీనిని రూపాయలతో కొలుచుకునే అవకాశం కూడా వున్నదని ఇప్పుడిప్పుడే తోస్తూ వున్నది. ఒక విధమయిన వెర్రి ఆవేశం, ఉత్సాహం అతన్ని ఊపి వేస్తున్నాయి.

ఇంట్లోకి వచ్చి రావడంతోటే శకుంతలతో "ఇప్పటికయినా అర్థం అయిందా నీకు ?" అన్నాడు గుక్క తిప్పుకోకుండా.

"ఆఁ తెలిసింది. ఇదంతా నిజమేనా అన్నయ్యా !"

"కాక కల అనుకుంటున్నావా యేమిటి?"

"గురువుగారు యేమంటారో?"

"తప్పకుండా ఒప్పుకుంటారు. ఎందుకూ నేను ఆ సమయంలో ఇంట్లోనే వుండి ఆయనచేత ఒప్పిస్తానుగా!"

"ప్రతిసారీ నాకు బాగా పాడటం చేతనవుతుందా ?"

"లక్షణంగా చేతనవుతుంది. నీ ప్రయత్నం లేకుండానే దాని అంతటదే సంగీతం లోపలనుంచి ఉబికివస్తుంది. నీ పనల్లా జాగ్రత్తగా గురువుగారు చెప్పినట్లు సాధనచేస్తూ వుండడమే".

సాయంత్రం గురువుగారు రానే వచ్చారు.

ఆయన రావడంతోటే భానుమూర్తి అత్యుత్సాహంతో యీ విషయం నివేదించాడు. ఆయన అంతా శాపీగా విని,

"ఓహో ! త్యాగరాయ నగరువాళ్ళా ? చూద్దాం" అన్నారు.

భానుమూర్తికి మనసులో భయం పట్టుకుంది. గురువుగారి ధోరణి చూస్తే ఆయనకు ఈ విషయంలో అంత అభిరుచి వున్నట్లు కనిపించదు. ఇట్లా నీరసంగా వుంటే వచ్చే మూడువందలూ వెనక్కు నడుస్తాయి. కొమ్మెక్కి కూచుంటాయి.

—ఇదీ అతని ఆదుర్దా.

"ఏమండీ చూద్దాం అంటారేం! వాళ్ళు మంచి వాళ్లు కాదా ?" అన్నాడు భానుమూర్తి బిక్కముఖం వేసుకుని.

గురువుగారు నవ్వి వూరుకున్నారు.

మరింత చనువు తీసుకుని ఇంకేమీ ప్రశ్నలు వేయలేక పోయాడు భానుమూర్తి.

ఇంతలో శకుంతల వచ్చి 'రాగాలాపన' ప్రారంభం చేసింది.

"సంగీత పాఠం మొదలయింది కాబోలు" అనుకుంటూ భానుమూర్తి పక్కకు తప్పుకోవడం తప్ప యింకేం చేయలేక పోయాడు.

సరీగా అయిదుగంటల వేళ వాళ్ళు యిద్దరూ వచ్చారు. లోపలకు వస్తూనే రామనాథంగారికి నమస్కారం చేశారు.

"మా సంగీత సభలో శకుంతలగారి సంగీత కచేరీ యేర్పాటు చేయాలని అనుకుంటున్నాము. మధ్యాహ్నం ఒకమారు వచ్చాం".

"అవునవును భానుమూర్తి చెప్పాడు. అట్లాగే ఏర్పాటు చేయండి. శుభం"

"మా సంగీత సభ మీకు తెలియనిదేమీ కాదు. కొత్త ఆర్టిస్టులను ప్రోత్సహించడం మా ప్రత్యేక లక్షణం. అందు



చతుర ... లీల

కని ఎక్కువ డబ్బు ముట్ట చెప్పలేము. సెట్టుకు మూడు వందలు ఇస్తాం అని చెప్పాం"

"చూడండి కొత్తవాళ్ళను ప్రోత్సహించాలనే మీ ఆశయం మంచిదే. శకుంతల కచేరీకి కొత్తదేమోగాని సంగీతానికి కొత్తదికాదు. అందుచేత బొత్తిగా మూడు వందలు బాగోలేదు. మీరే మరో మాట చెప్పండి"

మూలకూర్చుని ఇదంతా గమనిస్తున్న భానుమూర్తి ముఖంలో ఆనందం పులుముకున్నది. ఎలాగయినా గురువుగారు అనుభవజ్ఞుడు, లౌక్యుడూను అనుకున్నాడు. తను కూడా ముందుకు వచ్చి కూర్చున్నాడు ఇప్పుడు ధైర్యంగా.

వాళ్ళిద్దరూ ఒకరి ముఖాలు ఇంకొకళ్లు చూసుకున్నారు. కళ్ళతోనే సంభాషణ చేసుకున్నారు.

"అట్లాగే రామనాథంగారూ! మీరు చెప్పిన తరువాత మేం కాదు అనడానికి వీలులేదు గదా! ఈ సారికి నాలుగు వందలతో జరిపి వేయండి"

"సంతోషం"

"సరే ఇంక మా ఏర్పాట్లలో మేం వుంటాం. మాకు సెలవు ఇప్పించండి. సెట్టు ఎవరో చెబితే కరపత్రాలు రేపే అచ్చుకు ఇచ్చేస్తాము"

"నేను వాళ్ళతో మాట్లాడి, కనుక్కొని రేపు ఉదయం మీకు కబురు చేస్తాను"

"అలాగే మరచిపోకుండా కబురు చేయండి" అంటూ వాళ్ళు ఇద్దరూ సెలవు





తీసుకుని వెళ్ళిపోయారు.

వాళ్ళు వెళ్ళిన తర్వాత గురువుగారు శకుంతలతో చూశావామ్మా నీ విద్య రాణింపుకి వస్తోంది. పద నాన్న దగ్గరకు వెడదాం" అన్నారు. గోపాలంగారి గదికి దారి తీశారు.

"ఏం చేస్తున్నారు బాబుగారూ?"

"నాకు వేరే పని ఏముంది?" శంకర భాష్యం చదువుకుంటున్నాను"

రామనాథం కూర్చుంటూనే "ఈరోజు మరో శుభ వర్తమానం. అమ్మాయికి మొదటిమారుగా ఫీజుతో సంగీత కచేరీ వచ్చింది. నాలుగు వందలకు స్థిరం చేశాను. ఈవూరే! పై గురువారం" అన్నారు.

"అంతా ఈశ్వరేచ్ఛ, పైన మీ ఆశీర్వాద బలం!"

"నన్ను పెద్ద చేయకండి. మీ ఆశీర్వదబలం, అమ్మాయి అదృష్టమూను"

"మీ శిక్షణ లేకుండానే ఇదంతా జరుగుతూ వుందా?"

"నాదే ముందండి నిమిత్తమాత్రుడిని. అయినా ఈ పల్లవి రోజూ వున్నదేగదా? అలా పక్కన పెడదాం. నాకో సలహా కావాలి: చెప్పండి అమ్మాయికి పక్కవాయిద్యాలు ఎవరిని ఏర్పాటు చేయమంటారు?"

"మొన్నటి కచేరీకి ఎవరిని పిలిచారో వాళ్ళనే పిలవండి"

"నాకూ అలాగే చేయాలని వుంది. కానీ ఫీజు విషయంలో తటపటాయిస్తున్నాను. వాళ్ళ రేటు కాస్త ఎక్కువ. మొన్ననంటే మొదటి కచేరీ గనుక నా మీద అభిమానం కొద్దీ ఊరికే వాయించి వెళ్ళారు. ఈ మారు మనం డబ్బు తీసుకుంటున్నాం గనుక వాళ్ళకూ మామూలు రేట్లు ఇవ్వడం విధాయకం, ధర్మం"

"అలాగే చేయండి"

"వయొలిన్ అతను మామూలుగా నూరు, నూటయాభై తీసుకుంటాడు. మృదంగం అతను డెబ్భయి అయిదు వందలోపు, కంజిరఘటం లేకపోయినా ఫరవాలేదు. మొన్నటి వాళ్ళు కాక ఇంకెవరినయినా చూడమంటే మొత్తం నూరు నూటయాభైలో ముగించి వేయచ్చును. అందుకని ఆలోచిస్తున్నాను"

గురువుగారి ఆలోచనా ధోరణి గోపాలానికి అర్థం అయింది.

ఆయన సూటిగా ఇలా అన్నారు. "రామనాథం. మొన్న ఆహ్వానించిన వాళ్ళను ఈ మారు పిలవక పోవడం తప్పు. పైగా వాళ్ళు మంచి పేరు వున్న వాళ్ళు అంటున్నావు: సరసమయిన ధరలకు వాళ్ళనే ఏర్పాటు చేయించండి. డబ్బంతా మనమే తినేసెయ్యాలా ఏమిటి? మనం నలుగురికీ యిస్తే ఈశ్వరుడూ మనకు ఇస్తాడు"

"సరే బాబుగారూ అలాగే ఏర్పాటు చేయిస్తాను" అన్నాడు రామనాథం.

అలాగే చేశాడు కూడాను.

ఫిడేల్ అతనికి వంద, మృదంగానికి డెబ్భయిలో ఏర్పాటు.

ఉన్న ఊరే గనుక ఎక్కువ ఖర్చులు లేవు. సంగీత సభవాళ్ళే ఆ సమయానికి కారు పంపిస్తారు. కచేరీ అయిన తర్వాత ఎవరి యిళ్ళ దగ్గర వాళ్ళను దింపుతారు.

భానుమూర్తి ఈ ఏర్పట్లన్నీ జరుగుతున్న పద్ధతికి తనలోతానే ఎంతో మురిసిపోయాడు. కొంతసేపు బాధ పడ్డాడు కూడా. ఎందుకంటే ఇదంతా తన

ప్రమేయం లేకుండా జరిగిపోతూంది. తన సంప్రదింపులేకుండానే ముందుకు నడుస్తోంది. దీనికంతకూ తాను దూరం అయిపోతున్నానేమోనని భయం పట్టుకుంది కూడాను.

గురువారం నాటి సంగీత కచేరీ కూడా చాల చక్కగా జరిగింది.

భానుమూర్తి ఈమారూ సుందరాన్ని వెంట బెట్టుకు వెళ్ళాడు. అతను మొదటి మారులా కాకుండా ఈమారు ప్రారంభం నుంచి మనసంతా సంగీతంమీద పెట్టి ఆ ఆనందాన్ని సాధ్యమయినంత ఎక్కువగా ఆస్వాదించాలని తృష్ణతో కూర్చున్నాడు.

అతనికి ఒక కీర్తన కంటే మరో కీర్తన ఎక్కువ రసానుభూతి కలిగిస్తున్నట్లు అనిపిస్తోంది. రసానుభూతి కలగడంలో ఏవే అంశాలు దోహదం చేస్తున్నాయో —అని వేయి కళ్ళతో గమనిస్తూ వేయి చెవులతో వింటూ కూర్చున్నాడు.

శకుంతల కంఠస్వరం నిండుతనంతో కంచు మోగినట్లు మోగుతోంది. శ్రావ్యమయిన గొంతులో-నిండుతనం కూడా వుండడం - ఈ పరిపూర్ణతకు ప్రధానమయిన హేతువు అనుకున్నాడు సుందరం.

స్వరం పలికినా,సాహిత్యం అంటున్నా రాగాలాపన చేస్తున్నా ఆ గొంతు ఒకటే తీరులో నడుస్తోంది. సంగీతంలోని లోతుపాతులు తెలియని వాళ్ళను కూడా ముందుగా ఆకట్టుకునేది ఈమాధుర్యమే.

మంచి శిక్షణ పొందడంవల్ల సంగీతాన్ని సాహిత్యంతో సమన్వయం చేసి పాడడం ఎలాగో శకుంతలకు చేతనయింది. సంగీత ప్రాధాన్యంతో సాహిత్యపు ముక్కలు విరిచి అసహ్యంగా వినిపించచేయడం లేకపోవడం వల్ల పాడుతూ వున్న కృతులకు పుష్టిఏర్పడుతోంది.

శకుంతల చేస్తున్న రాగాలాపనకు, స్వరకల్పనకు, శ్రోతలు చప్పట్లు చరుస్తున్నారు. ఏకంగా నాలుగు గంటలసేపు జరిగింది కచేరీ.

కచేరీ అంతంలో 'మంగళం' పాడడం విని సుందరం 'అబ్బ, యీ ఆనందం యిప్పుడే ముగిసిపోయిందా' అని ఒక్కమారుగా మనస్సులో అనుకున్నాడు. మొత్తంమీద శ్రోతలందరూ ఒక్క ఊపుఊగి మనసులో సంతోషాన్ని నింపుకుని ఇళ్ళకు వెళ్ళిపోయారు.

భానుమూర్తి ఉత్సాహంగా అటు యిటు తిరుగుతున్నాడు.

సుందరం అతనితో "చాల బాగుందోయ్!నాకు చాలా ఆనందంగా వున్నది" అన్నాడు.

"అట్లాగే వుంటుంది మరి! ఒకమారు అభిరుచి ఏర్పడితే— ఆ తర్వాత ఆనందం అర్ణవం అవుతుంది. అంతా యింతా కాదు - కొలవలేము."

'అలా కొలవగలగడం అగస్త్యుడు లాంటి మహర్షికే సాధ్యం అవుతుంది' —అనుకున్నాడు సుందరం.

సంగీత సభవాళ్లు యిచ్చిన నాలుగు వందల్లో పక్కవాద్యగాళ్ళ ఫీజు అప్పటికప్పుడే ఇచ్చేశారు గురువుగారు.తతిమ్మా డబ్బువున్న కవరు శకుంతల చేతికి యిచ్చి "జాగ్రత్తగా తీసుకువెళ్ళి అమ్మగారికి యివ్వుతల్లీ!" అన్నారు.

 



# 9

కచేరి అయిన రాత్రి శకుంతల తనలో తాను ఆలోచించుకుంటూ పడుకుంది. కచేరికి డబ్బు వస్తుందన్న సంగతే ఆమె మనసుకు యింకా గట్టిగా పట్టలేదు. డబ్బు కాగితాలు పెట్టిన కవరు సాక్షాత్తు తానే తీసుకువెళ్ళి తల్లికి యిచ్చింది.

గురువుగారి ఆశీర్వాదంతో సంగీతంతో పాటు డబ్బు కూడా వస్తుందన్న మాట!

ఒక్కమారుగా ఇంత డబ్బు ఏం చేసుకోవాలి ?

డబ్బులేని యిబ్బందులు తనకు వివరంగా తెలియకపోయినా, అంతా అనుభవం లేనిదేం కాదు శకుంతల. తనేం డబ్బు ఖర్చుచేయనక్కరలేదు. వచ్చింది వచ్చినట్లుగా తల్లి చేతులలో పెడుతూవుంటేచాలు, తన సమస్య తీరిపోతుంది. ఇన్నాళ్ళూ యింట్లో దారిద్రం తాండవిస్తూన్నదనటానికి వీలు లేదు గాని ఏ పనీ ధారవగాచేసుకు పోవడానికి లేకుండా వచ్చింది. రూపాయి ఖర్చు చేయలంటే అమ్మ ఎంత ఎంచి ఎంచి మరీ ప్రవర్తిస్తుందో తనకు తెలుసును. ఒక్కోసారి తన తల్లి గనుక ఇంత గుంభనగా సంసారం నడుపుకు వస్తున్నది - అనుకుంటుంది శకుంతల. ఇంటి బాధ్యతలో తను కొంత పంచుకున్నట్లు అవుతుంది. జీవితంలో యిదో కొత్త అనుభవం.

తనకు అనవసరమే అయినా డబ్బును గురించి ఆలోచించకుండా వుండలేకపోతోంది శకుంతల.

రోజూ తాను కచేరీ చేయగలదు.

రోజూ రెండువందలు మిగులుతాయా? ఇంకా బాగా పాడితే తనకు మరింత ఎక్కువ డబ్బు రావచ్చును.

రోజుకు రెండు వందలు అని చూసుకున్నా నెలతిరిగేసరికి ఆరువేలు! అమ్మో! అన్నివేలే ఏం చేసుకోవాలి ?

తన పిచ్చిగాని రోజూ తనకు కచేరీ ఎవరు యిస్తారు. రెండు మూడు నెలలకు ఒక ఆఫర్ వచ్చినా అది గొప్ప విషయమే. తనకు మాత్రం రోజూ కచేరీ చేయడం చేతనవును. తన సాధన మీద తనకు పూర్తి నమ్మకం వున్నది.

కచేరీ అయిన నాటి రాత్రి యింట్లో అందరి భోజనాలు అయిన మీదట శాంతమ్మ డబ్బు కవరు తీసుకు వెళ్ళి గోపాలం గారిని అడిగింది. "అమ్మాయి కచేరీకి రెండు వందలు పాతిక వచ్చింది. ఏం చేయమంటారు?" అని.

గోపాలం తలఎత్తి నవ్వి వూరుకున్నాడు.

ఒక్క క్షణంఆగి "డబ్బంతా నన్ను అడిగే ఖర్చు చేస్తున్నావా?" అన్నాడు మళ్ళీ.

"అవసరానికి మించిన డబ్బు నా చేతికి రావడం యిదే మొదలు అందుకని అడుగుతున్నాను" అంది శాంతమ్మ తాపీగా.

"అమ్మాయికి మంచి బట్టలు కొనిపెట్టు-గురువుగారికి దక్షిణ కింద పట్టు బట్టలు కొనిపెట్టు, డబ్బు యిస్తే తీసుకోడు రామనాథం"

"నేనూ అలాగే అనుకున్నాను అట్లాగే చేస్తాను-"

గోపాలం కాసేపు ఊరుకుని "ఇంక అమ్మాయి దండిగా సంపాదిస్తుంది మీ అందరి కోరికలూ తీరుతాయి. నాకు తెలుసు" అన్నాడు.

శాంతమ్మ కళ్ళు నీళ్ళతో ఒక్కమారు ఉబికినాయి.

ఆయన గమనించ కుండా పమిట కొంగుతో కళ్ళు ఒత్తుకుంది.

"మన కష్టాలు తొలగి పోయాయి, శాంతా... అంతా నీ అదృష్టం నీ జాతకం యోగిస్తుంది, యీ సంవత్సరం నుంచీ...అని ముందే చెప్పాను గదూ?"

"మీరు...మీరు...మీఅనారోగ్యం.." అంటూ శాంతమ్మ ఒక్క మారుగా ముందుకు అడుగువేసి ఆయన మీద మీద తలవాల్చి యేడవ సాగింది.

గోపాలం ఆమె తల నిమురుతూ "నువ్వేం దిగులుపడకు శాంతా...అంతా సవ్యంగా జరిగిపోతుంది. అబ్బే...యేమి టిది...ఏడవకు" అన్నాడు.

శాంతమ్మకు తన కష్టాల నుంచి యిన్నాళ్ళకు ఊరటి దొరుకుతుందని భర్తనోటిమీదుగా వినడంతో దుఃఖమూ, సంతోషమూ ఒక్కమారుగా కలిసి వచ్చాయి. ఉక్కిరి బిక్కిరి అయి పోయింది కొంతసేపు ఏమీమాట పెగిలి రావడం లేదు నోటివెంట.

"రామనాథం గొప్ప విద్వాంసుడు. మంచివాడు. కాస్తయినా గర్వం లేదు" అన్నాడు.

"అంతా ఆయన చలువే"

గోపాలం ఆమె భుజంమీద లాలనగా స్పర్శిస్తూ "అమ్మాయికి మొదటి సంగీత గురువు నీవేగా అసలు ముందుగా నీకే గురు దక్షిణ ఇవ్వాలేమో ఆలోచించుకో" అన్నాడు.

"చాల్లెండి! ఎవరయినా, వింటే నవ్విపోతారు".

"నిజం శాంతా!ఈ రోజుకూ నీ పాటే నాకు బాగుంటుంది"

"నేను పాడడం మానేసి ఎన్నాళ్ళయింది!"

"లేదు శాంతా! నీవు మానివేయ లేదు. నా హృదయంలో ఎప్పుడూ నీ పాట ఆలపిస్తూనే వున్నావు."

ఇద్దరూ కాస్సేపు వెనకటి రోజులు స్మరించుకున్నారు.

మొత్తం మీద ఆ యింట్లో అందరికీ ఆ రోజు నుంచి యేదో కొత్త జీవితం ప్రారంభం అయినట్లు, తమకు మరికాస్త భరోశా యేర్పడు తున్నట్లు ధైర్యం కలిగింది.

* * *

మరునాడు గురువుగారు, రావడంతో శాంతమ్మ దేవుడి దగ్గర దీపం వెలిగించింది. పట్టు తాపితాలు దేవుడికి చూపించి బయటకు తీసుకు వచ్చింది.

శకుంతల, తల్లి చెప్పిన ప్రకారం, గురువుగారి పాదలకు అభివందనం చేసి వారికి పట్టు తాపితాలు వుంచిన పళ్ళెం అందించింది. గురువుగారు ఒక్క క్షణం నిర్ఘాంతపోయి తరువాత తనలో తానే నిలదొక్కుకుని శకుంతలను ఆశీర్వదించారు.

"శ్రీఘ్రమేవ కళ్యాణ ప్రాప్తిరస్తు" అంటూ.

భానుమూర్తికి తృప్తిగా లేదు. బాగా సంగీతం పాడి డబ్బు సంపాదించాలని





ఆశీర్వదించ కుండా కళ్యాణం అంటా రేమిటి అని అతనికి 'అరుచి' అనిపించింది. ఈ ముసలి వాళ్ళకు యెప్పుడూ పెళ్ళి రంధే–అనుకున్నాడు.

"ఏమిటమ్మా యిదంతా."

శకుంతల వినయంగా నిలుచుండి పోయింది యేమిమాట్లాడకుండ. గుమ్మానికి అవతల చాటుగా నిలుచునివున్న శాంతమ్మ "బాబుగారూ! ఇన్ని సంవత్సరాలుగా కన్న కూతురుకన్నా మిన్నగా కడుపులో పెట్టుకుని సంగీతం నేర్పారు. మీ ఋణం తీర్చుకోవాలను కోవడం కూడా మహా పాపం. దాని మొదటి సంపాదనతో మీకు గురుదక్షిణ చెల్లించుకుంటోంది. మీరేం మరోలా అనుకోకండి. మీ ఆశీర్వాదం వుండే చాలు మాకు.

అంతే!" అన్నది నింపాదిగా.

"అమ్మా. నా కోసం యింత డబ్బు ఖర్చుచేశారా? నాదేముందమ్మా. నిమిత్త మాత్రుడిని. ఇంతకంటే అమ్మాయికి బట్టలు కొంటే బాగుండేదిగా!"

పక్కనేవున్న భానుమూర్తి అత్యుత్సాహంతో "చెల్లాయికి కూడా కొన్నామండీ. ముందు గురువుగారికి, తరువాత శిష్యురాలికీని" అన్నాడు.

"మరి నీవు కట్టుకోలేదేవమ్మా! కొత్త చీర కట్టుకో చూద్దాం"

శకుంతల లోపలకు వెళ్ళింది.

అయిదు నిమిషాలలో కొత్త చీర కట్టుకు వచ్చి గురువుగారి పాదాలకు మళ్ళీ నమస్కరించింది.

"నాకు చేస్తే చాలదమ్మా. అసలు, ముందు మీ నాన్నగారికి చేయాలి" అంటూ గురువుగారు గోపాలం గదిలోకి దారి తీశారు.

శకుంతల తండ్రి పాదాలకు నమస్కరించింది.

"బాబుగారూ! పూర్వజన్మ సంస్కారం వల్ల మీ అమ్మాయి చక్కని సంగీత విద్వాంసురాలు అయింది. ఈ 'రత్నా'న్ని సానబట్టిన కీర్తి, గౌరవం నాకు దక్కుతున్నాయి. మీ ఆశీర్వాదంవల్ల అమ్మాయి ఇంకా మంచి పేరు సంపాదించుకుంటుంది."

"అంతా ఈశ్వరేచ్ఛ!"

"అమ్మా శకుంతలా! ఇక్కడే కూర్చుని ఒక చక్కని శృతి పాడి నాన్నగారికి వినిపించు తల్లీ" అన్నాడు రామనాథం.

శకుంతల లోనికివెళ్ళి తంబుర తెచ్చుకుంది.

చిరిచాప పరుచుకుని కూర్చుంది.

మంచం మీద గోపాలం అలవోకగా కూర్చున్నాడు. పక్కనే బెంచి మీద రామనాథం వినయంగా కూర్చున్నారు.

బయట ఏదో అలికిడి అవడంతో భానుమూర్తి ముందుకు వెళ్ళి లోపలకు వస్తున్న సుందరాన్ని కూడా అక్కడకు తీసుకు వచ్చాడు.

సుందరం గురువుగారికి, గోపాలం గారికి నమస్కారం చేసి అక్కడే కూలబడ్డాడు.

శకుంతల శృతి చేసుకుని కీర్తన ప్రారంభం చేసింది.

"నెనరుంచినాను...అన్నిటిని నిదానుడని నేను...నీదుపై నెనరుంచినాను..." అనే కీర్తన పాడింది.

అది వింటున్నంత సేపూ గోపాలం గారు కళ్ళు మూసుకుని 'తమకం' పొందుతున్నారు. ఎదురుగా పాడుతూ వున్నది కూతురే అయినా ఆయనకు ఆ క్షణంలో తల్లిగారి గొంతు వినిపించి వుండాలి. తల్లిగారి సంగీతం ఒక పక్క, భార్య సంగీతం మరోపక్క ముసురుకు వచ్చి యిక్కడ శకుంతల వైపు ప్రసరిస్తున్నట్లు ఈ మహోద్వేగాలకు చిన్నపిల్ల తట్టుకోలేక ఒళ్ళు తెలియకుండా పాడుతూ వున్నట్లు అనిపిస్తోంది ఆయనకు.

శకుంతల కంఠంలోని నిండుదనం అందరినీ పరవశం అయిపోయేట్టు చేస్తుంది. ఇంత చిన్నపిల్ల-అంత గంభీరంగా, ఎలా పాడ గలుగుతుంది, అనుకుంటారు. మొదటిమారు చూసినప్పుడు, విన్నప్పుడు-ఎవరయినా గానీ.

శకుంతల చాలా శ్రావ్యంగా పాడింది. క్లుప్తంగా సుందరంగా పాడింది.




సుందరం నిన్నటి సంగీత కచేరీని గురించి నాలుగు మంచి మాటలు చెప్పి కులాసా కబుర్లు విని వెళ్ళిపోదామని వచ్చాడు. అనుకోకుండా శకుంతల పాట వినే భాగ్యం కలగడంతో తాను ధన్యుడనయి పోయానని మురిసి పోయాడు.

పాట పూర్తి అవగానే గోపాలం కళ్లు తెరిచి శకుంతల వైపు అనురాగం, అభినందన జోడించి చూశాడు. ఆయన చూపులోని బలం శకుంతలకు కొత్త ఉత్సాహాన్ని, ఉత్తేజాన్ని యిచ్చినట్లు అయింది.

సుందరం కళ్ళల్లో తేజస్సు చెప్పనే అక్కర్లేదు.

ఆ ఆరాధనలో వెయ్యి దీపాలు-మెరిసి పోతున్నట్లున్నాయి, అతని కళ్ళు.

"ఇంక లోపలకు వెళ్ళమ్మా" అన్నారు గురువుగారు.

ఆమె వెళ్ళిన తరువాత "సరస్వతీదేవి సంగీతం పాడుతూ వుంటే ఇలాగే వుంటుందా బాబుగారూ!" అనడిగారు గురువుగారు.

"సంగీతానికి వరదేవత సరస్వతీదేవి. మూర్తీభవించిన సంగీతం ఆమె. ఆమె సంగీతం ఆలకించినప్పుడు సంగీత రసం ఆవిరయిపోయి ప్రకృతిలో కలిసి పోతుందట. ఎంతమంది దేవతలు సంగీత రసం ప్రసరిస్తూంటే, ఈ పుడమి ఇలా క్షణక్షణమూ సర్వాంగ సుందరంగా శోభిస్తున్నదంటారు! మనుష్యుల సంగీతానికి, సంగీత రూపం రసంగా మారడమే పరాకాష్ట. అంతకంటె ఎక్కువకు నోచుకోలేదు మనం...సరే. సంగీతాన్ని గురించి నేను నీకు చెప్పాలా రామనాథం? సూర్యుడి ముందు కొవ్వొత్తి వెలిగించ మంటున్నావా?..." అంటూ మాటలు మళ్ళించేశాడు గోపాలం.

"మీరు ఏమయినా అనండి. మేం ఏదో శాస్త్ర కృతుగా పాడి వినిపించగల వాళ్ళమే గాని, దానిని గురించి, రసాస్వాదనలోని తరగతులు గురించి అంచెలంచెలుగా చెప్పగలవాళ్ళంకాదు గదా."

"చెప్పలేకపోయినా, అదంతా అనుభవించిన వాడివి. నీకు తెలియకుండానే నీలోంచి రసం ఉత్పత్తి అవుతుంది."

"ఆత్మానందం అంటే అదేనాండీ?" అనడిగాడు సుందరం.

"పేర్లు ఎన్నయినా పెట్టుకోవచ్చును. కానీ అది కేవలం అనుభవైకవేద్యం అంతే!"

"ఆ అనుభవం అయినా ఎంతోకృషి మీద తప్ప పట్టు చిక్కదను కుంటాను. మా బోటివాళ్ళకు అది పుస్తకాలలో చదువుకో వలసిందే" అని నిట్టూర్పు విడిచాడు సుందరం.

భానుమూర్తికి ఇదంతా గందరగోళంగా వుంది.

అంతేకాదు. అనవసరమయిన ప్రస్తావనగా కూడా అనిపించింది.

అతని మనస్సు యిప్పుడు సంగీత రసాన్ని రూపాయలకి మారకం చేయడంలో మునిగిపోయి వుంది.



## 10

శకుంతల సంగీతాన్ని గురించి కొన్ని పత్రికలు శ్లాఘిస్తూ సమీక్షలు రాశాయి.

అనేకమంది సంగీతజ్ఞులు అమ్మాయికి మంచి భవిష్యత్తు వున్నదని ఆకాంక్షలు తెలిపారు. శకుంతలకు వీటన్నికీ విడిగా అర్థాలు తెలియవు. గురువుగారు చెప్పి నట్లు శ్రద్ధగా సాధన చేసుకుంటూ వెడుతోంది.

గురువుగారు ఒకనాడు ఏదో అచ్చు కాగితాలు తీసుకు వచ్చి శకుంతల చేత పూర్తి చేయించి పోస్టుకు పంపారు. అవి రేడియో స్టేషన్ డైరక్టరుకు, కర్నాటక సంగీత కచేరీలు రేడియో ద్వారా ప్రసారం చేయించడానికి దరఖాస్తు ఫారాలు. వారం రోజులు తిరగకుండానే ఫలానా తేదీకి 'ఆడిషన్'కు రమ్మని జవాబు వచ్చింది. శకుంతల మరింత విజృంభించి 'సాధన' చేయనారంభించింది.

రెండు మూడు నెలలలో శకుంతలకు అయిదారు సంగీత కచేరీలు వచ్చాయి. కొన్ని పొరుగు ఊళ్ళకు వెళ్ళవలసినవి కూడా వున్నాయి. అమ్మాయిని పొరుగు ఊరు పంపడానికి ముందు శాంతమ్మ తట పటాయించింది. గురువుగారు మాత్రం ధైర్యం చెప్పారు. ఒక ఊరుకైతే ఆయనే కూడావుండి తీసుకువెళ్ళి కచేరీ చేయించి తీసుకువచ్చాడు. కానీ ప్రతిసారీ తాను కూడా వెళ్ళడం కుదరదనీ, అదీగాక ఆ పని అనవసరమనీ తేల్చి చెప్పాడు. అందుచేత నికరయిన యేర్పాటు ఏదో చేసుకో వలసి వచ్చింది.

"పై ఊళ్ళకు వెళ్ళక పోతేనేం? ఈ ఊళ్ళో ఉన్న కచేరీలు చాలు" అంది

శాంతమ్మ.

"అలా అంటే ఎలాగమ్మా? నాలుగు ఊళ్ళల్లోను కచేరీలు చేయకపోతే దేశంలో ఎలా పేరు వస్తుంది?"—అన్నాడు భానుమూర్తి.

"పేరు మాట సరేనయ్యా...మనకు కుదరనప్పుడు..."

"ఎందుకు కుదరదమ్మా, నేనున్నానుగా-చెల్లాయిని తీసుకువెళ్ళి జాగ్రత్తగా తీసుకువస్తాను. నాకు చెడిపోయే ఆఫీసులు, పనులు ఏమీ లేవుగా. పైగా ఊళ్ళు తిరగడం అంటే నాకు సరదా కూడాను."

"నీ చదువు ఏం చేస్తావు?"

"బడికి వెళ్ళేపని లేదుగా. పుస్తకాలు కూడా తీసుకుపోతే చాలు."

శాంతమ్మకు ఈ పద్ధతి ప్రయత్నించి చూడాలనిపించింది.

అవును. భానుమూర్తి వున్నాడుగా—అన్న భరోసా యేర్పడింది ఆమెకు.

చెల్లెలితోపాటు పొరుగు ఊళ్ళకు వెళ్ళి కచేరీ చేయించి తీసుకువచ్చే బాధ్యత భానుమూర్తి భుజస్కంధాల మీద పడింది. ఈ బాధ్యత స్వీకరించినందువల్ల అతనికి కొత్తగా కొంత పెద్దరికం కూడా వచ్చింది.

సంగీతంలో కేవలం అభిరుచి, వ్యక్తిగతమైన ఇష్టమే కాకుండా కొంత పోషకత్వం కూడా అతని మీద పడింది. ఈ పనులన్నిటి మధ్య అతని చదువును గురించి పట్టించుకునే మాట దేవుడెరుగును, ఆలోచించేందుకయినా అవకాశం లేకుండా పోయింది.

ఈ లోపల శకుంతల రేడియో స్టేషన్‌కు వెళ్ళి ఆడిషన్ ఇచ్చి వచ్చింది. నెల రోజులలో ఆడిషన్ 'సక్సెస్' అయినట్లు, మీలువెంట కార్యక్రమాలు యిస్తామనీ శుభ వర్తమానం వచ్చింది. మరుసటి నెలలో మొదటి ప్రోగ్రాం రానే వచ్చింది కూడాను.

* * *

"చెల్లాయి రేడియోలో పాడుతుంది. మనం ఎక్కడ నుంచి విందాం?" అన్నాడు భానుమూర్తి.

"నీ స్నేహితుడు సుందరం యింట్లో..."

"ఒకసారి - రెండుసార్లు ఫరవాలేదనుకో. అయినా ప్రతిసారీ యెక్కడికో ఒక చోటికి వెళ్ళి వినడం యేం బాగుంటుంది?"

"మరేం చేద్దాం-"

"అంతేకాదు - యింకెక్కడికయినా వెళ్ళి వినడం అంటే, అమ్మ-నాన్నగారు వినడం కుదరదు గదా; అందుచేత మన యింట్లోనే మన రేడియోనుంచే వినాలి-" అని తేల్చివేశాడు, భానుమూర్తి బహు తేలికగా.

అప్పటికి శకుంతల నాలుగయిదు కచేరీలు చేసి వుండడం వల్ల కొంతడబ్బు పోగయి వుంది. యింట్లో, ఈ సంగతి భానుమూర్తికే కాదు, యింట్లో అందరికీ తెలుసును. భానుమూర్తికి చేతిలో డబ్బు ఆడుతూ వున్నప్పుడు ఖర్చు చేయకుండా లోభిగా వుండడం చేతకాదు. జీవితం వీలయినంత ఆడంబరంగా వుండాలని అభిలషించే మనిషి అతను.

గురువుగారి ముందు కూడా యీ ప్రస్తావన వచ్చింది. భానుమూర్తే తీసుకువచ్చాడు, మనసులో భగవంతుని తలుచుకుంటూ.

ఆయన యీ ప్రతిపాదన బలపరచారు.

"ఇంట్లో రేడియో వుండడం మంచిదే. రేడియోలో నుంచి అనేకమంది గొప్ప విద్వాంసుల సంగీతం చెవిని పడుతూ వుంటుంది. అవన్నీ వింటూ వుంటేగాని ఒక 'ఒరవడి' అంటూ యేర్పరచు కోవడం కుదరదు. వీలయితే తప్పకుండా కొనండి" అన్నాడాయన.

తథాస్తు! శకుంతల సంగీతం రేడియోలో ప్రసారం కావడానికి వారం రోజులు ముందుగానే భానుమూర్తి ఒక మంచి 'సెట్' తీసుకు వచ్చి, యింట్లో ప్రతిష్ఠించాడు.

శకుంతల నియమం ప్రకారంసాధనం చేస్తోంది. పది చోట్లకు వెళ్ళి రావడంవల్ల యితర సంగీత విద్వాంసులు, అభిమానులతో పరిచయం అవుతూ వచ్చింది.

ఇన్నాళ్ళూ తాను, తన యిల్లుగా వుంటూ వచ్చిన పిల్ల యిప్పుడు బయటకు వెళ్ళి రావడానికి ముందు ముందుగా కాస్త బిడియంగానే వుండేది. అంత చొరవ అయినపిల్ల కాదు గనుక పది మందిలోనికి చొచ్చుకుపోవడం అంతంత మాత్రంగానే వుంది. క్రమక్రమంగా పది మందితో మెలగడం, కులాసాగా కబుర్లు చెప్పుకోవడం యిటువంటి వన్నీ అలవాటు అవుతున్నాయి. బయటి ప్రపంచంతో సంబంధం యెక్కువ అవు తున్న కొద్దీ శకుంతలకు అంతర్ముఖత కూడా యేర్పడుతూ వస్తోంది. పది మందితో తన పరిస్థితి పోల్చి చూసుకోవడం, ఎగుడు దిగుడులను గుర్తించ గలగడం జరుగుతోంది.

శకుంతల చిన్నతనం నుంచి తల్లి చాటున పెరిగిన పిల్ల, ఈ రోజుకు కూడా ఆమెకు ప్రత్యేకంగా ఆత్మీయులంటూ యెవరూలేరు. మనసులో మాట పైకి చెప్పాలన్నా, యేమయినా పైకి మాట్లాడాలన్నా యీ పనులు యెవరి ముందు చేయవచ్చునో ఆ పిల్లకు తెలియదు. ఒక్కతే కూతురు అవడం వల్ల తల్లీ తండ్రీ గారాబం చేసినమాట వాస్తవమే. సరీగా ఆ పిల్ల ఎదిగి యీ ప్రపంచాన్ని అర్థం చేసుకోగల వయసు వచ్చే సరికి, ఆ యింటి వాతావరణంలో మార్పు వచ్చేసింది. తారుమారు అయిపోయాయి పరిస్థితులన్నీని. అందుచేత శకుంతల కూడా ఆ యింటి గాంభీర్యాన్నే పులుముకో వలసి వచ్చింది ముఖానికి. ఈ గాంభీర్యానికి యిప్పుడిప్పుడే ఆట విడుపు లభిస్తోంది, నలుగురు లోనికి వెడుతూ వస్తూ వుండడం వల్ల.

సంగీత ధోరణిలో పడినప్పటి నుంచి సమయమంతా సాధన చేయడంతోనే సరిపోయింది. అటూయిటూ తిరగ వలసిన అవసరం గానీ అవకాశం గానీ లేకుండా పోయింది.

ఇప్పుడు కాస్త బయటి వాతావరణంతో పరిచయం యేర్పడుతోంది గనుక శకుంతలకు యీ మార్పు తెలిసి వస్తోంది.

ఎక్కడి కయినా సంగీత కచేరీకి వెళ్ళి వచ్చిందంటే – కచేరీకి ముందు, తరువాత కొందరు అభిమానులు శ్రేయోభిలాషులు ఆమె చుట్టూ చేరుతారు. కొత్తగా పరిచయం చేసుకున్న వాళ్ళు తనను గురించి రకరకాల ప్రశ్నలు వేస్తారు.

"ఇంత చక్కగా పాడతారు... ఎలా పాడతారండీ?" అంటారు చుట్టూ చేరిన ఆడపిల్లలు.

"ఎన్నాళ్ళ నించి సాధన చేస్తున్నారు?"

"మీకు ఎన్ని కీర్తనలు వచ్చును?"

"మీ గురువుగారు ఎవరు?"

"మీకు సంగీతం కుటుంబ విద్యగా వున్నదా ?"

"మీ నాన్నగారు యేం చేస్తారు?"

"పెళ్ళయిందా?"

"మీ భర్తగారు సంగీతానికి ఒప్పుకుంటారా ?"

"మీ భర్తగారి ప్రోత్సాహం లేకపోతే సంగీతానికి స్వస్తిచెబుతారా?"...యిలా రకరకాల ప్రశ్నలు.

దేనికీ నోరువిప్పి సమాధానం చెప్పడం కుదరదు శకుంతలకు. సమయానుకూలంగా తల ఆడించడమో, "అవును-కాదు అంటూ ఒకటి రెండు అక్షరాలతో సరిపెట్టడమో చేస్తూ వుంటోంది.

శకుంతలకు అర్థం అయింది యేమిటంటే, సంగీతం అంటే అభిమానం వున్న వాళ్ళకు తాను గౌరవప్రద మయిన మనిషిగా కనిపిస్తుంది.

వాళ్ళు ఆప్యాయంగా పలకరించటానికి ప్రయత్నిస్తారు. "తామంతా ఒకటి" అన్నట్లుగా ప్రవర్తించటానికి చూస్తారు. సంగీత కళాభిమానులంతా ఒకటే కుటుంబం అన్నట్లుగా వుంటోంది వాళ్ళ ధోరణి.

వాళ్ళు తనకు దగ్గరగా రావాలని ప్రయత్నం చేస్తారు. తనపట్ల ఎంతో ఆరాధన, అనురాగం, అభిమానం ప్రదర్శిస్తారు. తనతో పరిచయం పెంచుకుందుకు చూస్తారు. ఇదంతా తన సంగీతానికేగాని వ్యక్తిగతంగా తనకేమాత్రం విలువలేదని ఆమెకు అప్పుడప్పుడూ కొట్టవచ్చినట్లు తెలిసివస్తూవుంటుంది.

వ్యక్తిగతమయిన ఆప్యాయత మనసును ఆకట్టుకున్న తరువాత యిటువంటివేమీ పనిచేయవు. శకుంతల మనస్సు ఇటువంటి వ్యక్తిపరమయిన ఆప్యాయత, ఆదరణలకోసం వెంపర్లాడుతూ వుంటుంది. ఎక్కడికక్కడే కొందరు అభిమానులు పొగడడం, తరువాత వాళ్లు కనిపించకుండా పోవడంతో శకుంతలకు యిటువంటి అభిమానాలమీద క్రమంగా అభిప్రాయం తగ్గింది.

తనకు మొదటి నుంచి పరిచయం వుండి ముఖ్యంగా సంగీతం ద్వారానే దగ్గర అయిన వాడు ఒక్క సుందరమే. అతనొక్కడే తన సంగీత ప్రగతిని గురించి నిజంగా పట్టించుకునేవాడు అనిపిస్తుంది. తాను పాడుతూ వున్నప్పుడు అతని కళ్ళల్లో వెలుగుతూవుండే తేజస్సు ముఖంలో విప్పారుకుని కనిపించే ఆనందం... ! నిజంగా వీటిని చూడడానికే తనకు ఎప్పుడూ పాడుతూ వుండిపోవాలనిపిస్తుంది శకుంతలకు.

నిజానికి అతన్నిగురించి తనకేమీ తెలియదు. ఎక్కువగా తెలుసుకోవాలని ఉత్సాహపడింది కూడా లేదు. అతను భానుమూర్తి అన్నయ్యకు స్నేహితుడు.

ఒకసారి భానుమూర్తినే అడిగింది శకుంతల "నీకు సుందరంగారు ఎలా పరిచయం ?" అని.

"ఏం, ఎప్పుడో అయిదోక్లాసులోనో ఆరో క్లాసులోనో కలిసి చదువుకున్నాం అనుకుంటాను. తరువాత అతను ఈ ఊరునుంచి వెళ్ళిపోయి, యిటీవలనే అయిదేళ్ళక్రితం మళ్ళీ వచ్చాడు..."

"అంత పాత స్నేహితుడిని నీవు గుర్తు పట్టగలిగావా ?"

"నా ముఖం! నాకేం తెలుసును ?

ఆ యనే గుర్తుపట్టి పలకరించాడుముందు. అతను యం.ఏ. చేశాడు తెలుసా ?"

"నిజంగానా అన్నయ్యా ?"

"అవును. అయినా ఒక్క వీసం ఎత్తయినా గర్వంలేదు."

"సంగీతం అంటే యిష్టమా ?"

"మొదట్లో వుండేదికాదు. ఆ క్రెడిట్ నాదే. నేను చెవుల్లో యిల్లు కట్టుకుని పోరిన తర్వాతనే అతను సంగీతం గురించి పట్టించుకున్నది."

"సంగీతం అంటే యిష్టంలేక పోయినా ... నీ పోరు పడలేకా..."

"కానీ ... యిప్పుడు సంగీతంలో నాకే పాఠాలు చెబుతాడు. చురుకయిన వాడులే"

'తనకున్న మంచి స్నేహితుడు సుందరం' అని భానుమూర్తి గర్వంగా చెప్పుకుంటాడు.

అతన్ని గురించి భానుమూర్తి అంత కంటే యింకేం చెప్పలేదు. శకుంతలకు అతనితో పరిచయం ఎలా పెరిగిందీ గుర్తు – అప్పుడప్పుడూ అవన్నీ గుర్తు తెచ్చుకుంటూ వుంటుంది.

తను మొట్టమొదటి కచేరీ చేసిన రోజున వచ్చాడు భానుమూర్తితో కలిసి. తరువాత రెండుమూడు మార్లు యింటికి వచ్చాడు. కొద్దిగా పరిచయం అయిన మీదట తనతో చనువుగా మాట్లాడడమూ ప్రారంభించాడు. సంగీతాన్ని గురించి యెన్నో ప్రశ్నలు వేస్తాడు. గురువుగారి ద్వారా సమాధానాలు తెలుసుకుని ఆనందిస్తాడు. సంగీత రసాస్వాదనలో తన్మయుడవుతాడు. తనకు కావలసిన రాగాలు, కీర్తనలు చెప్పి మరీ పాడించుకుంటాడు. పాడుతూ వున్నప్పుడు తన వంక ఆరాధనగా చూస్తూవుంటాడు. అతని కళ్ళల్లో ఆరాధన చూస్తూవుంటే తనకు నూతనోత్సాహం, ఉత్తేజం, స్ఫూర్తి కలుగుతాయి. ఈ విషయం ఆమెకు ప్రత్యక్షానుభవం మీద రూఢి అయింది.



# 11

శకుంతల పట్ల అభిమానం చూపించే వాళ్ళలో రేడియోస్టేషన్‌లో పనిచేసే ఆఫీసర్ దేశికన్ ఒకరు. ఆయనకు రామనాథం గారంటే అభిమానం, గౌరవం. శకుంతల ఆ గురువుగారి శిష్యురాలు కనుక ఆమెపట్ల మరింత అభిమానం కనపరచసాగాడు. ఆమె సంగీత కచేరీలు యేర్పాటు చేయడంలోను సరయిన పక్కవాద్యాలు కుదర్చడంలోను ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటున్నాడు. ఒకటి రెండు మార్లు శకుంతల యింటికి కూడా వచ్చి అందరితోనూ పరిచయం చేసుకు వెళ్ళాడు.

శకుంతలకు రేడియో స్టేషన్ నుంచి ఒక కంట్రాక్ట్ వచ్చింది. ఇది మామూలు సంగీత కచేరీకోసం కాదు, ఏదో సంగీత రూపకంలో పాల్గొనడానికి.

దీన్ని 'ఏక్సెప్ట్' చేయడానికి ఆమె ముందుగా సంకోచించింది. సంగీతం అంటే వర్ణాలు, కృతులు గురువుగారి దగ్గర నేర్చుకున్నది, ముక్కస్యముక్క

పాడేస్తే సరిపోతోంది. ముందుగా జాబితా వేసుకుని.

అదే ఏదో ప్రోగ్రాంలో తనకు తెలియని పాటలు పాడాలన్నా యితరులతో గొంతు కలపాలన్నా తనకు చేతనవుతుందో లేదో! భానుమూర్తి తన సహజమయిన పద్ధతిలో ధైర్యం చెప్పటానికి చూశాడు. "నీకేంభయం అక్కర్లేదమ్మా! నువ్వు చెయ్యగలవు గనుకనే వాళ్ళు కాంట్రాక్ట్ పంపారు. మరేం బెంగ పెట్టుకోకుండా కాంట్రాక్ట్ సంతకం చెయ్యి"

అయినా ఆమెకు ధైర్యం చాలింది కాదు.

గురువుగారు ఆమె సంశయాలన్నీ తీర్చారు.

రేడియోస్టేషన్‌లో సంగీతం కంపోజ్ చేసే ప్రయోక్తలూ,విద్వాంసులూ వుంటారమ్మా. వాళ్ళు నీవు ఎలాపాడాలో పాఠం చెబుతారు. ట్యూన్ ముందుగా నీకు వినిపిస్తారు. పాడి చూపిస్తారు. ఎన్నిమార్లయినా రిహార్సల్ చేయిస్తారు. నీకేం భయం అక్కర్లేదు"

'నేర్చుకోలేనని కాదు భయం. సరిగ్గా చేయలేకపోతే ఉన్న పేరుకాస్తా పోతుందేమోనని' అనుకుంది మనసులో.

గురువుగారి భరోసా ఆసరాగా తీసుకుని ఒప్పుకుంది.

ఈ సంగీత రూపకం ముప్పావుగంట సేపు నడుస్తుందట. శకుంతల కాక ఇంకా నలుగురు ఆడవాళ్ళు, పదిమంది మగవాళ్ళు వున్నారు దీనిలో మొత్తం పాడేవాళ్లు. వీళ్ళంతా కాక సంగీత వాద్యగాళ్ళు సరేసరి !

రేడియో రూపకంలో పాల్గొనటానికి కొత్త ఆర్టిస్ట్ వచ్చింది గనుక చాలా మందికి ఈమె ఎలా చేస్తుందో చూడాలని కుతూహలం ఏర్పడింది. నాటకాల శాఖ, సంగీత శాఖలో పనిచేసే ఆర్టిస్టులు, సంగీతజ్ఞులే కాకుండా ఆఫీసర్లు కూడా తడవ తడవలుగా వచ్చి ఆమె పాట గమనించి వెడుతున్నారు. అలవాటు లేకపోవడంవల్ల శకుంతలకు ముందు ఉక్కిరి బిక్కిరి అయిపోయిన మాట నిజమే.

వేలాది ప్రేక్షకుల ముందు వేదికమీద కూర్చుని పాడడం వేరు. ఒక చిన్న గదిలో సంగీతమే విద్యగా ఉపాసించిన ఇరవై ముప్ఫయి మంది ముందుకూర్చుని పక్క వాద్యాలతో సరిగా పొందికగా గొంతు చేర్చుకుంటూ తనకు యిచ్చిన గేయాల ముక్కలు కూనిరాగాలుగా అనడం వేరు. కొత్త మనుషులు కొత్త పని. అయినా ఉత్సాహం చెప్పుకుంటూ శకుంతల తన పని సజావుగానే సాగిస్తోంది. మధ్య మధ్యలో భానుమూర్తి ప్రోత్సాహం అందచేస్తున్నాడు.

భానుమూర్తి ఈ ఆసరాతో రేడియో స్టేషన్లో పని చేస్తున్న అందరితోనూ పరిచయం చేసుకున్నాడు. అతని బహువ్యాపకం వల్లనే చాలమంది తనను చూడడానికి వస్తున్నారని శకుంతల చిరాకు పడింది కూడాను.

చివరి రిహార్సల్‌కు అసలు టేక్ జరుగుతూ వున్నప్పుడు స్టేషన్ డైరక్టర్ వచ్చి పది నిమిషాలపాటు కూర్చుని వెళ్ళారు. ఆయన వచ్చిన కాసేపు వాతావరణం అంతా గంభీరంగా తయారవడం శకుంతల గమనించింది.

ఈ సంగీత రూపకంలో శకుంతలది కాస్త ప్రధానమయిన పాత్ర,మరో ప్రధానమయిన పాత్రరాజేశ్వరి అనే అమ్మాయికి

యిచ్చారు. రాజేశ్వరిని కలుసుకోవడం శకుంతలకు ఇదే మొదలు. అంతకు ముందు రెండు మూడుమార్లు ఆ గొంతు రేడియోలో విన్నది. ఆమె కాస్త కలుపు గోలు తనంగా శకుంతలతో మాట్లాడడంతో యిద్దరికీ కొద్దిపాటి స్నేహం అయింది.

ఈ రూపకం నాలుగు రోజులపాటు రిహార్సల్ జరిగింది. తరువాత రికార్డింగ్ రెండు రోజులు జరిగింది. అంటే దాదాపు ఒకవారం రోజులు శకుంతల రేడియో స్టేషన్‌లోనే గడిపి వేయవలసి వచ్చిందన్నమాట. రాజేశ్వరితో సన్నిహితత్వం ఏర్పడేందుకు ఇది మరింత దోహదం చేసింది.

రాజేశ్వరి శకుంతల కంటే అయిదారేళ్ళు పెద్దది. ఇప్పటికి పది సంవత్సరాలుగా సంగీతం పాడుతోంది. మంచి పేరు సంపాదించుకుంది. ఆమె భర్తకు యీ ఊళ్ళోనే ఉద్యోగం. వాళ్ళకు యిద్దరు పిల్లలు కూడా వున్నారు. ఈ సంగతులన్నీ రాజేశ్వరి ఆమెతో పరిచయం అయిన కొద్ది సేపట్లోనే చెప్పేసింది.

"నాకు సంగీతం అంటే ప్రాణం. కానీ పాడుకుంటూ కూర్చోవడానికే సమయం చిక్కదు. సంసారం అన్నాక అనేక తాపత్రయాలు. అసలు నాకు బయటకు వచ్చి కచేరీలు చేయడమే ఇష్టంలేదు" అంది రాజేశ్వరి మాటల సందర్భంలో.

"మరి బయట ఊళ్ళకు ఎలా వెడతారు ?"

"వెళ్ళను...నేను చేసే కచేరీలన్నీ యీ ఊరికే పరిమితం. ప్రక్కనే రేడియో స్టేషన్ వుండడం నా అదృష్టం అని చెప్పాలి. నా మట్టుకు నాకు ఒంటరిగా పాడుకుంటూ కూర్చోవడమే ఆనందంగా వుంటుంది" అంది.

ఆమె మాటల ధోరణి విన్న తర్వాత తనకూ అలా చకచక మాట్లాడగలగడం వస్తే ఎంత బాగుండును—అనుకుంది శకుంతల.

అప్పటికే బయటి వూళ్ళకు వెళ్ళి కచేరీలు చేసి వచ్చినందువల్ల శకుంతలకు ఆమె వెలిబుచ్చే అభిప్రాయాలతో అంత యేకీభావం కుదరలేదు. 'దేశం నాలుగు మూలల తిరగాలనే' భానుమూర్తి వాదం ఆమెను బాగా ఆకట్టుకుంది. అలా కాకుండా ఉన్న వూళ్ళోనే ముడుచుకు వుండిపోయి—గుడుగుడు గుంజం ఆడడం, నూతిలో కప్పలా ఉండడం ఆమెకు ఇష్టం కాదు. అయినా యీమె అభిప్రాయాలు కొత్తవిగా వున్నాయి—అన్నట్లుగా వింటూ కూర్చుంది.

రాజేశ్వరిని గురించిన యిలాంటి వ్యక్తిగతమయిన విషయాలే కాకుండా అసలు సంగీత ప్రపంచాన్ని గురించి కూడా అనేక అభిరుచిదాయకమయిన సంగతులు మొదటిమారుగా వినగలిగింది శకుంతల.

సంగీత విద్వాంసులలో పరస్పరం వుండే అసూయాద్వేషాలు,ఒకళ్ళనొకళ్ళు పడదొక్కాలని చేసే ప్రయత్నాలు యెన్నో చెప్పసాగింది రాజేశ్వరి.

"మీతోపాటు యుగళగీతం పాడుతాడు చూడండి, సూర్యనారాయణ అనే అతను - దేశంలో కచేరీలన్నీ తనకే రావాలని ప్రయత్నం చేస్తాడట!"

"అన్నీ తనే చేయగలడా?" అనడిగింది అమాయకంగా శకుంతల.




"చేయగలడని కాదు. చేయాలని అతని తాపత్రయం. అంత ఆత్రగొట్టు మనిషి. ఇతరులకు వచ్చే కచేరీలు చెడ గొట్టడంలో ప్రవీణుడు. తనకు లేక పోయినా ఫరవాలేదు. ఇతరులు కడుపు నిండా తింటే ఓర్చుకోలేడు".

"బాగా పాడతాడా ?"

"మీరే చూస్తున్నారుగా. ఆ గొంతు ఒకమారు విన్నవాళ్ళు మరోసారి వినాలని కోరుకుంటారేమో చెప్పండి".

తోటి ఆర్టిస్టులను గురించి అలా తేలికగా మాట్లాడడం ఎబ్బెట్టనిపించినా శకుంతలకు యీ ధోరణికి నవ్వుమాత్రం వచ్చేసింది.

"మరి అతనికి కచేరీలు యెలా వస్తున్నాయి అసలు ?"

"అంతా అతని గురువుగారి ఆశీర్వాద బలం. అయినా ఒక్క విషయం గుర్తు వుంచుకోండి మీరు. సంగీతం బాగా పాడడానికీ, కచేరీలు రావడానికీ యేమీ సంబంధం లేదు".

"నాకు అర్థం కాలేదు"

"సంగీత సభలవాళ్ళలో యెన్ని రాజకీయాలు వున్నాయో తెలుసుకుంటే మీరు ఇప్పుడే ఇక్కడే మూర్ఛపోతారు. ఆ గొడవంతా యిప్పుడెందుకులెండి..."

—మంచి సంగీతం, పాడగలగడం వొక్కటే చాలదా?

శకుంతలను యీ ప్రశ్న వేదించ సాగింది. కానీ చర్చ అప్పటికి అంతటితో ఆగిపోవడం శకుంతలకు యిష్టంగానే వుంది. ఇతరుల వివరాలు తెలుసుకుని తాను యేం చేయగలదు ? తనమట్టుకు తనకు యింతవరకూ బాగానే జరిగిపో తోంది. ఇవన్నీ అనుభవంలోనికి వచ్చి నప్పుడు చూసుకోవచ్చును—అనుకున్నది. తాను యింకా పిల్లకాకే కదా!—అనుకుని నవ్వుకుంది.

ఈ సంగీత రూపకం అంతా 'రికార్డ్' అయినమీదట, ఆర్టిస్టులందరికీ ఒకమారు స్టూడియోలో ప్లేబేక్ చేసి వినిపించారు. మొదటిసారే అయినా శకుంతల బాగానే చేసింది. ఆ సంగతి యిద్దరు ముగ్గురు పైకే అన్నారు. ఆమెకు అభినందనలు తెలిపారు. దానికి ప్రయోక్తగా వున్న సంగీత కళాకారుడయితే ఒకటే మెచ్చు కోవడం !

"మాకు బయటి కచేరీలు యిప్పటికే తగ్గిపోయాయి. ఇక రేడియో కూడా మీరు ఆక్రమించుకుంటే మేం ఇళ్ళదగ్గరే వుండిపోవచ్చును"అంది ఓ నలభై యేళ్ళ ఆవిడ, శకుంతలను మింగి వేయా లన్నట్లుగా చూస్తూ.

శకుంతలకు యేమనాలో తోచలేదు.

'నేను చెబితే మీరు నమ్ముతారా ?' అన్నట్లుగా చూసింది రాజేశ్వరి ఆమె వైపు, 'ప్రొఫెషనల్ జెలసీ' అంటే యిదీ, గమనించండి—అన్నట్లుగా.

"నా మోహనరాగం బిట్ మరీ పేల వంగా వున్నట్లుందండీ" అంది శకుంతల.

"చంద్రునికో మచ్చలాగ అలా వుంటేనే మంచిదిలెండి మీకు" అన్నాడు రేడియో ఆర్టిస్టు ఒకతను, ఊరడిస్తున్న ట్లుగా.

కచేరి చేసి రావడంవేరు, యిలా రేడియో నాటకాలలో పాల్గొనడం వేరు. ఇదంతా కొత్తరకం అనుభవమే నిజానికి అనుకుంది శకుంతల.

విడిపోయేముందు రాజేశ్వరి "మీరు ఒకమారు తీరుబడి చూసుకుని మా

యింటికి రావాలి" అంది.

శకుంతల వాళ్ళ యింటి గుర్తులు అడిగి తెలుసుకున్నది.

"తెలుపులో వెన్నెలా
మలుపులో రేచన
సిరివెల్లి పచరించెనో
విరిపూల నెరతావి తరమెంచునో.."

—శకుంతల ఈ 'కిన్నెరసానిపాట' సుశ్రావ్యంగా పాడుతూ వుండగా వచ్చాడు సుందరం.

ఆమె భావగీతాలు సాధనం చేయడం కూడా ఇటీవలేనే సంప్రాప్తమయింది.

"నాకిప్పుడో కొత్త చిక్కు వచ్చి పడింది" అన్నది శకుంతల ఒకరోజు.

"ఏమిటది?" అన్నాడు ఉత్సాహంగా, కాస్త ఆదుర్దా కూడా జోడించి సుందరం.

"సంగీత కచేరీ మధ్యకు వచ్చేసే టప్పటికి ప్రేక్షకుల నుంచి కాగితం ముక్కలు వచ్చేస్తున్నాయి—"

"'అవా?' శ్రోతలు కోరిన పాటలు, అంటారు వాటిని రేడియోవాళ్ళు"

"—కొసకంటా వినండి. ఏదో కీర్తన, కృతి అయితే ఫరవాలేదు. వీలయితే పాడవచ్చును. లేకపోతే కాగితం ముక్కను 'ఇగ్నోర్' చేయవచ్చును. వాళ్లు లలిత సంగీతం పాటలు, భావగీతాలు, పదాలు పాడమని పంపుతున్నారు కాగితం ముక్కలు—"

"మరేం. లక్షణంగా పాడండి."

"ఎంత తేలికగా అనేశారు! ఇప్పుడవి కొత్తగా నేర్చుకోవలసి రావడం కష్టం కాదూ?"

"సమర్థులయిన వాళ్ళకు ఏమీ కష్టం లేదు. కాస్త టైం పడుతుంది అంతే!"

"కానీ శాస్త్రీయ సంగీతంలో యిటువంటి తేలిక పాటలు కలిపి వేయడం గురువుగారికి అంత ఇష్టంగా వుండదు—"

"కావచ్చును. కానీ యిప్పుడు విద్వాంసులందరూ కొన్ని కొన్ని యిటువంటి పాటలే—తేలికగా, లలితంగా కచేరీ చివర పాడేస్తూ వున్నారు."

"అష్టపదులు — తరంగాలు అయితే ఫరవాలేదనుకోండి."

"బొత్తిగా సినిమా పాటలు పాడమంటే మీరు సంకోచించాలి. అయినా, యేమాటకామాటే చెప్పుకోవాలి, ఇప్పుడు సినిమాలలో కూడా సాహిత్యపరంగానూ, సంగీతపరంగానూ మంచి మంచి పాటలే వస్తున్నాయి. సరే — ఆ విషయం అలా వుంచండి. రామదాసు కీర్తనలు, పురందరదాసు కృతులు — అన్నమాచార్యుల కీర్తనలు కొందరు ప్రత్యేక బాణీలు చేసి పాడుతున్నారు. అదీగాక కొత్తరకం పాటలకు ప్రచారం తీసుకు వచ్చినట్లూ అవుతుంది. ఈ రకమయిన ప్రయత్నం తమిళనాడులో పది, పదిహేను సంవత్సరాల నాడే ప్రారంభమయింది."

"అలాగా!"

తమిళ దేశంలోను, కన్నడ నాడులోను ఎక్కువ జోరుగావుంది ఈ ఉద్యమం. మన తెలుగు దేశంలో తక్కువ. మద్రాసులో అయితే ఒక సంగీత సభవాళ్ళు తమిళ కీర్తనలే పాడాలంటారు కచేరీలలో. తెలుగులో చక్కటి పాటలున్నాయి. మీరు లలిత సంగీత గేయాలు అవలీలగా పాడివేయవచ్చును."

"ఆ రకం గీతాలు ఎక్కడ దొరుకుతాయో.. ఎలా పాడాలో..."

"సాహిత్యపరంగా కాస్త బరువుగా వుండి, భావ ప్రధానమయిన గీతాలు కొన్ని ఎంచి యిస్తాను. బాణీలు మీరే కట్టుకుని... ప్రయత్నించ వచ్చును."

——సుందరం ఆమెకు కిన్నెరసాని పాటలు, ఎంకిపాటలు కొన్ని ఏరి తెచ్చి యిచ్చాడు. 'వైతాళికుడు' గ్రంథం కూడా తెచ్చి ఇచ్చాడు. "దీనిలో బోలెడన్ని చక్కటి గీతాలు వున్నాయి. మీ ఓపిక" అన్నాడు.

శకుంతల రాజేశ్వరి సహాయంతోను, రేడియో స్టేషన్‌లో పనిచేసే ఒక మ్యూజిక్ కంపోజర్ సలహాలతోను పది పన్నెండు పాటలు అందంగా తయారు చేసుకుంది.

ఎక్కడికి వెళ్ళినా, జనం అడిగినా

అడగకపోయినా, ఒకటి రెండు గేయాలు పాడి మరీ వినిపిస్తోంది.



## 12

శకుంతలకు యిప్పుడు రాష్ట్రం నాలుగు మూలలనుంచి ఆహ్వానాలు వస్తున్నాయి.

త్యాగరాజు ఉత్సవాలు జరుగుతూ వున్నప్పుడు ఎక్కడికి వెళ్ళాలి, ఎక్కడికి అక్కర్లేదు అని తేల్చుకోవడం పెద్ద సమస్య అయిపోతోంది కూడాను.

ఒక సంవత్సరం గడిచే సరికి ఆమె కార్యక్రమాలలోనే కాదు, దినచర్యలోనూ చాలా మార్పులు వాటంతట అవే వచ్చేశాయి.

ఆమె యిప్పుడు చాలా 'బిజీబర్డ్!'

విరామములేని కార్యక్రమాలు. వ్యవధిలేని ప్రయాణాలు.

భానుమూర్తి అన్న చక్కగా 'ఎరేంజ్' చేస్తాడు. తను ఏ క్షణంలో ఏం చేయవలసిందీ 'చిలకకు చెప్పినట్లు'గా చెబుతాడు; అతను ఆమెకు బాడీగార్డ్; గార్డియన్ కూడాను - పెద్దవాడు గనుక. కార్యక్రమాలు ఏర్పాటు చేయడంలో, ఉత్తర ప్రత్యుత్తరాలు నడపడంలోను 'సెక్రటరీ'. డబ్బు వసూలు చేయటానికయితే 'యజమాని' అనే చెప్పవచ్చును.

ఎక్కడకు వెళ్ళాలన్నా ఏపని చేయాలన్నా ముందు భానుమూర్తిని 'కన్‌సల్ట్' చేయకుండా జరపడానికి వీలు లేదు. అతను 'అఫెండ్' అయినాడంటే ఇంట్లో అందరినీ ఒక కాలిక్కి తెస్తాడు.

తనకు 'సాధన' ప్రాణప్రదంఅయితే భానుమూర్తికి 'కార్యక్రమాలు' అంటే యెక్కువ యిష్టం.

క్షణం విశ్రాంతి యివ్వని కార్యక్రమాలు, సాధనల మధ్య వెనకటి రోజులు అసలు గుర్తుకువచ్చే అవకాశమే తక్కువ. అయినా ఒక్కొక్క బలహీన క్షణంలో గుర్తుకు వచ్చినప్పుడు-శకుంతలకు 'యిప్పుడువున్న యీ వైభవం అంతా నిజమేనా?' అనిపిస్తూ వుంటుంది. రోజులు ముందుకు పోయినట్లు తనూ యెంతో ముందుకు పాకిపోయింది. తనలోనూ యెంతో మార్పు వచ్చింది, వచ్చి పడిపోయింది.

ఒక మూల కూర్చుని కూనిరాగాలు తీసుకుంటున్న 'పిల్లకూన' లాంటి తను దేశంలో యింత ప్రాచుర్యం సంపాదించడం నమ్మలేని విషయంగా వున్నది. అయినా నమ్మకుండా వుండడం యెలా వీలు? ఇదంతా ముందుగా అవుతుందని గానీ, జరుగుతుందనిగానీ తెలిసింది గాదు, అంచనాలు వేసుకున్నదీ కాదు. అందుచేత మరింత ఉక్కిరి బిక్కిరి అవుతూ వున్నది.

శకుంతల పేరుప్రఖ్యాతులు, మనసులో ఆలోచనలు పెరుగుతూవున్న కొద్దీ-యింటిలోని పరిస్థితులు, వాతావరణం, హడావుడి అన్నీ యిబ్బడి ముబ్బడిగా పెరుగుతూ వస్తున్నాయి.

ఒకప్పుడు 'యేదో ఒకటి, యింత-ఎండకు, వానకు రక్షించేదిగా వుండే

చాలును' అనుకున్న చిన్న అద్దెకొంప యిప్పుడు మరీ యిరుకు అయిపోయింది. నలుగురు వచ్చేపోయే యిల్లు అయిన తరువాత కాస్త ఆర్భాటం వుండడం తప్పనిసరి. వచ్చిన వాళ్ళు కూర్చోవ టానికి మంచి 'డ్రాయింగ్ రూం' లేక పోతే యేమనుకుంటారు?

భానుమూర్తి యిటువంటి విషయాలు అందరికంటే ముందుగానే ఆలోచిస్తాడు.

భానుమూర్తి ఒకనాడు సాయంకాలం పూట "పై ఆదివారం మనం ఫలాన మేడ మీదికి మారిపోతున్నాం" అని 'డిక్లేర్' చేశాడు.

కొత్త యింటితో పాటు యింటి సరంజామా అంతా పెరిగి పోయింది. అదంతా సహజమయిన పరిణామమేగాని ఎవరికీ విడ్డూరంగా చెప్పుకోవలసింది గానీ, వింతగా చూడవలసిందిగానీ ఏమీ లేనట్లుగా జరుగుతోంది. అంతా చకచకా నడిచి పోతోంది.

కట్టు బట్టల ప్రమాణం కూడా పెరి గింది. శాంతమ్మకు యిప్పుడు 'యింటి యాజమాన్యం'లో కొత్తరకం సమస్యలు వస్తున్నాయి.

గోపాలానికి మంచి వైద్యం, గట్టిది, నడుస్తోంది.

రమణ ఉద్యోగం మాత్రం అట్లాగే వుంది. కానీ భానుమూర్తి అంతస్తు మటుకు అకస్మాత్తుగా పది పన్నెండు రెట్లు పెరిగిపోయింది.

గురువుగారు యిప్పుడు రోజూ రావ డంలేదు. వచ్చినా 'పాఠం' చెప్పడంలేదు "చెప్ప వలసిందంతా అయిపోయింది. ఇక నీవు జాగ్రత్తగా సాధన చేసు కుంటూ వుండడమే. రోజూ పాఠం చెప్పుకో నక్కర్లేదు-" అన్నారాయన.

అప్పుడప్పుడూ ఏదేనా కొత్త కీర్తన చెబుతాడు.

వచ్చినప్పుడల్లా గోపాలంతో పిచ్చా పాటీ మాట్లాడి, యింట్లో అందరి యోగ క్షేమాలు విచారించి వెడతాడు. ఆయనకు ఆ యింట్లో ఆదరం మటుకు అచంచ లంగా వుంది.

అందరి జీవితాలలోను మార్పులు వస్తున్నాయి.

శకుంతల పేరిట మొదలయిన 'బ్యాంక్ ఎకౌంట్లు' క్రమక్రమంగా పెరిగి పెద్దవవు తున్నాయి. శాంతమ్మ పర్యవేక్షణ కింద ఆ లెక్కలన్నీ, భాను మూర్తే చూస్తాడు. ఆ యింట్లో యింకె వరికీ డబ్బు సంగతులు అక్కర్లేదు, శకుంతలతో సహా. ఆమెకు యేదో వివరం తెలియని భయం. భయానికి కారణం తెలియదు. కనుక యేమీ లేదను కుంటుంది. అలవాటు లేక బెంగ పడు తున్నానని సమాధానం చెప్పుకుంటుంది.

"మా శకుంతల వల్ల మాకు మళ్ళీ మంచి రోజులు' వచ్చాయి." అంటుంది శాంతమ్మ. ఆమె కళ్ళు ఆనందంతో మెరుస్తాయి. శకుంతలకూ యిది ఆనం దించ వలసిన తరుణమే. కానీ కొద్దిపాటి జీవితంలో - అనుక్షణమూ యెదరయ్యే హడావుడి, బాదర బందీ చూస్తూవుంటే వీటిని తట్టుకోవడం కష్టం అనిపిస్తుంది. అంతా భానుమూర్తి ముందుగా లెక్క వేసి వుంచుతాడు. తన పనల్లా అతను చెప్పినట్లు చేయడం. ఏదీ తీరుబడిగా ఆలోచించ వలసిన అవసరం లేకపోవ డంవల్ల కొంత 'రిలీఫ్' గానే అని పిస్తుంది తనకు.





# 13

శకుంతలకు ఒకరోజు బట్టల దుకాణంలో తటస్థ పడింది రాజేశ్వరి.

"ఓహో" అంటే "ఓహో" అనుకున్నారు.

"చీరలు తీసుకుంటారా ?" అంది రాజేశ్వరి.

"అవును. మీరు?"

"పిల్లలకు చొక్కాలు తీసుకుందామని వచ్చాను"

ముందు రాజేశ్వరి తనకు కావలసిన బట్టలన్నీ ఎంపిక చేసుకుని కొనేసింది. శకుంతల ఆమెను గమనిస్తూ వుండిపోయింది. తనపని అయిపోయిన తరువాత 'ఇక మీరు చీరలు బేరం చేయండి' అంది రాజేశ్వరి.

శకుంతలకు మనసులో బెరుకు బెరుకుగా వుంది. తను అసలు ఇలా దుకాణానికి రావడమే కాస్త ఎబ్బెట్టుగా వుంది. అందులోనూ కొద్దిపాటి పరిచయం వున్న రాజేశ్వరి రావడంతో మరి ఇంత బెలగ అయింది, తనను గురించి ఆమె ఏమనుకుంటుందో అని.

దుకాణం కుర్రాళ్ళు చీరలు చూపిస్తున్నారు. శకుంతల ధరల లేబుల్ వైపే చూసీ చూడనట్లుగా గమనిస్తోంది. ఏదీ యాభై రూపాయిలకు తక్కువ లేదు.

ఆమెకు ఉదయం జరిగిన సంభాషణ గుర్తుకు వచ్చింది.

"సాయంత్రం రెండు చీరలు తీసుకుందామనుకుంటున్నాను" అంది భానుమూర్తితో.

"పోయిన నెలలోనే తీసుకున్నట్లున్నావు!"

"అలాంటివి కాదు. రోజూవారి వాడకానికి ఇంట్లో వున్నప్పుడు కట్టుకుందుకు. అమ్మకు కూడా కావాలి" ఇటువంటి సంజాయిషీలు ఈ మధ్య భానుమూర్తికి చాలానే ఇవ్వవలసి వస్తోంది.

"సరే ఎంత కావాలి?"

ఎంత ఇస్తాడో చూద్దామని తనేం మాట్లాడలేదు.

అతను అయిదు పది కాగితాలు అందిస్తూ 'ఇంద జాగ్రత్త' అన్నాడు.

"చాలదు ఇంకో యాభై ఇవ్వు" అంది తను బిడియంగానే.

"నువ్వు రెండు చీరలు కొనుక్కో. అమ్మకు ఇప్పుడు వద్దులే"

"కాదు కావాలి"

- "అమ్మ కావాలని చెప్పిందా?"

"లేదనుకో. అయినా నేను చూస్తూనే వున్నానుగా"

"బట్టలకు ఎంత ఖర్చు పెట్టినా దండుగే చెల్లీ. అందుకని చెబుతున్నా"

—తను ఏమీ మాట్లాడలేదు.

"మనం డబ్బు చాల జాగ్రత్తగా ఖర్చు పెట్టుకోవాలి"

శకుంతలకు అనిపించింది. ఈ డబ్బు నిజంగా అన్నయ్యే సంపాదిస్తూ వుంటే తనకు ఒక పైసె అయినా విదిల్చేవాడేనా అని.

ఈ మాట పైకి అంటే లేనిపోని చికాకులు వస్తాయి.




"సరే నీ యిష్టం" అని మరో ముప్ఫై రూపాయిలు ఇచ్చాడు. శకుంతల అయిష్టంగానే తీసుకుంది.

భానుమూర్తితో గొడవ పడడం తనకు ఇష్టం లేదు. అమ్మకు తెలిస్తే అసలు ఇప్పుడు చీరలే అక్కర్లేదంటుంది కూడా! తన పక్షంగా ఇంట్లో ఎవరుగానీ భానుమూర్తిని కాదని మాట్లాడతారని ఆమెకి తోచదు.

—శకుంతలకు ఈ సంఘటన మనసులో మెదిలింది.

'ఇప్పుడేం చేయాలి నేరకపోయి ఈ సమయంలో ఇక్కడకు వచ్చాను' అనుకుంది.

చల్లకు వచ్చి ముంత దాచటం అవుతుందా?

అదయినా ఎంత సేపు?

"కాస్త తక్కువ ధరల్లో చూపించండి"

ఈ మారు ఇరవై పాతిక రూపాయిలవి కుప్పలు పడేశాడు కుర్రాడు.

అవి చూడడానికి అంతంత మాత్రంగా వున్నాయి. రాజేశ్వరి ముఖంలోనికి చూసేందుకు ధైర్యం చాలడం లేదు శకుంతలకు.

"ఇవి మరీ బాగున్నట్లు లేదు. కాస్త మీరు చూసి సుమారయిన చీర రికమెండ్ చేయండి" అంది శకుంతల.

రాజేశ్వరి పరిస్థితి అర్థం చేసుకుని, ఏవో రెండుమూడు రకాల పేర్లు చెప్పి అటువంటి చీరలు చూపించమంది.

అవి కాస్త చూడటానికి అర్హంగా వున్నాయి శకుంతలకు కూడా.

ఆమె సహాయంతో రెండు చీరలు 'సెలక్ట్' చేసుకుంది శకుంతల. ఎనభై రూపాయిలలో ఇవతలకు తేలింది.

"థాంక్స్ మీ ఎంపిక చాలా బాగుంది" అంది కృతజ్ఞతగా ఆమె వంక చూస్తూ.

"నా ఎంపిక మీరే మెచ్చుకోవాలి. నాకసలు చీరలు ఎంచడమే చేతకాదంటారు మావారు. నా చీరలన్నీ ఆయనే సెలక్ట్ చేస్తారు"

"అదృష్టవంతులు"

"ఎవరు? నేనా మావారా?"

—శకుంతల నవ్వింది.

ఇద్దరూ రోడ్డు మీదికి వచ్చారు.

"మా ఇల్లు ఇక్కడికి దగ్గరే రండి వెడదాం" అంది రాజేశ్వరి.

"ఇంకోమారు వస్తాను లెండి"

"ఆ మాట యిప్పటికి చాలామార్లు అన్నారు. ఈ రోజు మిమ్మల్ని వదిలేది లేదు. రండి" అంటూ రాజేశ్వరి దాదాపు శకుంతలను తన దారిలో లాక్కుపోయింది.

చిన్న డాబాయిల్లు, చుట్టూ కాంపౌండ్ వున్నది. పూలమొక్కలు.

లోపల గదులు చాలా శుభ్రంగా వున్నాయి.

వస్తువులన్నీ ఎక్కడి వక్కడ సర్దియేర్పాటుగా వున్నాయి

శకుంతలను ముందు గదిలోనే కూర్చోబెట్టి రాజేశ్వరి లోపలకు వెళ్ళింది. ఫ్లాస్కుతో తిరిగి వచ్చింది.

"మావారు యింకా ఆఫీసు నుంచి రాలేదు"

వారికి ఎక్కడ పనో రాజేశ్వరి ఇదివరకే చెప్పింది. కానీ శకుంతలకు యిప్పుడు గుర్తు లేదు.

"బాగుందండీ కాఫీ"

రాజేశ్వరి నవ్వింది. "మీరు అన్నీ

మెచ్చుకోవడమే చేస్తున్నారు. నాకు ఇల్లు సర్దుకోవడం రాదంటారు మా వా రు. చూడండి గదులన్నీ ఎలా అల్లరిచిల్లరిగా, గందరగోళంగా వున్నాయో!" అంటూ శకుంతలకు ఇంటిలోని నాలుగు గదులూ చూపించింది. శకుంతల కళ్ళకు అవి 'దివ్యచకోరం'గా వున్నాయి.

"ఎందుకండీ మీ వారిమీద లేనిపోని అభాండం వేస్తారు. ఇల్లంతా చక్కగా దివ్యభవనం లాగా వుంది."

"నేను ఎంత చక్కగా సర్దినా వారికి రుచించదండీ. ఎప్పటికప్పుడు యేవో మారులు, చేర్పులు చేస్తూ వుంటారు."

"పిల్లలు బడికి వెళ్ళారా?"

"అవునండీ. ఆయన ఆఫీసు నుండి వచ్చేటప్పుడు వాళ్ళను తీసుకు వస్తారు. స్కూలు దారిలోనే" అంది.

పత్రికలు తిరగ వేసింది కాస్సేపు శకుంతల.

"మా వారికి యీ పత్రిక అంటే ఇష్టం. నిద్ర కూడా మానేసి చదువుతూ కూర్చుంటారు."

"మీరు చదవరా!"

"నాకు బోర్"

"మీరు సంగీత సాధన చేసే దెప్పుడు?"

"పిల్లలు సంసారం మీద పడినాక ఇంకా సంగీత సాధన ఏముంది లెండి. ఏదో అలవాటు తప్పించుకోలేక పాడడం. అంతే!"

"రోజూ గంట, రెండు గంటలయినా సాధనం చేస్తారా?"

"నాకు చేయాలనే వుంటుంది. మా వాడు ఒకటే పోరుతారు, ఎప్పుడూ సంగీతం పాడుతూ వుండమని. కానీ కుదరదు."

కాస్సేపు రాజేశ్వరే మాట్లాడింది, ఈ కబుర్లూ ఆ కబుర్లూ.

"ఎంత అలసిపోయి వున్నా సరే... మావారు నిద్రపోవటానికి ముందు నా చేత రెండు కీర్తనలయినా పాడిస్తారు"

"అందుకే మిమ్మల్ని అదృష్టవంతు లన్నాను"

"మావారి ప్రోత్సాహం లేకపోతే, ఈ సంగీతం ఎప్పుడో మరచిపోయి వుండేదాన్ని."

వాళ్ళ వారి ని సంభాషణలోనికి తీసుకురాకుండా మాట్లాడడం రాజేశ్వరికి చేతకాదని శకుంతలకు తెలిపోయింది.

చక్కటి యిల్లు-స్ఫూర్తి ఇచ్చే భర్త, చేతినిండా పని కల్పించే పిల్లలు-సంసారం; సంగీతం; ఇంతకంటే యింకేం కావాలి 'అదృష్టవంతురాలు' అనిపించుకోవటానికి —అనుకుంది శకుంతల,

ఆమె మనసుకు ఈ వాతావరణం ఎంతో హాయి అనిపించింది.

రాజేశ్వరి, యింటిని, ఈ పరిసరాలను చూస్తూవుంటే యిప్పుడిప్పుడే కొత్త కొత్త ఉత్సాహం వస్తున్నట్లుంది.

"మీరేం మాట్లాడడం లేదు." అంది రాజేశ్వరి; శకుంతల మౌనంగా వుండి పోవడం గమనించి.

"ఏం మాట్లాడ మంటారు ?"

"ఎక్కడయినా కచేరీ వుందా ఈ నెలలో?"

"నాకు వివరంగా తెలీదండీ. మా అన్నయ్య భానుమూర్తి చూసుకుంటారు అవన్నీ. నా పనల్లా బయలుదేరు-అన్నప్పుడల్లా నడవడమే!"

రాజేశ్వరి నవ్వింది.





"ఇంక వెళ్ళి వస్తానండీ" అంటూ లేచింది శకుంతల.

"మరో పదినిమిషాలు వుండండి. పిల్లలు వస్తారు."

"ఇంకోమారు వస్తాలెండి. ఇప్పటికే ఆలస్యం అయిపోయింది అమ్మగారు ఎదురు చూస్తూ వుంటారు."

రాజేశ్వరి యింకేం ఆటంకం చెప్పలేదు.



# 14

శకుంతలకు ఒంట్లో సరిగాలేదు.

ఆ రాత్రి పొరుగూరు ప్రయాణం వున్నది. మరునాడు అక్కడ కచేరీ. రాత్రంతా రైల్లో ప్రయాణం చేస్తేగాని కుదరదు.

ప్రయాణంవల్ల ఆరోగ్యం మరికాస్త దెబ్బ తింటుందేమోననిపించింది.

భానుమూర్తితో నెమ్మదిగా ప్రస్తావించింది.

"జ్వరం యేం లేదుగదా! ఊరికే నలత-అంతే. ఈ పగలంతా విశ్రాంతి తీసుకుంటే సరిపోతుంది".

"రాత్రి ప్రయాణం చేయగలనో లేదో"

భానుమూర్తి నవ్వాడు.

"మరీ విడ్డూరం. రాత్రి రైల్లో బెర్త్ రిజర్వు చేయించానుగదా! ఇంట్లో పడుకునేది రైల్లో పడుకుంటాం. అంతే కదూ ? తెల్లవారేటప్పటికి అక్కడ దిగిపోతాం. మళ్ళీ సాయంత్రంవరకు విశ్రాంతి. మరేం బెంగపెట్టుకోకు. నేను వున్నానుగా" అన్నాడు.

"పోనీ. యీమారుకు మానుకుంటే!"

"మానుకోవచ్చును. కానీ ఒప్పేసుకున్నాంగదా. రెండు నెలల క్రితమే. వాళ్ళు యేమనుకుంటారు?"

"టెలిగ్రాం యిస్తే యేమయినా యేర్పాటు చేసుకుంటారు".

"చేసుకుంటారు. కానీ నష్టం మనకే కదమ్మా! కాస్త వేడివేడి కాఫీ తాగు. బద్ధకం అంతా వదిలిపోతుంది" అన్నాడు భానుమూర్తి ధైర్యం చెబుతూ.

శకుంతల యేడవలేక నవ్వుతూ ప్రయాణం చేసింది.

భానుమూర్తికి యేం చెప్పినా యేమీ ప్రయోజనం లేదు. అతని యిష్టమే యిష్టం. శకుంతలకు నీరసమనిపించింది.

తాను సంగీత కచేరీ చేయకుండా వుండటానికి వీలులేదు. డబ్బు సంపాదన తగ్గే ప్రతిపాదన యేదీ భానుమూర్తి అంగీకరించడని ఆమెకు మరోమారు నిర్ధారణ అయిపోయింది.

అతనితో చెప్పడంకంటే నోరు మూసుకు వుండిపోవడమే ఉత్తమం- అనిపించింది శకుంతలకు.

* * *

చుట్టూ వున్న ప్రపంచం మారిపోతోంది. కానీ తన చిన్నారి ప్రపంచం మాత్రం యేమీ మారుతున్నట్లు లేదు.

శకుంతలకు అన్నిరోజులూ యాంత్రికంగా జరిగిపోతున్నాయి.

ఆమె సంగీతాన్ని అభిమానించేవాళ్ళ జాబితా రోజురోజుకూ పెరిగిపోతోంది. ఈ అభిమానాన్నీ, ఆదరాన్నీ పోగు

చేసుకుని యేం చేయాలో ఆమెకు పాలు పోవడం లేదు.

పది మందితో కలిసి తిరగడం, పరిచయాలు యెక్కువ కావడంతో శకుంతల జీవితాన్ని గురించి విస్తృతమయిన అభిప్రాయాలు సేకరించుకుందుకు దోహదం అవుతోంది. ఈ అభిప్రాయాలు క్షణక్షణానికీ మారిపోతున్నాయి. వీటికో స్థిరరూపం యేర్పరచుకోవడానికి ఆమెకు ఇంకా బలం చాలడం లేదు.

"నాకు వున్న స్వేచ్ఛ యింతలో వున్నది' అని నిట్టూరుస్తూ వుంటుంది, తన అస్వతంత్రత కొట్టవచ్చినట్లుగా కనిపించినప్పుడల్లా.

అనుకోవడమే కాదు, సందర్భం వచ్చినప్పుడు సుందరంతో ఇవే మాటలు అన్నది కూడా.

అయితే అతను యీ సంఘటనను అర్థం చేసుకున్న పద్ధతే వేరు. "భానుమూర్తి చెప్పింది బాగానే వుంది. అక్కడ ఎంతో మంది మీ సంగీతంకోసం ఎదురు చూస్తూ కూర్చుంటారు. వాళ్ళందరినీ నిరాశపరచడంకంటే కాస్త శరీర శ్రమ అయినా మీరే సర్దుకుపోవడం మంచిది కదూ ? నేనూ అలాగే అంటాను" అన్నాడు.

శకుంతలకు 'వీళ్ళంతా యేం మనుషులు!' అనిపించింది.

ఎవరుగానీ తమ దృష్టి కోణంనుంచే ఆలోచిస్తారుగానీ పక్కమనిషి మనసులో యేం ఆలోచనలున్నాయో కని పెడదాం-పోనీ ఆ ప్రకారం నడుచుకుందాం అనుకోరేం కర్మ" అని చిరాకుపడింది.





అందరితోనూ తానే సర్దుకుపోవాలి. కానీ తన మనసు ఎరిగి తనకు కావలసిన తృప్తి, ఉత్సాహం ఎక్కడ వున్నాయో వెదికి యిచ్చేవాళ్ళు కరువవుతున్నారు. ఏమిటి దారి...అనుకుంది శకుంతల.

* * *

రోజులు యిలా గడిచిపోవడం యిష్టం లేనట్లుగా యింకో సన్నివేశం తటస్థించింది.

రేడియో ఆఫీసరు దేశికన్, గురువుగారు కలిసి యింటికి వచ్చారు, ఒకనాడు.

గురువుగారు రావడంలో యేం కొత్తదనం లేకపోయినా, దేశికన్. ఆయన కలిసి రావడంలో ఏదో కాస్త విశేషమే వుంటుంది.

మామూలు పలుకరింపులు అయిన తర్వాత రామనాథం గోపాలంతో ఆ విషయం ఏమిటో బట్టబయలు చేశాడు.

"చూడండి బాబుగారూ, మన దేశికన్-ఒక ప్రతిపాదన తీసుకువచ్చారు."

"చెప్పండి"

"మన శకుంతలకు మంచి వివాహ సంబంధం తీసుకువచ్చారు. శాంతమ్మ గారూ, మీరూ 'ఊ' అంటే శుభ ముహూర్తం ఏర్పాటుచేస్తామంటున్నారు- చెప్పవయ్యా దేశికన్, నీ నోటి మీదుగానే ఆ శుభవార్త—"

గోపాలంగారు నిర్లిప్తంగా "అమ్మను రమ్మనమ్మా" అన్నారు శకుంతలతో. అంతవరకూ అక్కడే కూర్చుని ఉక్కిరిబిక్కిరి అవటానికి ప్రారంభం అవుతూ వున్న శకుంతలకు లేచిపోయేందుకు అవకాశం దొరికింది.

శాంతమ్మ వచ్చి గుమ్మం పక్కనే నిలబడింది.

"చెప్పండి దేశికన్. ఎవరా అబ్బాయి..." అడిగాడు గోపాలం.

దేశికన్ ఉపోద్ఘాతంగా "నాకు బాగా తెలిసిన కుటుంబమండీ. మేమూ వాళ్ళూ మాతాతలకాలంనుంచి పరస్పరం యెరుగుదుము. అబ్బాయి డాక్టర్! ఒక సంవత్సరం అయింది ప్రాక్టీస్ పెట్టి" అంటూ ఆ కుటుంబం వివరాలన్నీ వినిపించాడు. దేశికన్‌దీ వాళ్ళదీ ఒకే ఊరుట.

"మరో ముఖ్య విషయం. వాళ్ళు మీ శాఖవాళ్ళే. అంచేత ఆలోచించ వలసిన పనికూడా లేదు."

"అలాగా సంతోషం."

"అబ్బాయి మన శకుంతలను చాల మార్లు సంగీత కచేరీలలో చూశాడట.

అసలు విషయం ఏమిటంటే అతను మంచి సంగీత ప్రియుడు. శకుంతల సంగీతం అనేకమార్లు విని, అమ్మాయి మీద యిష్టం పెంచుకున్నాడు,వలచాడు"

"అమ్మాయికి సంగీతమే అన్నీ కదా !"

"అబ్బాయి తండ్రిగారు నాకు పోయిన వారం ఉత్తరం రాశారు; మీతో పరిచయం చేసుకుని ఈసంబంధం విషయం కదపమని. మీకూ నాకూ పరిచయం వున్నట్లు వాళ్ళకు తెలియదు. మన రామనాథంగారితో కూడా మాట్లాడాను. వారు శుభం అంటూ నన్ను యిక్కడకు తీసుకువచ్చారు."

గోపాలం గుమ్మం పక్కననుంచున్న శాంతమ్మ వయిపు చూశాడు.

శాంతమ్మ నింపాదిగా "అమ్మాయి వివాహ విషయం యింకా మేం యేమీ అనుకోవడం లేదండీ" అన్నది.

"అమ్మా! యిప్పుడు అనుకోవడం మొదలు పెట్టండి. మంచి సంబంధం, మనకు కావలసిన వాళ్లు. అంతకన్నా యింకేంకావాలి?" అన్నాడు రామనాథం

"మీరు ఆలోచించి నాకు వీలయినంత త్వరలో కబురుచేస్తే వాళ్ళకు ఉత్తరం రాస్తాను—" అన్నాడు దేశికన్.

"అలాగేనండి. మీరు చాలశ్రమ తీసుకుంటున్నారు."

"ఇందులో శ్రమేంలేదండీ. కళ్యాణ ఘడియ తోసుకువస్తే ఎంత ఎరగని వాళ్ళయినా ఆత్మబంధువు లయిపోతారు. నాకు ఆ అబ్బాయి తెలుసుగదా! నేను యింతవరకూ యీ విషయమే గమనం యివ్వలేదు మరి. వాళ్ళంతట వాళ్ళు యిలా ఉత్తరం రాయడం మన అదృష్టం."

—వాళ్లు వెళ్ళిపోయిన తర్వాత యింటిల్లిపాదీ దీన్ని గురించి మాట్లాడుకున్నారు. అందరూ చాలసేపటి తరువాత తేల్చిన విషయం యేమిటంటే, అబ్బాయిని చూస్తేగాని వివాహ సంబంధానికి అంగీకరించడానికి కుదరదని. కుర్రవాడు అమ్మాయిని చూసి వుండవచ్చుగాక. తామందరూ అతడిని చూడనిదే నిర్ణయించడం ఎలాగ?

అందుచేత పెళ్ళిచూపులు యేర్పాటయినాయి.

ఆరోజు యిల్లంతా హడావుడిగా తయారయింది.

పెళ్ళికొడుకుతో పాటు అతని తల్లీ తండ్రీ వచ్చారు. దేశికన్ - రామనాథం సరేసరి!

వాళ్ళు అమ్మాయినిగానీ, ఎవరినిగానీ యేమీ ప్రశ్నలు వేయలేదు.

పిల్లవాడి తల్లి "మా వాడికి సంగీతం అంటే యిష్టం. ఇంత వరకు చూసిన రెండు మూడు సంబంధాలు పిల్లచేత సంగీతం పాడించాం. ఇప్పుడు మీ శకుంతలను పాట పాడమనే అవసరమే లేదు. ఆ సంగీతాన్నివినే మావాడు మోజు పడుతున్నాడు" అన్నది.

శకుంతల తనలో తను నవ్వుకున్నది.

వాళ్లు వెళ్ళిపోతూ గోపాలం, శాంతమ్మలను ఉద్దేశించి "మీ సంబంధం మాకు చాల యిష్టం. మావాడి యిష్టానికి వ్యతిరేకంగా మేం ఇంతవరకు యేమీ చేయలేదు" అన్నారు.

అంతకు ముందు మాటలలోనే కట్న కానుకల ప్రసక్తి వచ్చింది.





"మీరు మాకేం ఇస్తారు అని మేం ఎదురు చూడం. మా ఆస్తిపాస్తులే మాకు చాలు" అన్నారు.

వాళ్ళను పంపించి వచ్చి రామనాథం తిరిగి గోపాలం దగ్గరకు వచ్చి కూర్చున్నాడు.

"అబ్బాయి చక్కగా వున్నాడు. నాకు అంతా సజావుగా కనిపిస్తోంది ఈ సంబంధం. సంగీతం అంటే అభిమానం వున్న కుటుంబంలో పడడం శకుంతల అదృష్టం ఏమంటారు బాబుగారూ!" అన్నారు.

"అవునవును" అన్నాడు గోపాలం ముక్తసరిగా.

రామనాథం సెలవు తీసుకుని వెళ్ళిపోయారు.

"అమ్మాయికి పెళ్ళి ఎలా చేస్తామా అని పూర్వం మనసులోనే వ్యథపడే వాళ్ళం ఇద్దరమూ ఇప్పుడు కాలం కలిసి వచ్చింది. పెళ్ళికొడుకే అమ్మాయిని వెదుక్కుంటూ వచ్చాడు. ఇంతకంటే కావలసింది ఏముంది?" అన్నాడుఆయన ఆ రాత్రి శాంతమ్మతో.

"మన అమ్మాయికి అప్పుడే పెళ్ళి ఏమిటండీ!" అంది ఆమె నివ్వెరపోతున్నట్లుగా.

"దానికిప్పుడు ఇరవైమూడు కదూ"

"అయితే మాత్రం ఇవేం మనరోజులా ఏమిటి? ముప్ఫయి దాటితేగాని ఇప్పుడు ఎవరూ ఆడపిల్లలకు పెళ్ళి మాట తల పెట్టడం లేదు"

అంతకుముందే భానుమూర్తి ఈమాట ఆమెకు నూరి పోశాడు.

జీవితంలో మరో పరమార్థం లేనట్లు ఎంతసేపూ 'పెళ్ళి పెళ్ళి' అంటూ వెంపర్లాడుతారు. ఈ జనం ఎందుకనో అని భానుమూర్తి మతం.

అంతేకాదు. భానుమూర్తికి యీ వరుడిలో కొన్ని లోపాలు కూడా కనిపించాయి. అతను చెప్పిన తరువాత శాంతమ్మకు అవి కూడా నిజమేనని పించాయి.

"అతను మరీ పొట్టిగా వున్నాడు"

"ముందు పళ్ళు కాస్త ఎత్తు"

"ఒక్క అభిమానంతోనే సంగీతం అంటే ఇష్టమని ఇతర సంగతులు చూడకుండా కట్టబెట్టలేం గదా"

—గోపాలం "ఇంతకూ అమ్మాయిని కనుక్కున్నావా, ఏమంది?" అన్నాడు.

"పిచ్చిపిల్ల దానికేం తెలుసు. పెళ్ళంటే భయపడుతోంది" అంది శాంతమ్మ.

పక్క వరండాలోనుంచి ఈ మాటలు లీలగా వింటూన్న శకుంతల గుండెలు 'అబద్ధం అబద్ధం' అని కొట్టుకున్నాయి. కానీ ఈ చప్పుడు ఆమెకి తిన్నగా వినిపించలేదు. వినిపించుకున్నా ఎవరూ పట్టించుకోరు కదా!

పెళ్ళిని గురించి, వరుడిని గురించి అంతకు ముందు ఇంట్లో ప్రస్తావన వచ్చినప్పుడు కూడా శకుంతల సిగ్గుతో అక్కడనుంచి తప్పించుకుపోయిందేగాని బాహాటంగా చర్చలలో పాల్గొనలేదు. ఒక చెవి మాత్రం అటు వేసి వుంచేది.

కొంతసేపు ఇదే వరసలో మాట్లాడుకున్న తర్వాత శాంతమ్మ భర్తతో "మరీ అతను నల్లగా వున్నాడండీ ఈ మారు ఏదయినా మంచి సంబంధం వస్తే చూద్దాం లెండి" అన్నది.

ఆయన ఇప్పుడిప్పుడే మంచం లోంచి లేచి కూర్చుంటున్నాడు.

"సరే మీ ఇష్టం" అని ఊరుకున్నాడు.



## 15

"ఏమండీ–మీరు ఇంత దాపరికం మనుష్యులు అనుకోలేదు" అంది శకుంతల సుందరం ఉలిక్కిపడ్డాడు.

"ఏమిటది? నేనేం దాచాను–"

"మిమ్మల్ని గురించి నాకో కొత్త విషయం తెలిసింది లెండి"

"నాకూ చెప్పండి వింటాను" అన్నాడుసుందరం. ఈ కొత్త విషయం యేమయివుంటుందా అని మనస్సులోనే ఊహించుకుంటూ.

"నేను చెప్పను. మీరు యిన్నాళ్ళూ దాచారా లేదా! అలాగే నేనూ నాకు యీ సంగతి తెలుసు నన్న విషయం దాచి వుంచుతాను. తప్పా?" అంది కొంటెగా.

"తప్పో ఒప్పో మీరే నిర్ణయించుకోవాలి!"

"అసలు యిన్నాళ్ళు యెవరికీ తెలియకుండా యెందుకు దాచుకున్నారు చెప్పండి."

"ఏం దాచానో తెలియకుండా యెందుకు దాచానో ఎలా చెబుతాను?"

"అదే–మీరు కథలు రాస్తారన్న సంగతి!" అని ఛటుక్కున అనేసి తీరా మాట పూర్తి అయిన తరవాత నాలుక కొరుక్కుంది శకుంతల చెప్పకూడదనుకుంటూనే తాను తెలుసుకున్న సంగతి బయట పెట్టేసింది.

"అదా?" సుందరం తేలికగా నవ్వేస్తూ "అదేమంత గొప్ప విషయమని ప్రచారం చేసుకోమంటారు?" అన్నాడు.

"ఎవరి గొప్ప వాళ్ళకు తెలియదు లెండి"

"అయినా యిప్పుడా సంగతి మీ కెవరు చెప్పారు సుమా!"

"ఎవరో చెప్పారు లెండి. నిజమా–కాదా?"

"నిజమే. అందులో అబద్ధం యేం లేదు."

"మరి యిన్నాళ్ళూ నా కెందుకు చెప్పారు కాదు–"

"సందర్భం రాలేదు. అంతకంటే మరేం కారణం లేదు."

"రచయితనని చెప్పుకోవటానికి సందర్భం రావాలా?"

"నన్ను గురించి నేను చెప్పుకోవడం నాకు ఇష్టం వుండదు. అదీగాక నేనంత పాపులర్ రైటర్‌ను కాదు."

"పాపులర్ కాకపోయినా, చాల 'ఎఫీషియంట్' అని చెప్పారు లెండి మిమ్మల్ని గురించి ఉప్పు అందించిన వాళ్లు–" అంది శకుంతల యింకా తమాషాగా నవ్వుతూ.

"ఎవరో పక్షపాతులయి వుంటారు."

"చాలా రాశారా?"

"లేదు. పాతిక, ముప్ఫయి–అంతే."

"నాకు యివ్వండి చదివి యిస్తాను–"

"మీకు బాగుండవండీ అవి."

"నాకు అర్థంకావు అనండి – ఒప్పుకుంటాను. అంతేగాని బాగుండవని మీరే తీర్పు చెప్పేస్తే ఎలా?"

సుందరం కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా వుండి పోయాడు.

తరువాత యిలా అన్నాడు.

"ప్రసక్తి వచ్చింది గనుక చెబుతున్నాను. నేను రాసే కథలు అంత చదవటానికి వీలుగా వుండవు. ఎందుకంటే నేను ఎంతసేపూ మానవ మనస్తత్వాన్ని గురించి, మనసుల్లో జరిగే అంతర్మథనాన్ని గురించి రాస్తానుట! సమాజంలో ఎదురుగా కనిపించే అన్యాయాలు, అక్రమాలు చిత్రించను గనుక నాకు 'సామాజిక స్పృహ' లేదు అంటారు చాలామంది. ఎలాగయినాసరే, పాఠకుల చేత చదివించాలని పట్టుదల నాకు లేదు. అందుకు నాకు తోచినట్లుగానే నాపద్ధతిలో నేను వ్రాసుకుంటూ పోతాను... ఈ రకమయిన రచనలూ నచ్చేవాళ్ళు కొందరు వుంటారు బహుశా. లేకపోతే మీతో యీ సంగతి ఎవరూ చెప్పివుండే వాళ్ళే కాదు గదా! ... అందుచేత నేను చాలా మైనారిటీ రచయితను అని తెలుసుకోండి, నా కథలు చదివే ముందు..."

"నేను యీ విషయం వినడంతోటే భానుమూర్తిని అడిగాను. అన్నయ్యకూ మీరు కథలు రాస్తారనే తెలియదు. ఆశ్చర్య పోయాడు ముందు" అంది.

సుందరం నవ్వి వూరుకున్నాడు.

"ఇంతకూ తెచ్చియిస్తారా లేదా?. మీరు రాసిన కథల పుస్తకం ? లేదా మేమే బజార్లో కొనుక్కోమంటారా?"

"అలాగే యిస్తాన్లెండి. అది చదివిన తర్వాత నన్ను తిట్టకుండా వుంటానని ప్రామిస్ మాత్రం చేయండి." అనేసి సుందరం ఒక్క నిమిషం అయిన తర్వాత "మీది చాల ధన్యమయిన జీవితం" అన్నాడు.

శకుంతల అర్థం కానట్లుగా అతని వంక చూసింది.

సుందరం మళ్ళీ "మీరు అదృష్టవంతులు" అన్నాడు.

శకుంతల యీమారు నవ్వుతూ వుండిపోయింది. తల కొద్దిగా కిందికి వంచింది.

ఆమె మనసులో ఆలోచనలు అప్పుడే కదలబారాయి.

తాను అదృష్టవంతురాలా ?

ఎందులో? ఎవరికన్నా ?

నిజంగానా ?

—ఈ రకమయిన ప్రశ్నలు ఆమెలో బయలు దేరాయి.

"నేనేం ముఖస్తుతి కోసం అనడం లేదు." అన్నాడు సుందరం, ఎక్కడ తన 'సిన్సియారిటీ'ని ఆమె అపార్థం చేసుకుంటుందోనని భయపడుతూ.

శకుంతలకు ఏమయినా బదులు చెప్పడం అవసరం అనిపించింది. ఏమీ మాట్లాడకుండా వుంటే అతడు నొచ్చుకుంటాడేమో పాపం!

కాస్త ధైర్యం తెచ్చుకుని మాటలు కూడగట్టుకుని యిలా అంది.

"అవునండీ. అందరూ అలాగే అంటారు. కానీ నాకు మాత్రం యీ అదృష్టం యేమిటో అర్థం కాదు. కనిపించదు-"

"అదృష్టం అంటే అర్థం కనిపించనిది అనే !"

—శకుంతల మరి కాస్త నవ్వింది.

"మీకు ఇప్పుడిప్పుడే అర్థం కాదులెండి"

—ఈ మాట కాస్తా అనేసిన తరువాత అతనికి అనిపించింది. శకుంతల తనను బొత్తిగా చిన్నపిల్లను చేసి ఆడిస్తున్నాడని అనుకుంటుందేమోనని.

"సరస్వతీ దేవి మిమ్మల్ని అను

గ్రహించింది. మీకు ఏ చీకూ, చింతా లేవు. అందుకనే మిమ్మల్ని ధన్యురాలు అంటున్నాను" అన్నాడు. కాస్త వివరించి చెబుతున్నట్లుగాను, తన అభిప్రాయం ఆమెకు అర్థం కావాలనే ధోరణిలోను.

"ఏమో నాకేం తెలియదండీ.ఎప్పుడూ ఒకటే ధ్యాసతో వుండి జీవితం విసుగని పిస్తోంది"

"అదేం?"

"సంగీత సాధన. ఇతరం ఏదీనన్ను కదిలించదు. అలా వున్నన్నాళ్ళూ ఎంతో బాగుండేది. కానీ..." ఈ మధ్య వాక్యం పూర్తి చేయకుండానే ఆగిపోయింది శకుంతల.

"ఈ మధ్య...ఏమయింది. ఇటీవల"

ఆమె జవాబు చెప్పలేదు.

"మీ సాధనకు ఏమయినా అంతరాయం కలిగిందా?"

"ప్రత్యేకించి అంతరాయం అంటూ ఏమీ లేదనుకోండి"

"అయితే?"

"మరికొన్ని ధ్యాసలు యేర్పడి... సంగీతం మీద దృష్టి తగ్గిపోతుందేమో నని భయంగా వుంది"

"మీకు ఇతర చీకు, చింత లేవు గదా! అంతా భానుమూర్తి చూసు కుంటాడు. మరింకేం బెంగ!"

—అతనికి వివరంగా ఎలా చెప్పాలో అర్థంకాలేదు ఆమెకు.

ఆ మాటకు వస్తే తనకే తెలియదు విశదంగా, తన బాధ ఏమిటో! ఇదీ ఆమె పరిస్థితి.

అనవసరంగా సుందరం ముందు బయట పడిపోతున్నానా అని ఒక్క క్షణం పాటు నిలదొక్కుకుని ఆలోచించు కుంది.

ఊహూ కాదు.

తనకు సంగీతం మీద ధ్యాస తగ్గడం లేదు. సాధన చేస్తూనే వున్నది. అయితే కొన్ని కొత్త ఆలోచనలు కొత్త ఆవేశాలు మనసులో చోటు చేసుకుంటున్నాయి.

వీటిని గురించి ఎక్కువ సమయం వృధా చేయడం కూడా జరుగుతోంది, ఈ మధ్య.

"మీరు ఏదో సందేహిస్తున్నారు. మీకే మయినా అవసరం అయితే సహాయం చేయడానికి నేను ఎప్పుడూ సిద్ధమే..." అన్నాడు సుందరం.

ఈ మాటలు అనడం అయితే అనే శాడుగాని, వీటికి అర్థం ఏమిటో అతనికి తెలియదు. ఎందుకంటే శకుంతలకు యే యిబ్బందిగాని, అనానుకూలతగాని అతని ఊహకు అందవు.

"అబ్బె అదేం లేదండీ" అనేసింది శకుంతల.

—కానీ ఏదో వుంది. శకుంతల ఏదో దాస్తోంది అని ఖచ్చితంగా అని పిస్తోంది సుందరానికి.

"మీకు సంగీతం మీద దృష్టి తగ్గి పోతోందంటే నాకు భయం వేసి అలా అన్నాను. ఏం అనుకోకండి"

శకుంతల నవ్వింది.

ఆమె మామూలు మూడ్‌కు వచ్చిం దనుకున్నాడు సుందరం.

"ఎందుకు నవ్వుతున్నారు" అన్నాడు.

"నా అదృష్టాన్ని అందరూ అంత తేలికగా సులభంగా కనిపెట్ట గలుగు తున్నారు. కాని...నాకు మాత్రం..."

పరిస్థితి మళ్ళీ మొదటికి వచ్చినట్లు అనిపించింది సుందరానికి.




ఆమె అభిప్రాయం యేమిటో ఎటూ తేల్చుకోలేకుండా వున్నాడు. అసలు తెలుసుకోలేకుండా వున్నాడు.

'ఎక్కువ మాట్లాడితే ఆమె ఏం అనుకుంటుందో! ఈ పిరికితనంతో కొంత ఏమీ చెప్పలేక పోతున్నాడు అతను. మాట్లాడకుండా కూర్చుంటే ఆమె మనసులో అభిప్రాయం ఏమిటో అసలు తెలియకుండా పోతుంది గదా! అతలాకుతలం అయిపోతున్నాడు అతను మనసులో.

"నేను చెప్పిన దాంట్లో ఏమయినా అబద్ధం వుందంటారా?" అనడిగాడు తాను ఇంకేదో విషయాన్ని గురించి మాట్లాడినట్లు, ఆమెను 'డైవర్ట్' చేస్తున్నట్లు ముఖం పెట్టి.

"నాకు తెలియదు"

"అలా అంటే కాదు, చెప్పండి"

"నాకు ఏ చీకు, చింత లేని మాట నిజమే ననుకోండి. కాని ఎల్లకాలం ఇలాగే వుంటుందా? బరువులూ బాధ్యతలూ పెరగవు?"

—ఈ మాటలు సుందరానికి కొత్తగా అనిపించాయి.

రెండు నిమిషాలపాటు ఆలోచించి "అవును నిజమే సుమండీ" అన్నాడు.

అప్పుడే అతనికి ఏదో కొత్త సంగతి అర్థం అవుతున్నట్లు అనిపించింది. ఇప్పుడిప్పుడే తెలివిడి అవుతున్నట్లుంది.

ఎవరంతలో వాళ్ళు రోజులు గడుపుకుపోతూ వుంటే ఏ బాదర బందీ, చికాకు, చింత వుండవు.

"అలాంటివాళ్ళు ప్రపంచంలో చాల మంది వుంటారు. వాళ్ళలో నేను ఒకదానిని. ప్రత్యేకించి ఇందులో అదృష్టం ఏముంది?" అంది శకుంతల మళ్ళీ.

చుట్టూ వున్న మనుషులు వాళ్ళతో పోలికలు,కనీసపు అవసరాలు, [illegible] కొరతలు...కోరికలు... [illegible] వాటితో ముడి పెట్టుకుపోయి ప్రతి మనిషి కొన్ని చికాకులు, గందరగోళాలు పడతాడు.

సుందరానికి అనిపించింది అప్పుడు- ప్రతి మనిషి ఎవడికి వాడుగా నిరామయంగా వుంటే ఈ చికాకులు, చింతలూ వుండవేమోనని ప్రక్కవాళ్ళతో పోల్చి చూసుకున్నపుడుగాని ఎవరికిగానీ తమ జీవితంలో లోటుపాట్లు తెలిసిరావు. ఈ లోటు పాట్లు కేవలం ఊహా జనితమయినవే కావచ్చును. కానీ ఒకసారి మనసులో మొలక ఎత్తిన తరువాత రోజు రోజుకూ పెరిగిపోయి భయంకరంగా రాక్షసరూపం ధరించినట్లుగా తయారవుతాయి. మనసును ఏదో అసంతృప్తి, వేదన, గందరగోళం పట్టి పల్లారుస్తాయి.

"ఇప్పుడు ఆలోచించడం మీ వంతు అయింది" అంది శకుంతల, సుందరం యెంతసేపటికీ ఏమీ మాట్లాడక ఏమీ మాట్లాడకపోవడంతో

"ఆఁ యేమన్నారు!" అన్నాడు ఉలిక్కిపడి.

"నన్ను అదృష్టవంతురాలు అన్నారు, నా జీవితం ధన్యమయింది అన్నారు" అంది శకుంతల కొంటెగా నవ్వుతూ.

సుందరాన్ని కాస్త తికమక పెట్టగలిగినందుకు ఆమెకు మనస్సులో ఆనందంగా వుండివుండాలి

"అవునండీ! యిప్పుడూ అలాగే అంటాను...

"మామూలు జీవితపు యాతన మయమయిన ఆలోచనలు లేకుండా, సంగీత

సరస్వతికి అంకితం అయిపోవడం. ఆమె సేవలోనే రోజులు గడిపివేయడం... ఆ కళామ తల్లి..."

"ఆపండి. ఆపండి మీ కవిత్వం నన్ను ఉక్కిరి బిక్కిరి చేయకండి. మీరు అంటున్నట్లుగా నేనేం అంకితం అయి పోయిన పనులేం చేయడంలేదు."

"మరేం చేస్తున్నారు?"

"సంగీతాన్ని 'ట్రేడ్' చేయడం లేదా నేను? కచేరీలు చేస్తున్నాను.డబ్బు తీసుకుంటున్నాను..."

"తప్పేముంది దాంట్లో?"

"తప్పు ఒప్పుల ప్రసక్తి కాదు. సంగీత సరస్వతి... అంకితం... జీవితం... కళామతల్లి...కళామయం... యిలాంటి మాటలన్నీ అనవసరం అను కుంటాను, యీ సందర్భంలో"

"అంటే!"

"అందరిలాగా నాకూ ఒక విద్య వచ్చును. దాన్ని నేను అమ్ముకుని బతుకు తున్నాను."

"మిమ్మల్ని మీరు చౌక చేసు కుంటున్నారు అనవసరంగా"

"కళను గౌరవించండి. కాదనడం లేదు. అయితే నన్ను పెద్ద చేయకండి. నేను కేవలం మనిషిని..." అంది శకుంతల నిదానంగా.

"నేను ఒప్పుకోను, మామూలు మను ష్యుల కంటె ఉన్నతమైన జీవితం మీది."

"ఎక్కడుంది ఆ ఔన్నత్యం?... అంటున్నాను."

"మీ సంగీతంలో..."

"అదే నేను అనేది. కానీ నాలో లేదు ఆ ఔన్నత్యం. మనిషిగా నేను మామూలు దాన్ని. అందరు ఆడపిల్లల వంటి దాన్నే. నాకూ నలుగురినీ చూసి జీవితం అంటే యేమిటో ఆలోచించు కోవడం, అన్నింటినీ అనుభవించాలని తపన పడడం- వుంటాయనుకుంటాను.."

"క్షమించండి. లేవని నేనూ అన లేదు."

"అనడంలేదు. కాని యేమంటున్నా రంటే...

నేను సరస్వతీదేవి శిష్యురాలిని... ధనవంతురాలిని... లక్ష్మీ సరస్వతి నన్ను కటాక్షించారు. నాకు జీవితంలో యింకేమీ కావలసినవి లేవు... అంటు న్నారు. ఈ మాటలే పూర్తి నిజం కావంటున్నాను నేను"

"మీ విశిష్టతనూ గుర్తిస్తున్నాం."

"అదేనండీ నేను అనేది. నా విశిష్ట తను గుర్తిస్తున్నారు నిజమే. కానీ.నాలో వున్న సామాన్యతను గురించి ఏమం టారు? నా మామూలు తనానికి గొప్ప తనానికి సమవసత కుదరాలంటారా అక్కర్లేదా?"

సుందరం మళ్ళీ ఆలోచనలో పడి పోయాడు.



# 16

ఆఫీసుకు బయలుదేరబోతుండగా భాను మూర్తి వచ్చాడు. ఈమధ్య అతను కనిపించడమే తక్కువయిపోయింది. ఇదివరకటిలాగ సుందరంతో కబుర్లు చెబుతూ కాలక్షేపం చేయటానికి అతనికి




యిప్పుడు తీరుబాటు లేదు. రోజంతా రికామీగా గడిపివేయడం యిప్పుడతనికి అనూహ్యం. సుందరం యింటికి వచ్చినప్పుడు అయినా, అతన్ని పట్టించుకో పలసిన అవసరం భానుమూర్తికి అనిపించడం లేదు. ఏమంటే సుందరం యిప్పుడు భానుమూర్తి స్నేహితుడుగా కాకుండా శకుంతల ఆరాధకుడికింద లెక్క.

"రా.రా.దారితప్పి వచ్చినట్లున్నావు" అంటూ ఆహ్వానించాడు సుందరం.

"దారి తప్పానో, తప్పుదారిని వచ్చానో నాకయితే తెలియదుగాని, నువ్వు యెక్కడికో బయలుదేరబోతున్నావు. ఎదురు వచ్చాను. ఒంటరిగాడిని,

బ్రాహ్మడిని, ఆదీగాక బ్రహ్మచారిని. అందుచేత రెండు నిమిషాలు కూర్చో. లేకపోతే యీరోజంతా నన్ను తిట్టుకో వలసి వస్తుంది".

"నాకు అటువంటి చాదస్త్రాలు లేవులే భానుమూర్తీ" !.

"చాదస్తమో - ,యింకేమయినా దృస్తమో, నాకయితే తెలియదుగాని, నా అభిప్రాయం యేమిటంటే..."

"ఏమిటి ?"

"మనకు తెలిసినంతలో మనం జాగ్రత్తగా వుండాలని "

—సుందరం నవ్వాడు.

"నవ్వులాట కాదు - చూస్తూచూస్తూ బురదలో కాలు వేయలేముకదా!"

"అడుసు తొక్కనేల,కాలు కడుగ నేల-అంటావా ?"

"సరే! అదలా వుంచు. నువ్వు నాకో సహాయం చేసిపెట్టాలి. అందుకోసమే వచ్చాను".

"నాకు తెలుసు"

"ఏం తెలుసు ?"

"నువ్వు అందుకోసమే వచ్చావని"

"ఎందుకోసం ?"

"నీకో సహాయం కావాలని అడగ డానికి".

"అబ్బా! కవిత్వంతోపాటు జ్యోతిషం కూడా వస్తోందే-నేర్చుకుంటున్నావా?"

"నీ విషయం చెప్పటానికి జ్యోతిషం దాకా దేనికి ?"

"అంటే నేనంత తేలికగా వున్నానా?"

"ఎందుకట్లా ఉలిక్కిపడతావు. కాస్త కామన్ సెన్స్ ఉపయోగించి మాట్లాడాను అంతే. అసలు నువ్వు, నేను యిలా సరదాగా మాట్లాడుకుని యెంతకాలం అయింది చెప్పు. నీవు పనివేళ ఉదయం పూట యింటికి వెదుక్కుంటూ వచ్చా వంటే, యేదో పెద్ద పనిమీదే వచ్చి వుంటావనుకున్నాను. అంతే!"

"అంటే - 'ఊరకరారు మహాత్ములు' అన్న జాబితాలో నన్ను చేర్చావన్న మాట. అంతేనా?"

"సరేకాని మహాత్మా! ఏమిటి సెలవు చెప్పు—"

"నీవు నాకో సహాయం చేయాలి?"

"ఆజ్ఞాపించు"

"మా చెల్లాయిని తీసుకుని ఊరికి వెళ్ళాలి"

—సుందరం ఒక్కమారుగా ఉలిక్కి పడ్డాడు.

"ఎందుకట్లా భయపడతావు?"

"ఏం లేదు. చెప్పు—"

"నాలుగు రోజుల్లో అక్కడో కచేరీ వుంది. వదిలేసుకుంటే బాగుండదు. నాకు వెళ్ళడానికి యిబ్బంది అవుతుంది. అందు కని..."

సుందరం యేమీ మాట్లాడలేదు.

"అసలు నేను, ఇక్కడ పని మానేసి చెల్లాయితో వెడతానన్నాను. కానీ, అమ్మ 'అలా ఎందుకు, రమణను పంపుదాం' అంది. తీరా తనకు సెలవు దొరకదని యిప్పుడే రమణ చెప్పాడు, చావు కబురు చల్లగా అన్నట్లు..."

భానుమూర్తి దాదాపు ఏడుపు ముఖం పెట్టినట్లు అనిపించింది సుందరానికి.

"నీకేమిటి అంత అర్జెంటు పని"

"మరేం లేదు!" కాస్త సిగ్గు అభినయించాడు.

"ఎందుకలా సిగ్గు పడుతున్నావు. పెళ్ళికొడుకువు అవుతావా?"




"లేదు. లేదు..." కాస్త కళవెళ పడ్డాడు భానుమూర్తి.

"మరేమిటి చెప్పు"

"మెట్రిక్యులేషన్ పరీక్ష!"

"ఏమిటీ? పరీక్షకు కూర్చుంటున్నావా? భేష్. నాకు చెప్పనే లేదే!"

"ఎన్నిసార్లని చెప్పను?"

"పోన్లే. ఈసారన్నా తప్పకుండా పాసవ్వు".

"అసలు పరీక్షకు వెళ్ళడం నాకు యిష్టంలేదు. అమ్మ బలవంతం...పరీక్షకు వెళ్ళి కూర్చుంటూ వుంటే ఎప్పటికో ఒకప్పటికి వాళ్ళకే విసుగువచ్చి పాస్ చేస్తారని అమ్మ ఆశ. ప్రశ్నలకు జవాబు రాయడానికి కొంత కృషి చేయాలనీ, బుర్ర ఉపయోగించాలనీ అమ్మకు అనిపించదు".

"పోనీ భానుమూర్తీ! ఎలాగూ పరీక్షకు తయారవుతున్నవాడివి, ఒక నెలరోజుల పాటయినా నా దగ్గరకు వచ్చి తెలియనివి చెప్పించుకోకపోయావా?"

"అంత తీరిక ఎక్కడుంది గురువుగారూ? ఆమాత్రం సందే వుంటే రెండు లడ్డుందలు బిగించనా అన్నట్టు నాబోటి వాడే వెనకటికి ఒకడు"....

"బలేవాడివోయ్ మొత్తానికి."

"అదో చాపల్యం-పోనివ్వండి."

"బాగానే వుంది."

"ఇంతకూ మీరు ఒప్పుకున్నట్లేగా?"

—సుందరం మళ్ళీ ప్రస్తుతంలోనికి వచ్చాడు.

"ఎప్పుడు వెళ్ళాలన్నావు?"

భానుమూర్తి చెప్పాడు.

"సరే-అలాగే. మీ అమ్మగారు ఇలా చేయమన్నారా?"

"అవును. ఇంకో మార్గం లేదు"

"నాకెం అభ్యంతరం లేదు.

"థాంక్స్ గురువుగారూ. నాకు తెలుసును మీరు యిలా అంటారని" అంటూ స్తోత్రపారాయణానికి పూనుకొన్నాడు.

"సాయంకాలం యింటికి వస్తాన్లే-మాట్లాడుకుందాం. అప్పటిదాకా నీకీ ఉత్సాహం వుంటే దీపధూపనైవేద్యాలతో పూజ చేద్దువుగాని" అని సుందరం

* * *

సుందరానికి యిదో కొత్త అనుభవంలా వుంది.

శకుంతలతో ప్రయాణం చేయడం ఉత్సాహకరంగా వున్నదనడంలో సందేహం లేదు. అయితే-క్షణక్షణమూ ఆమెకు ఏంకావాలో కనుక్కోవడం, ఆ ఊళ్ళో కొత్త మనుష్యులతో చొరవగా కచేరీ ఏర్పాట్లను గురించి మాట్లాడడం, ఇదంతా కాస్త వింతగానే వుంటుందేమో!

"బయటి ఊళ్ళో మీ కచేరీ వినడం నాకు యిదే మొదలు..."

"కచేరీ అన్న తర్వాత ఉన్నవూరు అయితేనేం, పైవూరు అయితేనేం? ఏమైనా తేడా వుంటుందా?"

"వుంటుందేమో చూడాలి."

"మీకేమయినా కనిపిస్తే నాకు చెప్పడం మటుకు మర్చిపోకండేం?"

"అలాగే లెండి"

స్టేషన్ దగ్గరే సంగీత సభవాళ్ళు కలుసుకున్నారు.

"రండి. మా కారు వుంది-" అన్నారు.

సుందరం వాళ్ళకు తనను తాను పరిచయం చేసుకుంటూ భానుమూర్తి రాలేక పోవడాన్ని గురించి చెప్పాడు.

"భానుమూర్తి సరదా అయిన మనిషి" అన్నాడు వాళ్ళలో ఒకమనిషి.

"అతను రాకపోతే - సాయంత్రం కచేరీ అంతా మూగపోతుంది" అన్నాడు రెండో అతను.

కారు హోటల్ ముందు ఆగింది.

సంగీత సభవాళ్ళు ముందుగా నే 'డబుల్ రూం' బుక్ చేసి వుంచారు.

"డబుల్ రూం వద్దు. రెండు సింగిల్ రూం లుగా మార్పించండి" అందామని నోటి చివర వరకూ వచ్చింది సుందరానికి. కానీ వాళ్ళ ముందు తాను బయట పడడం ఎందుకని ఊరుకున్నాడు. అదీ గాక శకుంతల ఏమనుకుంటుందో అతనికి తెలియదు. ముందు అనుకున్న ఏర్పాటు ప్రకారం అయితే, సంగీత సభ్య కార్యదర్శిగారి యింటనే బస! అయితే ఆయన అత్యవసరంగా కుటుంబంతోసహా ఊరికి వెళ్ళవలసి రావడంతో మరో ఏర్పాటుకు సమయం లేక హోటల్ గదులే బుక్ చేశాం—అని వాళ్ళు విశదీకరించి చెప్పనే చెప్పారు.

"మీరు విశ్రాంతి తీసుకోండి. మేం మళ్ళీ అయిదు గంటలకు వస్తాం" అని వాళ్ళు వెళ్ళిపోయారు.

సుందరం రూం బాయ్‌ని పిలిచి ముందు రెండు కాఫీ పట్టుకు రమ్మన్నాడు.

వేడివేడిగా కాఫీ తాగిన తర్వాత కాస్త తేలికగా అనిపించింది యిద్దరికీని.

తరువాత శకుంతల "నేను స్నానం చేస్తాను" అంటూ బ్యాగ్‌లో నుంచి

 

బట్టలు తీసుకోసాగింది.

"ఈ వేళప్పుడా ?"

"అవును. ప్రయాణం అయిన మీదట స్నానం చేయకపోతే చికాకుగా వుంటుంది" అంటూ ఆమె బాత్ రూంకు వెళ్ళి తలుపు బిగించుకుంది.

సుందరం ధుస్తులు మార్చుకుని కూర్చున్నాడు.

కూడా తెచ్చుకున్న పుస్తకం ముందు పెట్టుకున్నాడు.

ఒక పావుగంటలో శకుంతల స్నానం చేసి ఫ్రెష్‌గా తయారయి వచ్చింది. డ్రెస్సింగ్ టేబుల్ ముందు కూర్చుని తల దువ్వుకుంటూంది. సుందరం ఆమె వంక క్రీగంట చూస్తున్నాడు.

కడిగిన ముత్యంలా తయారయి కూర్చుంది శకుంతల.

"మీరు కాస్సేపు విశ్రాంతి తీసుకుంటారేమో, నేను అట్లా బయట తిరిగి వస్తాను" అన్నాడు సుందరం.

"ఎక్కడికి వెడతారు-"

"అలా నాలుగు బజార్లు చుట్టి వస్తాను"

"ఎందుకు ఏమయినా పనివుందా ?"

"నాకేం పని! మీ విశ్రాంతికి భంగం రాకుండా..."

"బలేవారే!"

"ఈ వేళప్పుడు నిద్రపోవడం నాకు అలవాటు లేదు"

"ఏమయినా కబుర్లు చెప్పండి"

"మీరు విశ్రాంతి తీసుకుంటారా?"

"ఏమిటి విశ్రాంతి అంటే ?"

—సుందరం అర్థం కానట్లుగా చూశాడు.

ఈ సంభాషణ ఊరికే చేంతాడులాగా సాగిపోతోంది. ఎంత దూరం అయినా పాకి పోతోందిగాని, ఏమీ అర్థాన్ని ప్రయోజనాన్ని యిస్తున్నట్లు లేదు. కానీ యింతకన్నా స్పష్టంగా మాట్లాడడం ఎలాగో తెలియకుండా వుంది.

"బాగుంది, నన్నేం చేయమంటారు ఇప్పుడు ? " అంది నిశ్శబ్దాన్ని బ్రేక్ చేస్తూ శకుంతల.

"మీరు కాస్సేపు నిద్రపోతారేమో అనుకున్నాను."

"అబ్బే నిద్రపోను. ఊరికే కూర్చుని వుంటాను. సాయంత్రం వాళ్లు వచ్చి మనని తీసుకు వెళ్ళేంత వరకు యింతే"

"సాధన చేసుకుంటారా?"

"అవసరంలేదు. కచేరీకి వెళ్ళినప్పుడు అలాంటి పనులేం చేయను" —శకుంతల ఒక్కమారు ఆవలించింది.

"క్షమించండి. నేను యేం మాట్లాడుతున్నానో తెలియకుండా, మీకు విసుగు కలిగిస్తున్నాను."

"అబ్బే విసుగేంలేదండీ. ఏమన్నా కబుర్లు చెప్పండి వింటాను-"

ఆమెకు యెలాంటి కబుర్లు చెప్ప వచ్చునో-అతనికి అర్థం కాలేదు.

తనకు ఆమెకు కామన్ ఫాక్టర్ 'సంగీతం'. అందులోనూ తను కేవలం శ్రోత, ఆరాధకుడూను - అంతకంటే యింకేం కాదు. అటువంటప్పుడు తను యేం మాట్లాడ గలడు?

జీవితాన్ని గురించి కబుర్లు చెప్పదమంటే ఎంత సేపయినా చెబుతూ పోగలడు. కానీ శకుంతల లాంటి అమ్మాయిలతో చెప్పే కబుర్లు ఎలా వుంటాయి?

అతను మాట్లాడే లోపలే శకుంతల

అప్పుడే సంభాషణ ప్రారంభం చేస్తున్నట్లు, "మీ కథల పుస్తకం చదివాను. చాలా బాగా వ్రాస్తారండీ మీరు" అంది. సుందరం బిర్ర బిగుసుకు పోయి కూర్చున్నాడు.

"నిజం - నేను అనుకున్నది చెబుతున్నాను. నా కయితే లోతుపాతులు అర్థం కావనుకోండి. అయినా మీరు మనుషుల మనసుల్లో దూరి వాళ్ళ భావ పరంపరలు ఎలా వెలికి తీయ గలుగుతారా అని ఆశ్చర్యపడి పోయాను, అవి చదువుతూ వున్నంతసేపూ" అని ఒక్క క్షణం ఆగి-

"కానీ నాకో సంగతి అర్థం కాలేదండీ. మనిషి భావ పరంపరకూ అతని, బహిరంగ జీవితానికీ అంత సంబంధం వుండదాండీ?" అని అడిగింది.

ఆమెవంక ప్రశ్న పూర్వకంగా చూశాడు సుందరం.

మామూలుగా-అమాయకంగా వుంది ఆ ముఖం, గడుసుతనంగానో కొంటెగానో అడుగు తున్నదను కోవటానికి వీల్లేదు.

"సంబంధం వుంటుందండీ. ఎవరి జీవితాన్నయినా వారి భావ పరంపరే ఇన్ఫ్లుయన్స్ చేస్తుంది. కాకపోతే పరిస్థితుల వత్తిడి వల్లనో, తానూ అలా కనిపించడం యిష్టంలేకనో ప్రతివాళ్ళూ తమ అసలు ముఖం బయటకు తెలియకుండా కొన్ని కొన్ని ముసుగులు తగిలించుకు తిరుగుతారు. అదే విచిత్రం" అంటూ సుందరం సంభాషణను తన పుస్తకం మీద నుంచి మళ్ళించటానికి చూశాడు.

అతనికి అకస్మాత్తుగా ఒక విషయం గుర్తు వచ్చింది.

ఆ ప్రస్తావన తీసుకువస్తే చాలసేపు సమయం దొర్లిపోతుంది. ఆమె ఆలోచన ధోరణి యెలావుందో తెలుసుకుందుకు ఉపకరిస్తుంది-అనుకున్నాడు.

"మొన్న భానుమూర్తి చెప్పాడు. పెళ్ళి సంబంధాలు చూస్తున్నారటగా!"

శకుంతల అతనివైపు సూటిగా చూసింది.

సుందరం తన ప్రస్తావన ఎంతవరకు సబబో అని అంచనా వేసుకుంటున్నాడు.

"అలా చెప్పాడా భానుమూర్తి?"

—ఈ ప్రశ్న అతనికి ఏ మాత్రం అర్థం కాలేదు.

"ఇంకా ఏం చెప్పాడు ?" అంది శకుంతల కింది పెదవి పళ్ళతో నొక్కి.

సుందరం నవ్వి వూరుకున్నాడు, ఆమెకే మాట్లాడేందుకు అవకాశమిస్తూ.

"తనే చూస్తున్నానని చెప్పాడండీ ?"

"లేదు గురువుగారు, దేశికన్ ఏదో సంబంధం తెచ్చారనీ..."

"అది అయిపోయిందిగా!"

శకుంతల రెండు నిమిషాలు ఆగి యిలా అంది—

"ఏమండీ ! ఒక విషయం అడుగుతాను. దాపరికం లేకుండా బదులు చెబుతారా?"

—సుందరం దాదాపు నిర్ఘాంత పోయాడు.

"నేను పెళ్ళి చేసుకుంటే నా సంగీతం అంతా మాయం అయిపోతుందటగా ! ఆమాట నిజమేనా?"

"సాధనకు యిప్పుడు వున్నంత విరామం వుండకపోవచ్చును. కానీ అంత మాత్రాన వచ్చిన విద్య ఎక్కడకు

 

పోతుంది?"

"జీవితానికి అసలు అర్థం అంటూ వున్నదాండీ ?"

"మీ ప్రశ్న నాకు అర్థం కావడం లేదు. ఇంకా జవాబేం చెప్పను!"

"ప్రశ్న అర్థం కాలేదంటే మీరు దాటవేస్తున్నారనుకుంటాను. అంతే!"

"అబ్బె కాదు..."

"పోనీ యిది చెప్పండి. జీవితంలో వివాహం తప్పనిసరా ? పెళ్ళి చేసుకో కుండా వుండడం కుదరదా ?"

"తప్పనిసరి అని చెప్పలేను.అందరూ చేసేపని అది. కానీ జీవితానికి పరిపూర్ణత రావాలంటే వివాహం, భార్యాభర్తలు, పిల్లలు, సంసారం, గొడవలు...ఇవన్నీ వుండి తీరాలనుకుంటాను"

"మరో మాట చెప్పండి. మనిషికి తన సుఖం, సంతోషం ముఖ్యమా? లేక తన చుట్టూ వుండేవాళ్ళ సుఖ సంతోషాలు ముఖ్యమా ??"

"కేవలం తన సుఖమే చూసుకునే వాడిని స్వార్థపరుడు అంటారు. ఇతరుల కోసం శ్రమించేవాడిని త్యాగమూర్తి అంటారు. కానీ ఇతరుల సుఖ సంతోషాల లోనే తన సుఖాన్ని కూడా చూసుకొని జీవించగల మనిషి ధన్యుడు అనుకుంటాను".

"అలా చేయలేకపోతే?"

"ప్రయత్నం చేయాలిగా ముందు".

"ప్రయత్నం విఫలమయిందనుకోండి అప్పుడు..."

"ఎవరి మనస్సు చెప్పినట్లుగా వాళ్ళు నడుచుకోవడం మంచిదనుకుంటాను" అన్నాడు సుందరం ఆమెవైపు లాలనగా చూస్తూ.

"ఓహో!" అని ఊరుకుండిపోయింది శకుంతల.



# 17

సంగీత కచేరీ అయిన తరువాత యిద్దరూ హోటల్ రూంలో ఒంటరిగా మిగిలి పోయినప్పుడు అడిగింది శకుంతల-

"ఏమండీ! ఎలా వుంది కచేరీ?"

"చాలా బాగుంది"

"తేడా యేమయినా కనిపించిందా ? బయట వూరుకూ..."

"అబ్బె ! ఏం లేదండీ" సుందరం మధ్యాహ్నం తమ సంభాషణ గుర్తుకు తెచ్చుకున్నాడు. అతనికి నవ్వువచ్చింది.

"మొత్తంమీద మీ కచేరీలు ఒకదాని కంటే మరొకటి ఎక్కువ బాగుంటున్నాయి సుమండీ!"

"మీ అభిమానం అలా అనిపిస్తుంది. నాకయితే సంగీతానికి సంబంధించిన వరకు నేనో స్తబ్దతకు వచ్చాననుకుంటున్నాను".

"అంటే?"

—సుందరం మనస్సు కాస్త వెనక్కు పోయింది.

'తరుణ కిన్నెర పాట తారలాడుట
చూసి
పువ్వులో, లేసంజ
రువ్వులో, దానిమ్మ
తెలతెల్లనయిపోయెనో-పొంజిల్క
పల్కులో పసదప్పెనో—'

అని పాడింది ఆరోజు కచేరీలో శకుంతల. (కిన్నెరసాని పాట)

సుందరానికి ఈ పాట వింటున్నపుడు ఆమె ముఖంలో ఆ భావం చక్కగా కట్టినట్లుగా అనిపించింది.

అందుకనే యిప్పుడు ఆమె ముఖం వంక పరిశీలనగా చూశాడు.

ఇంకా అదే భావం కనిపించసాగింది అతనికి.

ఎర్రగా వుండే దానిమ్మ పువ్వు తెల్లగా అయిపోయింది. చిలుక పలుకులలో 'పస' తప్పిపోయింది. దీన్ని 'డేరింగ్ పొయెటిక్ కంసెప్షన్' అని ఆచంట జానకిరామ్ అనడం అతనికి గుర్తు వచ్చింది, చటుక్కున.

అబ్బ! ఎంత ఆకర్షణ ఈ భావం-ఈ గొంతు...

ఆ పాడుతున్న మూర్తిని!

శకుంతల మనస్థితిని కూడా యిటువంటి నైరాస్యమే అలుముకుంటుందా - అని భయపడ్డాడు సుందరం.

"ఏముంది.ఎప్పుడూ ఒకటే రాగాలు అవే వర్ణాలు, అవే కృతులు, అవే స్వరాలు... దాదాపు యాంత్రికంగా అయిపోయింది సంగీతం. కొత్తదనం కనిపించడంలేదు."

"రాగ ప్రస్తారంలో, స్వరకల్పనలో కొత్తదనం చూపిస్తున్నారుగా."

"వింటున్నవాళ్ళకు అలా అనిపిస్తుంది గాని అంతా ఒకే చట్రంలో యిమిడిపోయిన వ్యవహారం."

—సుందరానికి ఈ విషయం కాస్త కొత్తగావుంది. అర్థం చేసుకుందుకు ప్రయత్నించాడు.

కొంతసేపు ఆలోచించిన మీదట దీనిలో నిజం వున్నదేమో అనిపించింది.

"అవునండీ! రోజూ నిద్రలేవడం, కాలకృత్యాలు తీర్చుకోవడం, ఆఫీసుకు వెళ్ళడం, పనిచేయడం, యింటికి రావడం... అవే కాగితాలు, అవే మనుష్యులు ...యిలా సంగీతంలో కూడా జీవితం 'బోర్' అయిపోతుందంటారా?"

"బాగా చెప్పారు. అదే నా బాధ"

"మనిషికి వైవిధ్యం వుండాలండీ. ఎప్పుడూ ఒకే రకమయిన పనులు చేస్తూ వుంటే జీవితమంతా ఊకదంపుతున్నట్లు, గానుగ తిరుగుతున్నట్లు తయారవుతుంది. మార్పుకోసం ప్రతివాడూ ప్రయత్నం చేస్తూనే వుంటాడు."

"మన దృష్టి కోణంనుంచి కూడా యీ విషయం మారుతూ ఉంటుంది. నేను చిన్నప్పుడు అదే పనిగా సంగీత సాధన చేస్తూ కూర్చునేదాన్ని. చూసేవాళ్ళకు విసుగనిపించిందిగాని నాకు మాత్రం యేమీ బేజారు ఆయేదికాదు, రోజంతా పాడుతూనేవున్నా. కానీ యిప్పుడు నాకే విసుగు అనిపిస్తోంది."

"విసుగని మానివేసేరుసుమండీ!" అన్నాడు సుందరం నొచ్చుకుంటూ.

"మానివేయడం కూడా నాకు చేతకాకుండాపోయిందనుకోండి, ఇప్పుడు అది కాదు నేను చెబుతూ వున్నది. సంగీతం మీద నాకు ఇంటరెస్ట్ తగ్గకపోయినా మనసును ఇతర విషయాలు కూడా తగినంతగా ఆకర్షిస్తున్నాయి."

"అంటే మనస్సు యొక్క 'సెంటర్ ఆఫ్ ఏక్టివిటీ' మారుతున్నదన్నమాట— అనుకున్నాడు సుందరం తన మనసులోనే. ఈ విషయం శకుంతలకు అర్థం అయేట్లు చెప్పడం ఎలాగో తెలియక




ఊరుకున్నాడు.

అతనికి యింకా ఈ విషయంలో ఆలోచనలు కదిలాయి.

కొంతమంది కేవలం 'రొటీన్ వర్క్' కూడా చాలా 'క్రియేటివ్'గా చేస్తారు. కానీ యిప్పుడు సమస్య అదిగాదు, సృజనాత్మకం అనుకుంటున్న పని యాంత్రికం అయిపోవడం! తలకిందులు వ్యవహారం. అంతా 'ఉల్టా సీదా' అయినప్పుడు యేం అవుతుంది?

—ఈ విషయం తాపీగా ఆలోచించుకోవాలి!

"మూడు నెలల క్రితం ఈ వూరుకు వచ్చాం. అప్పుడు ఒక ఎగ్జిబిషన్‌కు

తీసుకువెళ్ళాడు అన్నయ్య" అంది శకుంతల.

"ఆహా"

"ఆ ఎగ్జిబిషన్ నాకు బాగా గుర్తు"

"బహుశా చాల దుకాణాలు వున్నా యే మో! ఏవున్నా కొనుక్కున్నారా అంత గుర్తు వుండేందుకు?"

"కొనడం కాదు, ఒక స్టాల్‌లో చూసిన దృశ్యం నా హృదయానికి హత్తుకు పోయింది."

"ఏమిటో చెబుతావా?"

"ఆ స్టాల్‌లో రెండు చేతులూ లేని అమ్మాయివుంది. తమాషా ఏమిటంటే, రెండు చేతులతో మనంచేసే పనులు ఆ అమ్మాయి తన కాళ్ళతో అవలీలగా చేసేస్తుంది—"

"భగవంతుడి లీల అది! ఒక అంగం వికృతం అయినవాళ్ళకు దాన్ని 'కాంపేన్‌సేట్' చేయడానికి మరో అంగానికి కొత్తబలం, శక్తి యిస్తాడు."

"అవును. కళ్ళులేని వాళ్ళకు వినికిడి శక్తి యెక్కువవుతుందట!"

"ఆ అమ్మాయి మిమ్మల్ని అంతగా ఎందుకు యింప్రెస్ చేసింది?"

"చూడండి బట్టలు పిండి ఆరవేయడం, రాతపని, బంతిఆట – అన్నీ తన కాళ్ళతోనే చేసి చూపిస్తుంది ఆ అమ్మాయి."

"బాగా ప్రాక్టీస్ చేసి వుంటుంది."

"అవును. ఇంతకూ నేను చెప్ప దలుచుకున్నది యేమిటంటే— చేతులు లేని అమ్మాయి ఆ పనులన్నీ చేయకబోతే మటుకేం? తప్పనిసరిగా ఆ పనులన్నీ కాళ్ళతో చేయగలిగేట్లు ఆ పిల్లను బాధపెట్టి నేర్పక పోతేనేం?–ఆ రోజు వారిగా ఆ మ్మా యికి ఎవరయినా సహాయం చేయవచ్చుగా! యింతకూ, విచిత్రం అదికాదు..."

"ఇంకేమిటి?"

"ఆ అమ్మాయి తాలూకు మనుషులు ఒక 'స్టాల్' తీసుకుని టికెట్లు పెట్టి, యీ పనులన్నీ ఆ అమ్మాయి చేత చేయించి చూపించి, జనాన్ని ఆకర్షించడం, ఎక్కడ ఎగ్జిబిషన్లు జరుగుతూ వుంటే అక్కడికల్లా ఆ పిల్లను తీసుకు పోతారట! ఎగ్జిబిషన్ చూడటానికి వచ్చిన వాళ్ళంతా యీ వింతలు చూసి ఆనందించి పోతూ వుంటారు. ఆ అమ్మాయి తాలూకు వాళ్ళకు వేలకు వేలు డబ్బు!"

సుందరం యేమీ అనలేదు.

"ఆ పిల్లమీద ఆధారపడిన వాళ్ళు యిప్పటికి వేలకు వేలు సంపాదించి వుంటారు. కాస్త వయసు వచ్చిన పిల్ల అయిన తర్వాత, గుడ్డలు విప్పడం, వేసుకోవడం కూడా చూపిస్తే మరింత డబ్బు వస్తుంది–"

"చౌకబారు ప్రదర్శనం."

"ఆ పిల్ల తాలూకు వాళ్ళకూ, చూచే వాళ్ళకూ అలా అనిపించదు. తామేదో దేశసేవ చేస్తున్నామనే వాళ్ళు అనుకుంటారు – అదీ విచిత్రం!"

—జీవితంలో ఏర్పడిన అవయవాలను కూడా తమకు అనుకూలంగా మలుచుకుని ధనార్జనకు పూనుకుంటున్న వాళ్లను సుందరం చాలా మందిని ఎరుగును. అయితే శకుంతల చెబుతూ వున్న 'విలక్షణం' అతనికి యింతకు ముందెన్నడూ తోచలేదు.

"అవును సుమండీ! ఒక రకంగా





గుఱ్ఱపు పందేలు కూడా ఇలాంటివే. మన వినోదం కోసం వాటిని కొట్టి, శిక్షించి...నురుగులు కక్కేలా పరుగు లెత్తించడం..."

"అంతకంటె క్రూరత్వం లేదు. కానీ అందరికీ అది సహజంగా కనిపిస్తోంది" అని శకుంతల కొన్ని క్షణాలు ఆగి తిరిగి తానే యిలాఅన్నది. "నామటుకు నాకు-ఆ అమ్మాయికీ, నాకూ అట్టే తేడా కని పించడం లేదు."

సుందరం దిగ్భ్రాంతి చెందాడు.

"అదేం అలా అంటున్నారు!"

"కాక మరేమిటి? ఆ అమ్మాయిది చౌకబారు ప్రదర్శనం అనీ, నాది కళా త్మకమయిన ప్రదర్శనం అనీ పేర్లు పెట్టు కుని వేరువేరుగా చెప్పుకోవడమే చేస్తు న్నాముగాని ఈ రెండు ప్రదర్శనల వెనుక వున్న ఉద్దేశ్యం ఒకటేగదా!"

"ఏమిటది?"

"వీలయినంతవరకు ఎక్కువ డబ్బు సంపాదించడం"

—సుందరానికి వెంటనే అంగీక రించ బుద్ధి కాలేదు.

"సంఘంలో మీకు పేరు ప్రతిష్ట వున్నాయి. ఆ అమ్మాయికి యేం వున్నాయి?"

"వ్యక్తిగత జీవితానికి సంబంధించి నంతవరకూ యిద్దరికీ యేమీ తేడాలేదు" అన్నది మళ్ళీ శకుంతల.

తన పేరు ప్రతిష్టలు మాత్రం ఎక్కువ కాలం నిలుస్తాయా?

నాలుగు నెలలు వరసగా కచేరీలకు వెళ్ళడం మానేస్తే తనను జనం మరిచి పోవడంలో ఆలస్యం చేస్తారా?

రేపు తనకంటే బాగా పాడే వాళ్ళు వస్తే తను వెనక పడిపోదా?

—ఇవన్నీ సహజంగా జరిగే మార్పు లేగా ఏ రంగంలో నయినా!

సుందరం ఆమె ఆలోచనా ధోరణికి చాలా నొచ్చుకున్నాడు.

"జీవితంలో యిటువంటి మహత్తర మయిన అవకాశాలు ఎక్కడో నూటికి కోటికి ఒకళ్ళకు వస్తాయి"

"ఏమిటా మహత్తరం?"

"జీవితం కళకు అంకితం చేయడం"

"అలాంటి మహత్తరమయిన మను షులు మాత్రం తమ సహజమయిన జీవి తాన్ని ఎందుకు రూపు మాపుకోవాలి?"

—సుందరం జవాబు చెప్పలేదు.

"గొప్ప మనిషికి మాత్రం మామూలు జీవితం వుండదా? ...జీవితం అంతా ఆ గొప్పదనమే పులుము కోవడం బాగుం టుందా?"

—సుందరం యింకా ఆలోచిస్తు న్నాడు.

"మా అన్నయ్య అంటాడు. జీవి తంలో త్యాగం చేయడం ఉదాత్తమయిన పని అని! కానీ త్యాగం అంటే ఏమిటి? మేధావులకు అర్థం అవుతుందేమోగాని, నా జోటి సామాన్యురాలికి యివేం అవగాహన కావు."

ఇక్కడ త్యాగం ప్రసక్తి యేమిటో సుందరానికి అర్థం కాలేదు.

"సంగీతం కోసం చిన్నతనం నుంచి కృషి చేశాను. పరిస్థితులు కలిసి వచ్చి నాకు ఆ విద్య అమరింది. దైవకృప కూడా తోడయింది. నా కృషి యేమీ సామాన్యమైనది కాదు. సంగీతం చాలా గొప్పదే కావచ్చును. కానీ జీవితం అంతా అదేనా? ఇంకేమీ ఉత్తేజకరమయిన విష

యారే లేవా?" శకుంతల ఇలా సూటిగా అడుగుతోంటే యేం జవాబు చెప్ప టానికి సుందరానికి స్ఫురించ లేదు.

శకుంతలకు ఇంత ఆలోచన వున్న దన్న విషయమే సుందరానికి ఆశ్చర్యం కలిగిస్తోంది.

మొత్తం మీద ఆమెకు యేదో అసం తృప్తి, విసుగుదల ఏర్పడుతున్నాయి. ఈ విషయం యిదివరకే లీలగా తెలిసినా యిది యింత తీవ్రరూపంలో వున్నట్లు యిప్పుడిప్పుడే తెలుస్తూ వుంది.

మధ్యాహ్నం నాకు పెళ్ళి సంబంధాలు చూస్తున్నాడు మా అన్నయ్య-అన్నారు మీరు.

ఆ రాత్రి మా ఇంట్లో జరిగిన సంభా షణ వింటే బాగుండేది. ఒకమారు మా నాన్న, అమ్మగారు మాట్లాడుకోవడం ఆ సంభాషణ నేను విన్నాను. యింకా నా చెవుల్లో మారుమోగుతూనే వుంది"

'నాకు యెందుకో భయంగా వున్న దండీ' అంది అమ్మ.

'ఎందుకు భయం? ఆడపిల్ల అన్న తర్వాత ఎప్పటికయినా అత్తవారింటికి వెళ్ళవలసిదేననీ నీవే అంటూవుంటావుగా! అన్నారు నాన్న. అదే నా భయం. శకుంతల వెళ్ళిపోతే మళ్ళీ మన గతి ఏమవుతుంది? ఆ మాట తలచు కుంటేనే నాకు వొళ్ళు కంపరమెత్తి పోతుంది'

నాన్నగారు 'అందుకని...' అని యింకా ఏదో అంటున్నారు. ఆయన పూర్తిగా వాక్యం అననేలేదు... ఈ మాటలు విన్న ప్పుడు నాకెట్లా అనిపించిందో చెప్ప మంటారా?"




—ఆమె కంఠం రుద్ధం అవడం అప్పటికే గ్రహించాడు సుందరం.

"ఒద్దు. ఒద్దు. నేను ఊహించుకో గలను" అన్నాడు ప్రయత్న పూర్వ కంగా.



# 18

శకుంతలకు ఇప్పుడు దేశ వ్యాప్తమయిన పేరు వచ్చింది. తెలుగు రాష్ట్రం లోనే కాకుండా ఇరుగు పొరుగు రాష్ట్రాల లోనుంచి కూడా—అడపదడప ఉత్తర హిందుస్తానం నుంచి - ఆమెకు సంగీత కచేరీకి ఆహ్వానాలు వస్తున్నాయి. మద రాసు మ్యూజిక్ అకాడమీ వాళ్లు ఆమెకు ప్రతిసంవత్సరం అవకాశం ఇస్తున్నారు.

సినిమాలలో కొత్త ముఖాలు, కొత్త గొంతులు అంటూ తాపత్రయం పడే మనిషి ఒకాయన శకుంతల చేత తన సినిమాలో రెండు పాటలు కూడా పాడించాడు. ఆ సినిమా అంతంత మాత్రంగా నడిచింది. శకుంతల పాటలు మాత్రం 'హిట్' కాలేదు. అందుచేత ఆమెకు సినిమాలో పాడే అవకాశం మళ్ళీ రాలేదు.

"సంగీత కచేరీల కంటే సినిమాలు మెరుగయినవి" అంటాడు భానుమూర్తి.

"ఎందుచేత?"

"వీటికి శ్రమ తక్కువ. ఫలితం ఎక్కువ!"

# గానసభ

దొక్కలు ముక్కలు చేసుకుని నాలుగు గంటలసేపు పాడితే వచ్చే డబ్బు, సినిమాలలో ఒక్క చరణానికే వస్తుంది. ఈ కిటుకు కనిపెట్టడంలో భానుమూర్తి ఏమీ వెనుక పడలేదు. అతను స్వతంత్రించి ఇద్దరు ముగ్గురు సంగీత దర్శకులను కూడా కలుసుకున్నాడు. ఎప్పటికయినా కలిసిరాక పోతుందా అని ఒక సంగీత దర్శకుని దగ్గర తాను సహాయకుడుగా కూడా చేరాడు. 'జీతమేమీ అక్కర్లేదు. ఊరికే పనినేర్చుకుంటాను' అన్నాడు.

గోపాలంగారు బాగా ఆరోగ్యంగా వున్నారు. ఇంటి పనులు, బజారు వ్యవహారాలు యిప్పుడు ఆయనవే, భానుమూర్తికి ఎలాగూ తీరుబడి లేదు గదా!

డబ్బంతా శకుంతల పేరిట బ్యాంకులోనే వుంది. సాధారణంగా ఈ డబ్బు యెప్పుడూ తీయవలసి రాదు. ఖర్చులకు అవసరం అయింది దగ్గర వుంచుకుని తతిమ్మాదీ బ్యాంకులో వేస్తూవుంటాడు భానుమూర్తి. అంటే అతను 'డిపాజిట్' ఎకౌంట్ కాని డ్రాయింగ్ ఎకౌంట్‌గా వ్యవహరించడన్న మాట.

జీవితం నల్లేరు మీద బండిలా నడిచి పోతోంది.

శకుంతలకు మటుకు ఈ జోలపాట చాల అసహనంగా వుంది.

"నాకు డబ్బుమీద యేమీ అపేక్ష లేదు." అంది శకుంతల సుందరంతో

ఒకమారు.

"సహజమే"

"నాకు కావలసింది యింట్లో వాళ్ళు నన్ను మనిషిగా చూడడం. దేవతలాగ పూజించడం - డబ్బు సంపాదించే యంత్రంగా అనుకోవడం కాదు."

ఎక్కువ వివరణ అవసరం లేకుండానే ఆమె వేదన అర్థం చేసుకో గలిగాడు సుందరం.

'నేను సంపాదిస్తున్న డబ్బు మీద అందరికీ గౌరవం. ఆ డబ్బు నా మూలంగా వస్తుంది గనుక నేనంటే గౌరవం.తను అందరికన్నా చిన్నదిగదా యింట్లో తనను యెందుకు మిన్నగా చూస్తారు? అనురాగం, లాలిత్యంకాకుండా గౌరవం చూపుతారు. యెందుకని'-యిదీ శకుంతల కంప్లైయింట్.

"అందరిలాగ నాకూ ఒక భర్త, ఒక యిల్లు, వాకిలి, సంసారం వుంటే చాలు- ఈ లేనిపోని ఆర్భాటాలు, ఆడంబరాలు అవసరం లేదు. ఇవి అసలునాకు యెక్కువ విలువయినవి కానేకాదు-" రాజేశ్వరి సంసారం ఆమె మనసులో మెదులుతూ వుంటుంది యెప్పుడూ.

"జీవితానికి డబ్బు ఒకటే ప్రధానమా?"

"అవును...కాదు" అని సమాధానం చెప్పాడు సుందరం.

శకుంతలకు జీవితం పట్ల విరక్తి కూడా ప్రారంభం అవడం అతను గమనించాడు. ఏమిటో యేంచేసినా ఒకటే; ఉత్సాహం అంతా అడుగంటి పోతోంది. కొత్త ఉత్సాహం తెచ్చుపెట్టుకోవడం చేత కాకుండా పోతోంది.

భానుమూర్తి యేదో కబుర్లు చెబుతాడు. అవన్నీ శకుంతలకు రుచించవు. పరుగెత్తుకుపోయే స్వభావం అతనిది. ఆ పరుగులు తనకు సరిపడవు. పరుగుల్లో తనకాళ్ళ కింద ఎవరు నలిగిపోతున్నారో గమనించడు అతను. తనది స్థాయిగా వుండే స్వభావం. తనకు ఎలాంటి ఉదుకులు, పరుగులు చేతకావు. స్థిమితంగా వుండి తనపని తానుచూచుకుంటూ ఇతరులకు యేమీ యిబ్బంది కలగకుండా కాలం గడుపుకుపోయే తత్వం తనది. కానీ మనసులో యేదో వెలితి కొట్టవచ్చినట్లుగా కనిపిస్తూంటే, ఎన్ని రోజులు గడిచినా యీపరిస్థితిలో మార్పు రాకపోతే, యింకా విరక్తి కాక యేం కలుగుతుంది?"

సుందరంతో యీ మాటలు సూటిగా అనగలుగుతూంది ఆమె. అతనికంటె యింకెవరూ ఆత్మీయులు లేరు.

శకుంతల మనసు చదవడంలో అతనేమీ పొరపాటు పడలేదు. తెరిచిన పుస్తకం పుటలాగ అతను ఆమె మనస్సంతా అవలీలగా చదవగలిగాడు.

సుందరం తన ఆలోచనలను కొంతలో కొంత పంచుకోగలడంతో శకుంతలకు కొంత ఊరట చిక్కినట్లయింది. మనసుకు విశ్రాంతి లభించినట్లయింది. ఆవేదన, ఆలోచనల బరువు- సహృదయంతో వినేవాళ్ళు వుంటే చాలా వరకు తగ్గిపోతాయి.

సుందరం ఒక విషయాన్ని తెలుసుకుని ఊరికే ఉండిపోగల మనిషికాదు. దాని పూర్వాపరాలన్నీ తనలో తను విమర్శించుకుంటాడు, చర్చించుకుంటాడు.

శకుంతల మనసును చదివిన తర్వాత అతనిలో యెంతో సంచలనం కలిగింది.

ఈ విషయం యింతవరకూ తనకు తెలియక పోవడం, ఊహకయినా అందకుండా పోవడం ఆశ్చర్యం అనిపించింది. శకుంతల స్థితికి అతనెంతో నొచ్చుకున్నాడు.

ఒక జీవిలో వుండే చైతన్యం ఎలా సర్వతోముఖమయిన అభివృద్ధి కోరుకుంటుందో - శకుంతలను చూసి అతను తెలుసుకున్నాడు. ఆమెది లేత వయస్సు. అతి లేత మనస్సు అయితే ఆ మనసుకు ఇప్పుడు మార్పిడి ఎక్కువయింది. దీనిని సక్రమమయిన మార్గంలో నడిపిస్తే తప్ప ఆమె జీవితం ముందు ముందు సజావుగా సాగదు - అని అతనికి స్థిరంగా తెలిసి పోయింది.

శరీరంలో ఒక అంగం విపరీతంగా పెరిగితే, పూర్తి ఆకారానికి వికృతమయిన రూపం వస్తుంది. శరీరం అంతటా సమంగా పెరగాలి. శరీరంతో పాటు మనసుకూడా ఎదగాలి. అప్పుడే మనిషికి నిండుతనం.

శకుంతలను యిలాగే అశ్రద్ధగా వదిలేస్తే కొన్ని రోజులలోనే ఆమెకు నిజంగా 'పిచ్చి' యెక్కి పోతుందేమోనని భయం వేసింది అతనికి. ఆమె పట్ల యిప్పుడు అతనికి జాలి, సానుభూతి మాత్రమే కాదు-ఇంకేదో చెప్పరాని, చెప్పటానికి చేతకాని అనుభూతి. తను యేదో ఒకటి చేయాలి. శకుంతలను ప్రమాదం నుంచి తప్పించాలి. ఏం చేయాలి? ఏంచేయాలి? అనే తపన అతనికి ఎక్కువయి పోయింది.

శకుంతల చిన్నపిల్లకాదు—అనుకున్నాడు ఎన్నోమార్లు మనసులో. ఆమెను ఎన్నో కోణాలనుంచి పరిశీలించి చూశాడు. ఇన్నాళ్ళూ తనకు సంగీత రసమే కనిపించింది. ఇప్పుడు సంపూర్ణ వ్యక్తిత్వం బాహాటంగా కనిపిస్తోంది. ఇన్ని రోజులూ తనను కట్టిపడేసిన సంగీత సౌందర్యం యిప్పుడు మరొక సౌందర్యపు తొడుగును ధరించినట్లు అనిపిస్తోంది.



## 19

ఆ రోజు రాత్రి రేడియోలో సంగీత కచేరీ వున్నది శకుంతలకు. అది ముందుగానే 'రికార్డ్' అయింది. అందు చేత శకుంతల ఆ సమయానికి యింటి దగ్గరే వుంది. 'రికార్డింగ్' జరిగినప్పుడు గురువుగారు కూడా స్టేషన్‌కు వెళ్ళారు. ఒకమారు అక్కడే విన్నారు కూడా. అంచేత ఆయన యిప్పుడు శకుంతల యింటికి రాలేను. ఈ కచేరీ భారత దేశంలోని అన్ని కేంద్రాలు గుండా ఇదే సమయానికి 'రిలే' అయి ప్రసారం అవుతుంది. అంచేత యిది ప్రధానమయిన ఘటన కిందే లెక్క.

కచేరి వినడం కోసం భానుమూర్తి సుందరాన్ని కూడా ఆహ్వానించాడు. నిజానికి సుందరం తన యింట్లోనే వినవచ్చును. అయినా రసహృదయులయిన స్నేహితులతో కలిసి వినడంవేరు. అందులో కొత్తఆనందం వుంటుంది. సంగీతంలోని మెలుకువలు గురించి ప్రత్యక్ష వ్యాఖ్యానంచేసుకుందుకు అవకాశంవుంది. అందుచేత భానుమూర్తి ఆహ్వానాన్ని

అంగీకరించి వచ్చాడు సుందరం.

అంతేకాదు ఇప్పుడు అతనికి శకుంతల మీద కొత్తరకం ఆప్యాయతలు పెరుగుతున్నాయి. ఇవి కేవలం సంగీతానికే పరిమితం అయినవికావు. శకుంతలకు చెప్పలేనంత అసహాయత ఆవరించి వుండడం సుందరం ప్రత్యక్షంగా గమనించాడు. అందుచేత కొంతలో కొంత ఆమెకు ధైర్యం చెప్పటానికీ, ఉత్తేజం యివ్వటానికీ యేదయినా అవకాశం లభిస్తే దాన్ని వృధాగా పోనివ్వడంలేదు అతను. ఆమె పూర్తిగా అసహాయురాలు కాదనీ, ఆమె వెనక కొండంత బలం వున్నదనీ ఆమెకు తెలియ చెప్పడం తన కర్తవ్యం అనిపిస్తోంది అతడికి.

'శ్రీ గణపతిని సేవింపరారె' అనే సౌరాష్ట్రి రాగ కీర్తనతో కచేరీ ప్రారంభం అయింది. ఈ కీర్తనలో సాహిత్యపరమయిన ఊపు యెంతో వుంది. బహుశః అందుకు కారణం యిది సంగీత నాటకంలో పాడుకుందుకు రాసిన కీర్తన కావడం కావచ్చును.

"ఈ కీర్తన బాగుంది—కచేరీకి పుష్టి యిచ్చింది భానుమూర్తీ!" అన్నాడు సుందరం.

శకుంతల నీరసంగా నవ్వివూరుకుంది.

"మొదటి కృతినే మెచ్చుకుంటే తతిమ్మావన్నీ యేమయి పోవాలి! కాస్త గుర్రాన్ని కట్టేవేయి." అన్నాడు భానుమూర్తి.

శకుంతల కచేరీలో బాగుండని అంశం




అంటూ యేమీవుండదు. అన్నీ చక్కగా సాధకంచేసి స్వాధీనం లోనికి తెచ్చుకుని ఆపైన ప్రచారంలోనికి తెస్తుంది - అనుకున్నాడు.

ఆమె ఈ కచేరీలో రెండు రాగాలను ప్రస్తారం చేసింది. స్వరకల్పనలో కొన్ని చమత్కృతులు చేసింది. రెండు రాగ ప్రస్తారాలు ఒకదాన్ని మించి మరొకటి వున్నాయి. నిజానికి యిది గురువుగారి కృషి అన్నమాట!

"నాకు శంకరాభరణరాగ ప్రస్తారం బాగుంది" అన్నాడు భానుమూర్తి.

"నాకు మోహనరాగమే ఎక్కువ మక్కువ" అన్నాడు సుందరం.

—ఇద్దరూ కాసేపు పోట్లాడు కున్నట్లుగా చర్చించు కున్నారు. శకుంతల తాపీగా వింటూ కూర్చుంది.

కచేరీ అంతా విన్న తరువాత "మొత్తం మీద యివ్వాళ పెర్ఫార్మెన్స్ చాలా గొప్పగా నడిచింది. రోజురోజుకూ శకుంతల సంగీత మాధుర్యం పెరిగి పోతూవుంది. నా అభివందనలు ప్రత్యక్షంగా తెలుపు కుంటున్నాను" అన్నాడు సుందరం.

శకుంతల నునుసిగ్గుగా 'థాంక్స్' అంది.

భానుమూర్తి ప్రత్యేకంగా యేం మాట్లాడలేదు - గాని యీ ఆనందంలో పాలుపంచు కుంటున్నాడు.

మాటల సందర్భంలో సుందరం యిలా అన్నాడు;

"సంగీతంగానీ, యే కళగానీ మనిషి జీవితంలో ఒక స్థితిలో మాత్రమే బాగా వెలిగి పోతుంది. ఆ స్థితి దాటిన తర్వాత అతి సామాన్యంగా మిగిలిపోతుంది"

"జీవితమంతా ఈ కళోపాసనలోనే గడిపివేసే వాళ్ళ మాట యేమిటి ?" అన్నాడు భానుమూర్తి.

"వాళ్ళ విషయంలోనూ యింతే- కాకపోతే వాళ్ళు కళను 'గ్రేడ్'చేస్తారు, ఒక ఉత్తీర్ణత చేరుకున్న తరువాత ఆ స్థితిలోనే నిలిచి పోతున్నారుగాని రోజు రోజుకూ కొత్తదనాన్ని తీసుకురాగిల గడం మనం యెవరి విషయంలోను చూడలేదు గదా !"

—ఈ మాటలు తనస్వంతం కావనీ, శకుంతల ద్వారా విన్నవే అయినా యెంతో యదార్థ మయినవనీ సుందరం గుర్తు తెచ్చుకున్నాడు.

"అందరూ ఆ ఉత్తీర్ణ స్థితిలోనే అలా నిలిచిపోగల రంటావా?"

"అదీ నిజమే. చాలామంది కిందికి పడిపోతారు కూడాను. వాళ్ళలోని 'కళ' సరయిన పోషణలేక పోవడంవల్ల . వాడిపోయి 'చ్యుతి' పొందుతుంది. ఉదాహరణకు మన శకుంతలనే తీసుకో. ఇప్పుడు చక్కగా పాడుతోంది. రేపు పెళ్ళిఅయి యిద్దరు ముగ్గురు పిల్లలు కలిగిన తర్వాత యింత చక్కగా పాడగలుగు తుందా?" అన్నాడు సుందరం.

అప్పటికి శకుంతల అక్కడలేదు. వాళ్ళిద్దరే కూర్చుని వున్నారు. పెళ్ళి అనేమాట వినేటప్పటికి భానుమూర్తికివీపు మీదఎవరోకొరడాతోచర్చినట్లు అయింది. వెంటనే సమాధానం చెప్పలేక పోయినా, తర్వాత "అందుకనే సంగీతం వంటి కళను సాధన చేసేవాళ్ళు పెళ్ళిళ్ల సంసారాలు తలపెట్టగూడదు"అన్నాడు.

సుందరానికి ఇదే తగిన సమయం అనిపించి చిన్న ఉపన్యాసంలాంటిది యిచ్చాడు.

"భానుమూర్తీ! కళ జీవితంలో ఒక భాగం మాత్రమే. ఆమాటకువస్తే, మనిషి అనుభవాలకు పైన పూసిన రంగే కళ అంటాను. వైవిధ్యం అంటూ వుండాలి గానీ, ఎప్పుడూ జీవితం అంతా పిండి రుబ్బినట్లుగా ఒకటేరకమయిన అనుభవంతో వుండకూడదు. కళ అనేది జీవితానికి ప్రాతిపదిక. జీవితాన్ని కళాత్మకం చేసుకుని హాయిని, ఆనందాన్ని అనుభవించాలిగాని 'కళ కోసరమే జీవితం' అంటూ యదార్థమయిన జీవితాన్ని యెండి మారుగయి పోయేట్లు చేసుకోగూడదు. మనుష్యుల జీవితాలలో ఎన్నో తేడాలు వుండడం మనం గమనిస్తున్నాం. అందరి జీవితాలూ ఒకే మూసలం లేవు. ప్రతి మనిషికి గాలి, వెలుతురు లాగా కొంత 'కళ' కూడా కావాలి. అంతేగాని 'కళ' కోసం గాలి, వెలుతురు దూరం చేసుకోకూడదు."

అకస్మాత్తుగా జరిగిన ఈ సంభాషణకు భానుమూర్తి ఉక్కిరి బిక్కిరి అయాడు. తరువాత అతను "అవును... అవును..." అంటూ వంత పాడాడు. ఏవేవో మెలిక మాటలు ఆడటానికి ప్రయత్నించాడు.

జీవితం, జీవితంలోని పరిస్థితులు, స్థితిగతులు, అవసరాలు, అనుభవాలు... కళవల్ల జీవితం పరిపూర్ణం అవడం, జీవితానికి 'అప్లికేషన్' లేని కళ నిర్జీవం అయిపోవడం అనే విషయాన్ని గురించి సుందరం అతన్ని మరింత ఉక్కిరి బిక్కిరి చేశాడు. ఎంతో ఒరవడిగా మాట్లాడుతూ వున్నా, ఈ 'మెటీరియల్' అంతా శకుంతలే సప్లయి చేసిందనే విషయం అతనికి అనుక్షణం గుర్తు వస్తున్నది. అందుచేత శకుంతల తన కంటే మానసికంగా ఎదిగిన మనిషేమో నని అతనికి అనుమానం గూడా వస్తోంది.

స్నేహితుల మధ్య సంభాషణ శకుంతల పక్కగదిలోనుంచి విన్నది. సుందరం మాటల్లో ఔచిత్యం ఆమెకు ఎత్తి చూపినట్లు అయింది. తన నించే 'ఎరువు' తీసుకు మాట్లాడుతున్నాడని అణుమాత్ర మయినా అనిపించలేదు. సుందరం వాటిని అంతగా 'స్వంతం' చేసుకున్నాడు.



# 20

"దేశికన్ వచ్చాడు మా యింటికి నిన్న" అన్నారు గురువుగారు గోపాలంతో.

ఆయన 'ఏమిటి సంగతి' అన్నట్లు చూశాడు.

గురువుగారు ఒక నశ్యం పట్టు పీల్చి "మీరు ఆలోచించుకో గలిగితే బాగుంటుందను కుంటున్నాడు - అతను..." అన్నారు.

"ఏ విషయం ?"

"అదేనండీ! వాళ్ళ ఊరునుంచి మన అమ్మాయికి ఒక పెళ్ళి సంబంధం తెచ్చాడు గదా అతను..."

"చాలా రోజుల కిందట సంగతి కదూ ! మర్చిపోయాన్నేను. ఏమీ అను

కోకు-అయినా ఆ సంగతి వాళ్ళకు యిది వరకే చెప్పాంకదూ?"

"అవును చెప్పాం. కానీ అబ్బాయి శకుంతల అంటే యింకా మోజుగానే వున్నాడట. రెండేళ్ళు గడిచిపోయినా ఇంకా అతను వివాహం చేసుకోలేదు. మన అమ్మాయిని దృష్టిలో వుంచుకునే మంచి సంబంధాలు వచ్చిన తోసివేస్తున్నాడని తలిదండ్రులకు క్షుణ్ణంగా తెలిసిపోయింది. మనం అంగీకరించలేదు గనుక వాళ్ళంతట వాళ్ళుగా మళ్ళీ మన దగ్గరకు రావడానికి జంకుతున్నారు. దేశికన్‌కు ఉత్తరం రాశారట..."

గోపాలం ఏమీ మాట్లాడక పోవడం చూసి గురువుగారు మళ్ళీ ఇలా అన్నారు.

"పదే పదే అడుగుతున్నారని మనం లోకువ చేస్తున్నామని అనుకుంటున్నాడు దేశికన్. అతనికి చాలా ఇష్టంగా వుంది సంబంధం మొదటి నుంచీ."

"మీరు ఏమంటారు?"

"నేను అనేదేముంది, నిమిత్త మాత్రుడిని. మీ అందరి క్షేమంకంటే కావలసింది నాకేంవుంది. అమ్మాయి సుఖపడుతుందంటున్నాడు దేశికన్. మీరు మళ్ళీ ఎందుకు ఆలోచించగూడదు బాబుగారూ!"

గోపాలం దాదాపు రహస్యం చెబుతూ వున్నట్లుగా, "ఇందులో నేను ఆలోచించేదేమీలేదు రామనాథం. అంతా వాళ్ళ అమ్మా. అన్నయ్యల యిష్టం. మీ రెంతో నేనూ అంతే. నా మాటకు ఎంత విలువో మీరు ఎరుగనిది కాదుగా" అన్నాడు.

"ఎంత మాట!"

"నిజం రామనాథం. వాళ్ళ అమ్మకు బొత్తిగా యిష్టం లేదు, యిప్పట్లో పెళ్ళి చేయడం-"

"అమ్మాయికి పాతిక దాటాయను కుంటాను."

"అయితేనేం? వాళ్ళ అమ్మ ఆలోచనలు వేరు. దానికి తందానతాన అంటాడు అబ్బాయి నేను చూస్తూ వుండడమే తప్ప యింకేం చేయలేని అసహాయుడిని-"

"మీరు గట్టిగా పూనుకుంటే"

"అబ్బాయికి వంకలు పెట్టిన తర్వాత యింక నేను చేయగలదేముంటుంది? వాళ్ళకు నచ్చిన సంబంధం దొరికితే అప్పుడు యితర బాదరబందీలు లేకుండా వుంటుంది. అంతవరకూ ఓపిక పట్టడం తప్పదు"

ఆయన జవాబు గోడమీది పిల్లి వాటంగా అనిపించింది గురువుగారికి.

"పోనీ యింకేమయినా సంబంధాలు వస్తున్నాయా?"

"వస్తునే వున్నట్లున్నాయి. అయితే ఈ సంగతులేమీ నాచెవి వరకూ రానివ్వరు."

"నేను గట్టిగా చెబుతున్నానని అనుకోకండి. దేశికన్ తెచ్చిన సంబంధమే చేయాలనీ నాకు లేదు. ఏదో ఒక సంబంధం చూసి అమ్మాయికి తొందరలో పెళ్ళి చేసేస్తే బాగుంటుందేమో ఆలోచించండి"

"నా ఉద్దేశ్యం కూడా అదే. కళ్యాణ ఘడియ రావాలిగా" —రామనాథం యింతకంటె యింకా ముందుకు వెళ్ళడం ఎలాగో తెలియక ఊరుకుండిపోయాడు.

* * *

రమణ మరో సంబంధం తీసుకు వచ్చాడు.

వరుడు ఐ.ఎ.యస్. ఆఫీసరు.

మంచి హోదా పలుకుబడి వున్న వాడు. అతనే రమణకు కూడా ఒక సంబంధం తీసుకువచ్చాడు.

శాంతమ్మ అన్ని సంగతులూ విని "అంత పెద్ద అఫీసర్లతో మనకు పొసుగుతుందా ?" అని ఊరుకుంది.

"ఐ.ఎ.యస్. వాడంటే దేశమంతా తిరుగుతూ వుంటాడు. నిలకడ అయిన ఉద్యోగం అయితే అమ్మాయి ఒకచోట ఉండటానికి వీలవుతుంది."

"అంతగా అయితే ఆయన చూసిన సంబంధంనువ్వుచేసుకో రమణా ! దానికి దీనికి జోడింపు లేదుగా" అన్నది ఆమె.

చెల్లెలికి పెళ్ళికాకుండా తాను చేసుకుందుకు ఉత్సాహం చూపలేదు రమణ. భానుమూర్తి కూడా ఈ విషయంలో తల్లిని సమర్థించాడు.

"చెల్లాయి పెళ్ళికీ, మన పెళ్ళిళ్ళకీ ముందు వెనకల పట్టింపులేదు. చెల్లాయికి అన్నివిధాల తగిన వరుడుకావాలి. మనం సామాన్యమయిన వాళ్ళం. ఎవరు యిస్తానంటే వాళ్ళను చేసేసుకోవడం బుద్ధికి లక్షణం అయిన పని-యేదోసామెత చెప్పినట్లు" అన్నాడు.

కానీ రమణ ససేమిరా ఒప్పుకోలేదు. "అంతగా అయితే నీవు చేసుకో. నాకేం వెంటనే పెళ్ళి చేసేసుకోవాలని ఉబలాటంగా లేదు. చెల్లాయికి అయిన తర్వాతనే నాది" అన్నాడు అతను ఖచ్చితంగా.

"నాకు ఎవరేనా యిస్తాననాలిగాని నిక్షేపరాయుడిలా చేసుకుంటాను" అన్నాడు ఎగిరి గంతు లేస్తూ, చిన్న పిల్లాడిలా-భానుమూర్తి.

—సుందరానికి అతను అంతపనీ చేసేస్తాడని తెలుసు.

"అయినా, భానుమూర్తీ ! నీవు యెందుకిలా జాప్యం చేస్తున్నావో నాకు సుతరామూ అర్థంకాదు" అన్నాడు.

"నీవు కూడా నన్నే అంటే నేనేం చెప్పగలను?అనుకూలమయిన సంబంధం దొరకాలంటావా లేదా ? ఏదో మగవాడన్న వాడికి కట్టేసి బాధ్యత తీర్చేసుకునేంత బరువయిపోయిందా మా కు చెల్లాయి ? అయినా మా శకుకు యిప్పుడప్పుడే పెళ్ళి యిష్టంలేదు కూడాను"

"నీతో చెప్పిందా అలాగని ?"

"వేరే చెప్పాలా యేమిటి ? దాని పద్ధతి మాకు మొదటి నుంచీ తెలుసుగా !"

—ఇవన్నీ వట్టి అబద్ధాలని సుందరం ఎరుగును. కానీ భానుమూర్తి లాంటి మూర్ఖుడితో చెప్పడం ఎలా, విసుగు అనిపించింది అతనికి.

"పోనీ మీరే యేదయినా మంచి సంబంధం తీసుకురండి. కాదంటే నన్ను ముక్కలు ముక్కలుగా నరికి వెయ్యండి" అన్నాడు భానుమూర్తి.

—ఈ లోపల శకుంతల మనస్సు ముక్కలు ముక్కలుగా తయారయి పోతుందని అనుకున్నాడు సుందరం.

"నువ్వు శకుంతల అభిప్రాయం కనుక్కోవడం మంచిదనుకుంటాను, భానుమూర్తీ!"

"చిన్నపిల్ల దానికేం తెలుసు ! మా అమ్మగారు కనుక్కుంటూనే వున్నారు అక్కడికీ. ఇవన్నీ పెద్దవాళ్ళుఆలోచించవలసిన విషయాలు గదా, మనం జోరబడితే యేం బాగుంటుంది, చెప్పు" అన్నాడు భానుమూర్తి.

కందకు లేని దురద కత్తిపీటకు




ఎందుకయ్యా అని అతని అభిప్రాయం-అని సుందరం గ్రహించుకున్నాడు.

ఎవరు కండ ? ఎవరు కత్తిపీట ??



# 21

శకుంతలకు తన మీద తనకే కోపం.

మనసులో క్రోధం పెరిగిపోతోంది.

తెగబడి మాట్లాడడం చేతకాక మనసును నొక్కుకుని కూర్చోలేక జ్వరం తెచ్చుకుంది.

రోజంతా భోజనం లేదు.

తల్లి లాంఛనంగా రెండు మూడు మార్లు పలుకరించింది. భానుమూర్తి ఏవో నాలుగు మందు మాత్రలు తెచ్చి యిచ్చాడు. ఆమెకు యివేవీ స్వాస్థ్యం కూర్చలేదు.

ఆమె మనసంతా చికాకుతో నిండిపోయింది

ఏవో వెర్రి వెర్రి ఆలోచనలు.

ఎక్కడకో పరుగెత్తుకు పోవాలనీ... ఈ యిల్లు, మనుష్యులు, సంగీతం ...వీటన్నిటికీ దూరంగా వెళ్ళిపోవాలని అనిపిస్తుంది.

అయితే యివన్నీ మనసులో పరిగెత్తే ఆలోచనలేగాని క్రియ దగ్గరకు వచ్చేసరికి తాను అశక్తురాలు. ఈ సంగతే ఆమెకు మరింత నిస్పృహకు కారణం అవుతోంది.

తనకు సహాయపడేవాళ్ళు ఎవరూలేరు.

ఇంట్లోవాళ్ళకే తన సంగతి ఏమీ పట్టదు. బయటి వాళ్ళకేం కావాలి?

రాజేశ్వరి లాంటి వాళ్ళు ఎంత అదృష్టవంతులు.

సుందరంలాంటి వాళ్లు ఎంత మంచి వాళ్ళు.

తాను వాళ్ళ మాదిరిగా ఎందుకు వుండలేక పోతోంది? వాళ్ళకన్నా ఎక్కువగా ఐశ్వర్యం వున్నా, సదుపాయాలు వున్నా తన మనస్సుకు యెందుకు సుఖం లేదు.

తనకు యీ శాపం యెందుకో అర్థం కాదు— శకుంతలకు.

ఏదో ఒకటి చేయకపోతే తాను సమాధానపడేట్లు లేదు. మనసులోని ఆలోచనలన్నీ తనను నిర్దాక్షిణ్యంగా కాల్చివేస్తున్నాయి. భయాలు, ఆందోళనలు భీకరాకారంతో తన చుట్టూ తిరుగాడుతున్నాయి.

తనకు పిచ్చెత్తిపోతుందేమో అని పిస్తోంది.

ఎవరికి చెప్పుకోవాలి?

ఏం చెప్పుకోవాలి?... చెప్పుకోకుండా వుండడం ఎలా??

ఆమె ఈ సమస్యల సంధిలో పడిపోయింది.

ఈ సంధికి అవతల వెలుగే వుందో కాక పెనుచీకటే వుందో తెలియదు.

* * *

శకుంతలలో వస్తున్న మార్పులన్నీ శాంతమ్మ గ్రహించ లేదనడానికి లేదు ఎంతయినా ఆమెదీ స్త్రీ హృదయమే. పైపెచ్చు మాతృమూర్తి.

జరుగుతున్న దాంట్లో-తమ ఆలోచనలలో యేదో కృత్రిమత్వం, అసహజత్వం వున్నట్లు ఆమెకు సూచనగా, చూచా

యిగా తెలుసు. అయితే ఇవన్నీ పైకి మాట్లాడడానికి జంకు.

గోపాలం చెబుతూవున్న సంగతు లయినా వున్నవి వున్నట్లుగా అంగీక రించేందుకు – ఆలోచించేందుకు ఆమెకు కుదరదు, ధైర్యం చాలదు.

"నువ్వు బొత్తిగా యదార్థం గమ నించలేక పోతున్నావు" అన్నాడు గోపాలం ఒకమారు.

"ఏం గమనించడమో రమణది ఎదుగు బొదుగులేని జీవితం. భాను మూర్తికి ఇంకా కుదురు ఏర్పడనేలేదు. వాడిదంతా అదో ధోరణి..."

"అదిసరే. శకుంతల ఏమీ సంపాదన లేని మనిషి అయినట్లయితే..."

—శాంతమ్మకు ఈ మాట తలుచు కుందుకే జంకు. ఈ రోజు ఇంట్లో అందరూ యీ మాత్రం వెలుగు చూస్తు న్నారంటే శకుంతల కారణంగానే గదా!

ఆయన ఆరోగ్యంగా లేచి తిరుగ గలగటం – ఎవరయినా ఊహించారా అసలు?

"మాట్లాడవేం? అమ్మాయికి ఈ సంపాదనే లేక పోయినట్లయితే మనం యేం చేసే వాళ్ళం? ఏదో గంతకు తగ్గ బొంత అని దాన్ని ఎవడికో కట్టబెట్టి చేతులు దులిపేసుకునే వాళ్ళం కాదూ?"

కాదని ఎలా అనడం?

—శాంతమ్మ ఆలోచించు కుంది.

పెళ్ళియీడు పిల్ల గుండెల మీద కుంపటిలా వుందని చెబుతూ వుండే వాళ్ల పూర్వం. కానీ ఈ రోజులలో, సంపాదనా పరులయిన అమ్మాయి మెడలో పూలహారం లాంటిది గదా!

శాంతమ్మకు అప్పుడప్పుడు వివేకం బయలుదేరుతూ వుంటుంది-అందరమూ కలిసి శకుంతలకు అన్యాయం చేస్తు న్నామా అని ఆలోచించేది.

కానీ భర్తముందు ఈ 'ముడు'లన్నీ విప్పటానికి ఆమెకు చేత కావడంలేదు.

"మీరు మరీ చోద్యంగా చెబు తున్నారు. అమ్మాయికి మనమేం తక్కువ చేస్తున్నాం? అన్నివిధాల తగిన సంబం ధం దొరకడం తోనే..."

...ఇదంతా మామూలు పురాణమే.

గోపాలం వినిపించుకోలేదు.

శాంతమ్మ మనసు ఆయన ధోరణికి చికాకు అయిపోయింది.

కానీ ఈ చికాకు ఆమెను మంచి పనికి ప్రేరేపించ లేకపోతోంది.

శకుంతల అంటే మరింత ఆప్యా యంగా వుండడానికి ప్రయత్నిస్తుంది ఆమె– ఈ చికాకు మరచి పోవడానికి. శకుంతల పాలిటికి ఇదే మెత్తని ఉరి తాడు అనిపిస్తుంది ఈ ఆప్యాయత!

* * *

"రండి మీ కోసమే చూస్తున్నాను" అన్నాడు రమణ.

"ఏమిటి విశేషం" అంటూ కూర్చు న్నాడు సుందరం.

"ప్రత్యేకించి ఏమి లేదు. ఇందాకటి నుంచి ఒక్కడిసీ కూర్చున్నాను. ఏమీ తోచడం లేదు."

"భానుమూర్తి ఎక్కడ?"

"ఇంట్లో లేడు. పెళ్ళి సంబంధాలు వెదకడానికి వెళ్ళాడేమో!" నింపాదిగా అన్నాడు రమణ.

సుందరానికి కాస్త ఆశ్చర్యం అనిపిం చింది.

"ఎవరికి?"

"ఎవరికో ఎందుకు? తనకే!"

— సుందరానికి నాలుగు రోజుల క్రితం జరిగిన సంభాషణ గుర్తుకు వచ్చింది. బహుశ యింకేదో తర్వాత కూడ జరిగివుంటుందనుకున్నాడు. తనంత తాను అడగడానికి రమణతో అతనికి అంత చొరవలేదు.

"శానుమూర్తి మిమ్మల్ని ఏమయినా అడిగాడా?"

"నన్నెందుకు అడుగుతాడు? పైకి ఏదో చూస్తూవున్నట్లు కనిపించడమేగాని, లోపల ఇటువంటివి సుతరామూ జరగకుండా వుండే పరిస్థితి కావాలనే వాళ్లు ప్రయత్నిస్తున్నారు ఎంతసేపూ!"

"ఎందుకని?"

"తెలియనట్లు అడుగుతారేం? ఇదంతా ధనదాహం! ఈ ఇంట్లో అందరికీ ఒకటే దాహం. ఎంత తాగినా దప్పిక తీరదం లేదు"

సుందరం ఏమీ మాట్లాడలేదు.

"నాకు తెలియక అడుగుతాను, సుందరం గారూ! మనుషులు యింత స్వార్థపరులు యెందుకు అవుతారు? మీరు చెప్పగలరా?"

"ప్రత్యేకించి కారణం ఏముంటుంది? మానవ స్వభావంలో అదో భాగం. కాకపోతే అది ప్రధానంగా కనిపిస్తూ వుంటుంది."

"అందరి బాగూ ఆలోచించటం తప్పంటారా?"

"తప్పు కాదు. చాలా మంది ఆ పని చేయరు. వాళ్ళకు ఆ ఆలోచనే రాదు."

"మీరేం అనుకోనంటే చెబుతాను. నాకు శకుంతలను చూసినప్పుడల్లా బెంగ అనిపిస్తుంది ... కానీ ఏం చేయగలను నేను? నా వల్ల ఏం అవుతుంది?"

సుందరం నవ్వేశాడు ప్రయత్నపూర్వకంగా.

"ఎందుకంత బెంగపడిపోతున్నారు మీరు? నాకేం కారణం కనిపించదే!"

"నన్ను సమాధాన పరచటానికి ప్రయత్నించకండి. నాకు శకుంతల ఆలోచనలు తెలుసు. దాని మనసు కాస్తో కూస్తో అర్థం చేసుకోగలను. కానీ యేం లాభం?"

సుందరం యేం మాట్లాడలేదు.

"శకుంతల అడవిలో పూసిన మల్లెపూవులా వాడిపోవలసిందేనా?— అనుకుంటూ వుంటాను నేను అప్పుడప్పుడు.

అతని కవితా హృదయానికి ఆశ్చర్యపోయాడు సుందరం.

అతనితో యిన్నాళ్ళూ తనకేమంత పరిచయం లేకపోవడం గొప్ప లోటు అనిపించింది అతనికి ఆ క్షణంలో.

"అబ్బే! లాభం లేదు మాస్టారూ! వాళ్ళు శకుంతలకు పెళ్ళిచేయరు. ఆ శుభకార్యం జరగనివ్వరు. నాకు దాన్ని చూస్తే కడుపు తరుక్కుపోతోంది".

"మీరు అనవసరంగా ఆవేశపడుతున్నారనుకుంటాను. దేనికైనా సమయం రావాలిగా, మంచి సంబంధంకోసం..."

"మంచి...మంచి...! నాకు చెప్పకండి ఇవన్నీ. వాళ్ళ మనసులు నాకు క్షుణ్ణంగా తెలుసు".

సుందరం కుతూహలంగా వింటున్నాడు.

"శకుంతల శుభం కోరుకోవడంతప్ప నేను యింకేం చేయలేను. మొదటినుంచి అసమర్థుడినే యీ యింట్లో".

సుందరానికి కాస్త ఊపిరి తిరిగి

సట్లయింది.

"మీరు శకుంతలకు శుభం కోరితే చాలు, అదే కొండంత బలం ఆమెకు"—

అయినా అతన్ని ప్రోత్సహించడం ఎలాగో సుందరానికి తట్టడం లేదు.

"నాకు దాని మనసు బాగా తెలుసు. శకుంతలకు తనను ప్రేమించే మనిషి కావాలి సుందరంగారూ! డబ్బు, గౌరవం, పరువు, ప్రతిష్ట...ఇలాంటివి దానికి లెక్కలేదు".

'ఈ విషయం నాకు కూడా తెలుసు' అనుకున్నాడు సుందరం.

"శకుంతలకు మీలాంటి మంచి మనిషి మంచితనం.... ప్రేమ.... చూపించగల మనిషి దొరికితే ఎంత బాగుండును" అన్నాడు రమణ.

సుందరం మనసు ఒక్కమారు ఉలిక్కిపడింది.

"నేనేమీ ఊహించి చెప్పడం లేదు సుందరంగారూ! శకుంతల మనస్సు విప్పి చెప్పుతున్నాను. శకుంతలకు మీరంటే యిష్టం, ప్రేమ...మీతో తప్ప యింకెవరితోనూ ఆత్మీయంగా వుండ లేదు"

శకుంతల అంటే తనకు యీ రక మయిన ఆత్మీయతలు వున్నాయన్నంత రూఢిగా సుందరానికి యీ విషయం తెలియదు. రమణ నోటివెంట ఈ సంగతి వినడం అతనికి ఆనందంగా వుంది. కానీ అతను దేనికి 'లీడ్' చేస్తున్నాడో కాస్త తికమక అనిపించింది సుందరానికి.

"నామీద అభిమానంతో మీరు ఇలా

అంటున్నారు. శకుంతల ముందు నేను ఎంతటివాడిని!"

"నాకు ఇతర విషయాలు యేమీ తెలియవు. కాని శకుంతల మనసులో మీరే నిండి వున్నారన్న సంగతి మటుకు నాకు స్పష్టంగా తెలుసును. దాపరికం లేకుండా ఇలా చెప్పవలసి వచ్చినందుకు ఏం అనుకోకండి."

—సుందరం ఉక్కిరి బిక్కిరి అయినాడు

"కానీ రమణగారూ! శకుంతలకు నేను తగను"

"మిమ్మల్ని నేను బలవంతం చేయ డంలేదు. కానీ శకుంతల సుఖపడాలంటే, మామూలు మనిషిగా మళ్ళీ తయారవా లంటే, ఇదొక్కటే మార్గం అని నా నమ్మకం. పైన దాని అదృష్టం ఎలా వుందో ఆ పరమాత్ముడికే తెలియాలి!"

శకుంతల కళ్ళల్లో యీమధ్య కని పిస్తున్న నిరాశ నిస్పృహలు అన్నీ సుందరం ముందుకు వచ్చి నిలుచు న్నట్లయింది.



## 22

సుందరానికి కళ్యాణి రాగ ప్రస్తారం వినిపిస్తోంది. తనను సంగీతం లోనికి యీడ్చుకు వెళ్ళిన రాగం కనుక ఆ రాగ మంటే అతనికి మక్కువ ఎక్కువ.

అతను వెళ్ళేటప్పటికి ఆమె కళ్ళు మూసుకుని పాడుతోంది. చప్పుడు చేయ కుండా ఒకపక్క కూర్చున్నాడు. అయిదు నిమిషాల అనంతరం ఆమె కళ్ళు తెరిచి అతన్ని గమనించింది.

"ఎంతసేపయింది వచ్చి?" అన్నది పాడటం ఆపుచేసి.

"యిప్పుడే"

"క్షమించండి. నేను గమనించలేను"

"పాట పూర్తి చేయండి"

శకుంతల ఆప్యాయంగా నవ్వింది.

సుందరం శ్రద్ధగా వింటూ కూర్చు న్నాడు. అతని మనస్సు ఎక్క డెక్కడికో తేలిపోతోంది.

మనిషి పట్ల ఆరాధన, సంగీతం పట్ల ఆలంబన, మనసు పొందుతూవున్న ఉత్సాహం - యివి మూడూ అతన్ని ముప్పేటలుగా పెనవేసుకు పోతున్నాయి.

ఆమె పాట ముగించిన తర్వాత, యిద్దరూ కాఫీతాగి కూర్చున్నారు.

"వంట్లో బాగుండ లేదని తెలిసింది. ఎలా వుంది యిప్పుడు-"

—సుందరం ఒక వారం రోజులుగా యిటురాలేదు. అతనంతట అతను ఆలోచించుకుని ఒక నిర్ణయానికి రావడానికి ఈ మాత్రం సమయం పట్టింది. పైగా ఆఫీసు పనుల వత్తిడి వుండనే వుంది.

"చూస్తున్నారుగా!" అంది శకుంతల కాస్త నీరసంగానే.

"మీరు కావాలని నిరుత్సాహం పెంచు కుంటున్నారు. మీరు యిలావుంటే సంగీత సరస్వతి కూడా కోపం వస్తుంది."

"సాధ్యమయినంత నిరామయంగా నిలదొక్కుకుని వుందామనే ప్రయత్నం చేస్తున్నాను...కానీ..."

"కానులు, బేడలు పోయి పదిహేను ఏళ్ళయిపోయింది..."

శకుంతల నవ్వింది.

"అవి పోయినా సరే-వాటి స్థానంలో పైసలు వచ్చాయిగా. పేరులో తేడాగాని విలువల మారకం వుండనే వుందిగా" అంది.

"ఏదో ఒక నాణెం వుండకపోతే ఎలా ?"

"అవునుమరి! కాకపోతే వ్యవహారం జరగదు !"

"సరే పోనివ్వండి. ఇంకేమిటి?..." అడిగాడు సుందరం, మాట మారుస్తూ.

"అంతా మామూలే"

"మామూలుకు భిన్నంగా యేమీ చేయలేమా ?"

శకుంతల జవాబు చెప్పలేదు. నవ్వి వూరుకుంది. ఆ నవ్వులోనే అతనికి కావలసిన స్ఫూర్తి దొరికింది.

* * *

గోపాలం వరండాలో కూర్చొని న్యూస్ పేపరు చూస్తున్నాడు.

ఆరోజు ఉదయం తొమ్మిది గంటలకే శకుంతల బయటకు వెళ్ళింది. భానుమూర్తి యింట్లోనే వుండి ఏవో లెక్కల పత్రాలు చూసుకుంటున్నాడు.

పదకొండున్నర ప్రాంతంలో సుందరం అక్కడకు వచ్చాడు. అతడు ఒక్కడే రాలేదు. వెంట శకుంతల కూడా వుంది. వాళ్ళిద్దరూ ఒకే టాక్సీలో దిగారు. అయితే ఇంటికి ముందు టాక్సీ ఆగడం, వాళ్ళిద్దరూ దిగిరావడం ఎవరూ గమనించినట్లు లేదు.

సుందరం లోపలకు వస్తూనే గోపాలంగారి పాదాలకునమస్కరించాడు.

అతని వెనకనే శకుంతల కూడా అలా చేసింది.

సుందరం "పెద్దవారు, మీరు మమ్మల్ని నిండు మనసుతో ఆశీర్వదించాలి!" అన్నాడు.

హఠాత్తుగా జరుగుతున్న ఈ సంఘటనకు గోపాలంగారికి ఒక్క నిమిషం తికమక అయిపోయింది. కళ్ళ ఎదురుగా కనిపిస్తూ వున్నది అర్థం చేసుకుందుకు కొంత సమయం పట్టింది. అర్థం అయిన మీదట ఆయన మనసులో యెటువంటి భావాలు కలిగిగాయో చెప్పడం కష్టం.

"శాంతా...శాంతా..." అని పిలిచాడు.

శాంతమ్మ లోపలనుండి వచ్చింది.

ఆమె రావడంతోటే "త్వరగా అక్షంతలు కలిపి తీసుకురా!" అన్నాడు.

ఆమె ఎందుకని అడగకుండానే లోపలకు వెళ్ళింది. మరు క్షణంలో పసుపు పచ్చని అక్షంతలు కలిపిన పళ్ళెం తీసుకు వచ్చింది. గోపాలం చేతినిండా అక్షంతలు తీసుకుని సుందరానికి, శకుంతలకు తలమీద చల్లి "చిరకాలం చల్లగా వర్ధిల్లండి" అంటూ ఆశీర్వదించాడు.

అసలు జరిగిన దేమిటో అప్పటిగాని శాంతమ్మకు అర్థం కాలేదు. ఆమెకు అవగాహన అవకుండా వున్న స్థితిలోనే వధూవరులు ఆమె పాదాలకూ నమస్కరించారు. ఆమె యాంత్రికంగా అక్షింతలు చల్లి ఆశీర్వదించింది.

సుందరం "మేం తొందర పడ్డామనుకుంటే క్షమించండి. కానీ యిప్పటికే ఆలస్యం అయిపోయింది. శకుంతల మీకు యేమీ చెప్పలేదని నాకు తెలుసు. నేనయినా చెప్పే అవకాశం లేకుండా పోయింది" అన్నాడు.




శాంతమ్మ శకుంతల వైపు చూసింది.

శకుంతల తప్పు చేసిన దానిలాగా తలవంచుకుని నిలుచుంది సిగ్గులో మునిగిపోయి.

ఈ హడావిడికి లోపలనుంచి భానుమూర్తి వచ్చాడు. ఇక్కడి వాతావరణం చూసి అతని గుండెలు గుభేలుమన్నాయి.

"ఏమయింది ? ఏమయింది ?" అని అడిగాడు అతి ఆదుర్దాగా.

సుందరం "భానుమూర్తీనువ్వు నాకు ప్రాణ స్నేహితుడివి. అయినా నీకు చెప్పకుండా మేం ఇద్దరం వివాహం చేసుకున్నాం'' అన్నాడు.

"వివాహమా?" అన్నాడు భానుమూర్తి గుడ్లు అప్ప చెప్పి. తరవాత అవాక్కు అయ్యాడు.

"అవును భానుమూర్తీ! ఇప్పుడే అరగంట క్రితం రిజిష్టార్ ఆఫీసులో మా వివాహం జరిగింది. అవును! నిజంగా! రెండు నిమిషాల క్రితం మీ అమ్మానాన్న గారు ఆశీర్వదించారు కూడా-"

భానుమూర్తి ఒక్క మారు తలిదండ్రుల వంక చూశాడు పరీక్షగా. వాళ్ళు ఈ విషయాన్ని ఎలా తీసుకుంటున్నారు అనే దాన్ని అంచనా వేయడానికి ప్రయత్నించాడు.

"మీరు చాలా తొందర పడ్డారు" అంతకంటే ఈ విషయంలో తన అభిప్రాయాన్ని తెలియపరచడం ఎలాగో భానుమూర్తికి వెంటనే తెలియలేదు.

"నీవు యీమాటే అంటావని శకుంతల ముందుగానే చెప్పింది సుమా!" అన్నాడు సుందరం.

తర్వాత అతను, ఈ రోజే యీ పని ఎందుకు చేయవలసి వచ్చిందీ, యిలా చేయకపోతే శకుంతల యెందుకూ పనికి రాకుండా ఎవరికీ కాకుండా పోయేదీ... అంతా వివరించి చెప్పాడు. అతను శకుంతలను పెళ్ళి చేసుకోవడం ద్వారా తమ యోగక్షేమాలను కాంక్షించాను-అని చెప్పడం భానుమూర్తికి పుండు మీద కారం రాసినట్లయింది.

"నీవు శకుంతలను మాయలో పడేశావు. దానిని వెర్రిదాన్ని చేసి ఈ పని చేశావు. నాకు ఏమాత్రం ఆచూకీ దొరికినా ముందు జాగ్రత్త పడేవాడిని. స్నేహితుడిలా వుంటూ మమ్మల్ని ఇలా చాపకింద నీరులా అన్యాయం చేస్తావని ఒక్కనాడూ అనుకోలేదు సుందరం" అన్నాడు భానుమూర్తి భావావేశంతో.

ఈ మాటలకు సుందరం బదులు చెప్పగలిగే లోపలే శకుంతల అందుకుంది "అన్నయ్యా ఎందుకు లేనిపోని ఆవేశం తెచ్చుకుంటావు? మా మనసులకు మంచిదనిపించిన పని చేశాం. ఇందులో ఆయన చేసిన అన్యాయం గానీ అక్రమంగానీ ఏమీలేదు. అమ్మా నాన్నలలాగ నీవు కూడా మంచితనంగానేవుంటే బాగుంటుంది" అన్నది.

శకుంతల నోరు విప్పి ఇలా సూటిగా మాట్లాడడంతో భానుమూర్తి చాలా దెబ్బ తిన్నాడు. కానీ అతని ఆవేశం మటుకు అణగలేదు.

"అమ్మా నాన్నలలాగ నేను నోరు మూసుకుని వుండలేను. నీ బాధ్యత వాళ్లకన్నా నాకు ఎక్కువ వుంది" అన్నాడు భానుమూర్తి.

సుందరం తమాషాగా నవ్వి- "ఎవరైనా వింటే నవ్విపోతారు. ఊరికే అవివేకంగా మాట్లాడి పెళ్ళి వాళ్ళను నొప్పించకు" అన్నాడు.

తల్లీ,తండ్రి మాట్లాడకుండా వుండడం యిప్పుడు భానుమూర్తికి కొట్టవచ్చి నట్లుగా కనిపిస్తోంది.

"మీరు... మీరు... యేం మాట్లాడరేం? పెళ్ళి అంటే ఎన్ని విషయాలు చూడాలి? ఎంత ఆలోచించాలి?? ఎంత జాగ్రత్త పడాలి??? ఇలా జరగడం నాకు సుతరామూ యిష్టంలేదు" అన్నాడు భానుమూర్తి. అతను యింకా ఆవేశంతో ఊగిపోతూనే వున్నాడు.

గోపాలం గంభీరంగా "నీకూ నాకూ యిష్టంలేదని చెప్పి ప్రపంచం అంతా స్తంభించి పోతుందా యేమిటయ్యా. అమ్మాయి విషయంలో నీకేదో బాధ్యత వున్నదన్నావే-నువ్వు యిన్నాళ్ళూ నెరవేర్చిన బాధ్యత యేమిటో కాస్త చెప్పు. అమ్మాయి తనకు కావల్సినదేదో తానే తెచ్చుకుంది. అనవసరంగా నోరు పారేసుకుని మరింత వెర్రివాడివి కాకు" అన్నాడు.

గోపాలం మాట్లాడనే మాట్లాడడు. కాని మాట్లాడితే తిరుగు వుండదు.

"మీరు మమ్మల్ని బాగా అర్థం చేసుకున్నారు బాబుగారూ!" అన్నాడు సుందరం.

శాంతమ్మ "నేనూ అర్థం చేసుకున్నాను. కానీ నాకు మాటలు రావు. అమ్మాయి సుఖపడుతుందని నాకు ధైర్యంగా వుంది" అన్నది.

భానుమూర్తి తల వంచుకుని కూర్చున్నాడు.

"నాన్నగారి మాటలకు నీవేం చిన్నబుచ్చుకోకు భానుమూర్తీ.ఇందులోఎవరికీ యేమీ అన్యాయం జరగలేదు. శకుంతల ఏం కావాలని కోరుకొంటోందో అదే జరిగింది. నేనూ మీ కందరికీ గొప్ప ఉపకారం చేశానని చెప్పకోవడంలేదు, అవకాశం వచ్చినప్పుడు మాత్రం, జారవిడవకుండా చెయ్యి చాచాను. అంతే-శకుంతలను డబ్బుకోసమే నేను పెళ్ళి చేసుకున్నానని అనుకుంటున్నావుగదూ భానుమూర్తీ' శకుంతలకు యిప్పుడు డబ్బేమీలేదు. అన్ని ఎకౌంట్లూ మీ నాన్నగారి పేరు మీదికి బదిలీ చేయించింది. ఆ డబ్బుతో ఒక రకంగా శకుంతల మీ ఋణం తీర్చుకున్నది. ఇప్పుడు శకుంతల పేదవాడిని, అతి సామాన్యుడిని అయిన నా భార్య. నన్ను చూచి నీవేం అసూయపడనక్కర్లేదు-"

గోపాలం వంకతిరిగి "బాబుగారూ! మీరు పెద్దవారు మీకు చెప్పవలసింది ఏమీ లేదు. అంతా శకుంతల యిష్టప్రకారమే చేశాను. ఇందులో నాకేం స్వార్థంలేదు, మీరు సెలవు యిస్తే యిక మేం వెళ్ళి వస్తాం" అన్నాడు.

"అప్పుడేనా? భోజనాలు చేసి వెళ్ళండి" అన్నాడు గోపాలం.

"అవును వంట అయింది. అంతా సిద్ధంగా వుంది. అందరూ లేవండి" అంటూ శాంతమ్మ లోపలకు వెళ్ళింది.

శకుంతల నును సిగ్గుగా సుందరం వంక చూసింది. సుందరం కళ్ళతోనే సమాధానం చెప్పాడు.

"నాకు తెలుసును, అమ్మాయి అదృష్టజాతకురాలని నేను మొదటి నుంచీ చెబుతూనే వున్నాను. శుక్రుడు వ్యయంలో వున్నాడు గనుక ఈమాత్రం ఆలస్యం అయింది, అంతే!" అన్నాడు గోపాలం కుర్చీలో నుంచి లేస్తూ.

గడియారం పన్నెండు గంటలు కొట్టింది.



# పోస్ట్...! పోస్ట్...!






"పోస్ట్" అనే కేక వినగానే చాలా మందికి ప్రాణాలు లేచివస్తాయి. ప్రతిరోజూ పోస్ట్‌మేన్ రాక కోసం ఎందరెందరో ఆతృతగా ఎదురు చూస్తుంటారు. దూరదూర ప్రాంతాలలో ఉన్న తమ బంధువులు, మిత్రులు, ఆత్మీయులు - తమకు రాసే ఉత్తరాల్ని పోస్ట్‌మేన్ ద్వారా అందుకుని, అందులో సంగతుల్ని తెలుసుకోవాలని ఉవ్విళ్ళూరుతుంటారు. మనమీనాడు ఇలా ఎదురు తెన్నులు చూసే 'ఉత్తరాల' వెనుక బోలెడు చరిత్ర ఉంది.

ఎడిటర్
'చతుర'

पिन PIN



ప్రేమికుల మధ్య సందేశాలను అందజేసేందుకు మేఘాలు ఉపయోగ పడినట్లు మహాకవి కాళిదాసు తన 'మేఘసందేశం'లో రాశాడు. అది కావ్యాల్లో చెప్పుకున్న కథ!

నూటయాభై ఏళ్ళ క్రితం వార్తాహరుడిని పంపి దూర ప్రాంతాల సమాచారం తెలుసుకో వలసి వచ్చేది. ఇది ఎంతో వ్యయ ప్రయాసలతో కూడిన వ్యవహారం మాత్రమేకాక, ఆ వార్తాహరుడు అడవుల్లో నుండి ప్రయాణంచేసి కొన్ని నెలలకు గానీ గమ్యం చేరగలిగేవాడు కాదు. ఏ క్రూరమృగం వాతపడినా అతను తిరిగి వస్తాడనే నమ్మకమూ ఉండేదికాదు.

పూర్వం పెంపుడు పావురాల ద్వారా లేఖలను పంపుకునే వారు. కానీ, ఆ పద్ధతి రాజులకు, ధనవంతులకు మాత్రమే పరిమితంగా ఉండేది. దానికీ ఎక్కువ వ్యయం అయ్యేది.

ఒక చోటునుంచి మరో చోటుకి వార్తలను వేగంగా చేరవేసేందుకు పూర్వం మరో పద్ధతి అమలులో ఉండేది. పిలుపు అందేంత దూరానికి ఒక వార్తాహరుడి చొప్పున వరుసగా నిలబడేవారు. మొదటి వార్తాహరుడికి ఇచ్చిన సమాచారాన్ని ఒక చిత్రమైన లిపిలో శబ్దంచేస్తూ గట్టిగా అరిచేవాడు. దాన్ని రెండవ వాడు గ్రహించి, అలాగే శబ్దంచేస్తూ మూడవ వానికి అందజేసేవాడు ఇలా ఆ సమాచారం వేగంగా అంద వలసిన చోటుకి చేరేది. ఇదికూడా చాలా శ్రమతో కూడుకున్న పద్ధతి.

1639లో మొదటి సారిగా అమెరికాలో వార్తలను చేరవేసే విధానాన్ని ప్రవేశపెట్టారు. 1672లో న్యూయార్క్, బోస్టన్ నగరాల మధ్య వార్తాసంబంధాలు జరుపుకునేందుకు పోస్టల్ మార్గంవేశారు. వార్తలను చేరవేసి తిరిగివచ్చేసరికి ఒక నెల రోజులు పట్టేది.

1766లో లార్డ్‌క్లైవ్ ప్రభుత్వ వ్యవహారాల నిమిత్తమే భారతదేశంలో మొట్టమొదటి సారిగా 'తపాలపద్ధతి'ని ప్రవేశపెట్టాడు. 1837 నాటికి దానిని దేశ ప్రజలకు కూడా ఉపయోగ పడేలా అమలులోనికి తీసుకు వచ్చాడు. 1847 లో పోస్టల్ స్టాంపు రూపొందింది. ఇండియాలో 1852 నుండి సింధ్‌లో పోస్టల్ స్టాంపులు తయారయ్యేవి.

1839 కి ముందు ఉత్తరాలను కవర్‌లోపెట్టి పంపవచ్చునన్న విషయం ఎవరికీ తట్టలేదు. కాగితానికి రెండువైపులా మడచి, దానిమీద మైనంతో సీలువేసి అవతలివైపు చిరునామా రాసేవారు. స్టాంపులు అంటించిన కవర్లలో ఉత్తరాలు పెట్టి పంపే పద్ధతి 1853లో ప్రవేశపెట్టబడింది.

రిజిష్టర్డు లెటర్లు 1855లోను, మనీ ఆర్డర్ పద్ధతి 1864లోను అమలులోకి వచ్చాయి.

'ఆంథోనీ ట్రోల్లోప్' (1815-82) అనే ఇంగ్లీషు నవలా రచయిత 'పోస్టు డబ్బాల'ను పెట్టమని తపాలా సంస్థ వారికి మొదటిసారిగా సలహా ఇచ్చాడట.

1873లో ప్రపథమంగా పోస్టుకార్డు వాడుకలోకి వచ్చింది. రిప్లై పోస్టుకార్డు పద్ధతి 1892లో పరిచయం చేయబడింది

1870 నుండి 1891 వరకు ఆఫ్ఘనిస్తాన్‌లో పోస్టుమాస్టర్లు కవర్ మీది స్టాంపును ఓ మూల నోటితో కొరికేవారు. అదే ఆనాటి పోస్టుముద్ర. క్రమ








క్రమంగా ముద్రలువేసే పద్ధతి అమలు లోకి వచ్చింది.

పోస్టల్ స్టాంపులను గురించి తెలుసు కోదగిన ఆసక్తి కలిగించే విషయాలు ఎన్నో ఉన్నాయి.

రెండవ ప్రపంచ యుద్ధానికి పూర్వం కొరియా దేశపు స్టాంపులలో జపాన్ పెత్తందారీ మనస్తత్వం అధికంగా కన పడసాగటంతో కొరియా దేశభక్తులు పోస్టాఫీసుల మీదపడి వాటిని ధ్వంసం చేశారు.

స్టాంపులద్వారా గూఢచారులు రహస్య సందేశాలను పంపుకొనేవారు. రెండో ప్రపంచ యుద్ధకాలంలో గూఢచారులు శత్రుదేశాల సైనికులకు సరఫరా అయ్యే స్టాంపుల వెనుక జిగురులో కలిసి పోయేలా విషం పూసేవారు. కవర్లకు స్టాంపులు అంటించే సైనికులు వాటిని నాలుకకు తగిలించుకున్న వెంటనే మర ణించేవారు.

1913 లో మొదటిసారిగా పోస్టల్ పార్సిల్ పద్ధతి కెనడాలో ప్రవేశ పెట్టారు. ఎయిర్‌మెయిల్ సర్వీస్ 1918లో ప్రారంభమైంది.

ప్రాథమిక దశలో ఉత్తరాలు చేర వలసిన దూరాన్ని బట్టి పోస్టల్ రేట్లు నిర్ణయించేవారు. కాలక్రమేణ కొన్ని మార్పులతో దేశం మొత్తం మీద ఒకే పోస్టల్ రేట్లు ఉండేలా ఏర్పాటు జరి గింది.

హాలండ్ పోస్టలుశాఖవారు ఈ మధ్య పదిహేనువేలమంది అదనపు తపాలా బంట్రోతుల్ని తర్ఫీదిచ్చి నియమించు కున్నారు. వారిపని ఏమిటంటే—ఇంటిం టికీ వెళ్ళి, ఒంటరి జీవితం గడుపుతున్న వృద్ధుల్నీ, పిల్లలచేత నిర్లక్ష్యం చేయబడి

దిక్కులేని జీవితం గడుపుతున్న ముసలి తల్లి దండ్రుల్నీ పరామర్శించి, వారికి కావలసిన పనులు ఉచితంగా చేసి పెడుతూ, వారు జీవితాల్లో ఏ నిరాశనీ పొందకుండా శాయశక్తులా కృషి చేయడం అన్నమాట.

మన దేశంలో రోడ్డు, రవాణా సౌకర్యాలున్న పట్టణ ప్రాంతాలలోనేకాక పల్లెల్లోనూ, కొండ ప్రాంతాలలోనూ, గిరిజన, వెనుకబడిన ప్రాంతాలలోనూ పోస్టాఫీసులు తెరిచారు.

గ్రామాలకు మూడు కిలోమీటర్ల దూరంలోగల కొండ ప్రాంతాల్లోను కొత్త పోస్టాఫీసులు ప్రారంభించారు. ఒక్క గ్రామ పంచాయితీలకే కాక 2,000 జనాభాగల ప్రతి గ్రామానికీ, గిరిజన, వెనుకబడిన ప్రాంతాలలో 1,000 జనాభా ఉన్నచోట కూడా ఈ సౌకర్యాలు కలుగజేశారు.

1975 సంవత్సరాంతానికి మన దేశం మొత్తం మీద ఉన్న 1,17,222 పోస్టాఫీసులలో 11,509 గ్రామప్రాంతాలలోనివే ఉన్నాయి. రాత్రిపూట కూడా పనిచేసే పోస్టాఫీసులు 131, సంచార తపాలాకార్యాలయాలు 18 ఉన్నాయి. దేశం మొత్తం మీద 1,01,120 తపాలా పెట్టెలు ఏర్పాటు చేయబడ్డాయి.

తపాల తీసుకువెళ్ళే మొత్తం 733 వాహనాలలో 57 మాత్రం పట్టణ ప్రాంతాలకు కేటాయింపబడ్డాయి. భూభాగం మీద 8,40,000 కిలోమీటర్ల దూరంలో 16 శాతం రైళ్ళమీద, 34 శాతం మోటారు వాహనాలమీద, 34 శాతం పాదచారులు, 16 శాతం బోట్లు ఒంటెలు, గుర్రాలు, సైకిళ్ళ మీద తపాలా సౌకర్యాలు ప్రజలకు అంద



జెయబడుతున్నాయి. మారుమూలప్రాంతాలలో ఉన్న ప్రజల సౌకర్యం నిమిత్తం సంచార తపాలా కార్యాలయాల్ని నెలకొల్పారు. 1977లో 15,000 సంచార తపాలా కార్యాలయాలు, 1978 లో 67,729 సంచార తపాలా కార్యాలయాలు ఏర్పాటుచేశారు. 10 గ్రామాల్లో తొమ్మిదింటికి ప్రతిరోజూ మెయిల్ సర్వీస్ సౌకర్యం ఉంది.

అస్సాంకుచెందిన 'కుమ్‌తారి' అనేఊరుకు 'జకలబన్దా' అనేఊరికీమధ్యఅరవైనాలుగు కిలోమీటర్ల దూరంఉందట. ఈ రెండు ఊళ్ళ మధ్య తపాలు బట్వాడా కేవలం సైకిలు మీదనే జరుగుతుంది. ప్రొద్దున్నే ఓ పోస్టుమేన్ సైకిల్ మీద ఆ 64 కిలోమీటర్లు వెళ్ళి తపాలా ఇచ్చి, అక్కడి తపాలు మళ్ళీ మోసుకురావాలి. ఆ పోస్టుమేన్ తన శక్తి కొద్దీ ఈ పని ఎన్ని రోజుల్లో చేస్తే అన్ని రోజులకే ఆ ఉత్తరాల ప్రయాణం. అస్సాం రాష్ట్ర ముఖ్య పట్టణం గౌహతి నుంచి ఈ ఊళ్ళకి ఉత్తరాలు చేరడానికి పదిరోజులు పడుతుందట.

అడవి ప్రాంతాలలో నివశించే ప్రజల సౌకర్యార్థం కొన్ని సంచార తపాలా కార్యాలయాలున్నాయి. అడవిలో ఒక నిర్ణీత ప్రాంతానికి, పక్కనున్న పట్టణాల నుంచి తపాల ఉద్యోగులు గుర్రాలపై వస్తారు. ఆ గుర్రాలకే తపాలా పెట్టె ఉంటుంది. వారు ప్రతిరోజూ అక్కడికి వచ్చే సమయానికి ఉత్తరాలను పోస్టు చేయదలచిన వారు ముందుగానే వచ్చి కాచుకొని ఉంటారు. తరువాత గుర్రానికి తగిలించి ఉన్న పోస్టుబాక్స్‌లో ఉత్తరాలు పడేస్తారు. తమకు కావలసిన కార్డులు, కవర్లు కూడా ఆ తపాలా

ఉద్యోగి దగ్గరే కొనుక్కుంటారు.

ట్రక్కులు, సైకిళ్ళు, గుర్రాలు వెళ్ళడానికి వీలుపడని ఇసుక మైదానాలుగల ప్రాంతాలలో జీవించే ప్రజలకు అనుకూలంగా ఒంటెలను సంచార తపాలా కార్యాలయాలుగా ఉపయోగిస్తున్నారు. అక్కడి పౌరులు తమకు అవసరమైన తపాలా స్టాంపులు, కార్డులు, కవర్లు-ఒంటెపై వచ్చే తపాలా ఉద్యోగి దగ్గరే కొంటారు. కేరళలోని కొన్ని నదీ ద్వీపాలు, నీటి మధ్య ఇళ్ళు ఉన్న ప్రాంతాలలో నావల మీద సంచార తపాలా ఆఫీసులు ఏర్పాటు చేశారు. అక్కడి ప్రజలకు ఉత్తరాలు చేరవేసేందుకు, తపాలా సౌకర్యాలు కలుగ జేసేందుకు ఇవి ఎంతగానో తోడ్పడుతున్నాయి.

ఈ ఫిబ్రవరి నుంచి కెనడా లో టొరెంటో - మాంట్రియల్ ల మధ్య 'ఫాస్కాన్' అనే ఎలక్ట్రానిక్ పోస్టల్ సర్వీస్ ప్రారంభిస్తున్నారు. ఈ తపాలా విధానం వల్ల ఒక ఉత్తరం చిరునామాదారును చేరేందుకు రెండు గంటలు మాత్రమే పడుతుంది. ఇందుకుగాను ఓ పేజీ ఉత్తరానికి ఒక డాలర్ వసూలు చేస్తారు. అదే ఎక్స్‌ప్రెస్ ఉత్తరమైతే పదిహేను నిమిషాల్లోనే చేరుతుందట. దీనికిమాత్రం 1.35 డాలర్లు అవుతుంది.

ఉత్తరాలు త్వరత్వరగా వాటి గమ్యస్థానం చేరడానికీ, వేలకొలది లేఖలను అతిత్వరగా సార్టింగ్ చేయడానికీ వీలుగా 1972లో ఆరు అంకెలుగల 'పిన్‌కోడ్' (పోస్టల్ ఇండెక్స్ నెంబర్) పద్ధతిని ప్రవేశ పెట్టారు. పిన్‌కోడ్‌లో మొదటి అంకెను బట్టి ఆ ఉత్తరం ఏ ప్రదేశానికి చెందిందో వెంటనే తెలుస్తుంది. ఉత్తరం మీద మొత్తం చిరునామ చదివేందుకు ఖర్చయ్యే సమయంకన్నా ఆ కోడ్



ద్వారా అదే సమాచారాన్ని తెలుసుకోవడానికి అయ్యే సమయం బహు స్వల్పం.

అడ్రసులు సరిగా లేకపోయినా, అర్థం కాకపోయినా, ఆ అడ్రసు తాలూకు వ్యక్తులు దొరక్కపోయినా అలాంటి దిక్కులేని ఉత్తరాలకి ఓ అనాధ శరణాలయం కూడా ఉంది. దాని పేరు 'రిటర్న్‌డ్ లెటర్స్ ఆఫీసు' అంటే వాపసొచ్చిన ఉత్తరాల కార్యాలయమన్నమాట. ఇంతకు ముందు ఇలాంటి ఆఫీసు దక్షిణాది కంతటికీ కలిపి ఒక్కటే ఉండేది. ఇప్పుడు రాష్ట్రానికి ఒకటి చొప్పున ఏర్పాటు చేశారు.

నెలకు లక్ష ఉత్తరాల వరకు వస్తుంటాయి. వాటిలో 97శాతం అవి చేరాల్సిన చోటుకు చేరుస్తారు. గత్యంతరం లేకపోతే అవి రాసిన వారికే తిప్పి పంపేస్తారు. వారి అడ్రసూలేని, ఎటూ గాని ఉత్తరాలు మాత్రం రెండు నెలల పాటు ఈ అనాధ శరణాలయంలో అట్టే పెడతారు, 'చేతి రాత నిపుణులు' వాటిని పరిశీలించి కొన్ని దస్తూరిలను అర్థం చేసుకొని దాని తాలూకు వారికి పంపుతూ ఉంటారు. ఇలాంటి సందర్భాలలోనే కొన్నేళ్ళ పాటు కూడా ఉత్తరాలు ప్రయాణించి చేరిన సంఘటనలు జరిగాయి.

ఏది ఏమైనా తపాలా పద్ధతులలో ఇంకా నూతన విధానాలు ప్రవేశపెట్టి ఉత్తరాలు త్వరత్వరగా చేరేందుకు ప్రభుత్వం 'క్విక్ మెయిల్ సర్వీస్' వంటివి అమలులోకి తెస్తూనే ఉంది, ఇంకా ఆధునిక విధానాలు ప్రవేశపెట్టవలసిన అవసరమూ ఉంది.

—చొక్కాపు వెంకటరమణ

# మర్యాద

సుభద్రా దేవికి నెల తప్పింది. తనకు పుట్టబోయే బిడ్డ తన భర్తలా కర్కశంగా, బూతులు మాట్లాడేవాడుగా తయారౌతాడేమోనని ఆమెకు భయం పట్టుకుంది.

వెంటనే ప్రముఖ పిల్లల స్పెషలిస్టు డాక్టర్ రుక్మిణి దగ్గరికెళ్ళి తనను బాధిస్తున్న భయాన్ని చెప్పి సలహా అడిగింది.

డాక్టర్ రుక్మిణి నవ్వింది. "మీరేం భయపడకండి! మీకు పుట్టబోయే బిడ్డకు మొదటినుండే మర్యాదగా ఉండటంనేర్పితే మంచిది. అందుకు మీరేం చేయాలో తెలుసా ? ప్రతి గంటకూ ఓ సారి 'మర్యాదగా ఉండు' అని మనసులోనే మననం చేసుకొంటూ ఉండాలి. అప్పుడు మీ బిడ్డకి మీవారి లక్షణాలు రాకుండా మర్యాద, మన్నన పుట్టుకతోనే అలవడుతాయి" అని చెప్పింది.

సుభద్రాదేవి ఆరోజునుంచీ ప్రతిగంటా మర్చిపోకుండా 'మ ర్యా ద గా ఉండు' అంటూ మననం చేసుకోవటం మొదలెట్టింది.

నెలలు నిండేయి. సు భ ద్రా దే వి కి డెలివరీ కాలేదు. సంవత్సరం గడిచింది. అయినా ఆమె ప్రసవం కాలేదు. కారణం ఏమిటో అంతుబట్టలేదు.

'ఆమె ఆరోగ్యం బాగానే ఉంది. కడుపులో పెరుగుతున్న శిశువూ కులాసాగానే ఉంది. మరి డెలివరి ఎందుకు కాలేదో తెలియటం లేదు' అన్నారు డాక్టర్లు.

రెండేళ్ళు గడిచేయి. సుభద్రాదేవికి గర్భ భారం పెరిగి విపరీతంగా బాధపడిపోసాగింది. ఆపరేషన్ చేస్తే ఏం ప్రమాదం ముంచుకొచ్చి తమ పీకల మీదికి వస్తుందోనని డాక్టర్లు వెనుకాడుతున్నారు.

జర్మనీ నించి ఓ స్పెషలిస్టు వచ్చాడనివిని సుభద్రదేవిని ఆ డాక్టర్ దగ్గరికి తీసికెళ్ళారు.

సుభద్రాదేవి గర్భాన్ని జాగ్రత్తగా పరిశీలించిన మీదట ఆపరేషన్ చేసి శిశువును బయటికి తీయాలన్నాడు స్పెషలిస్టు. సుభద్రా దేవి భర్త సరేనన్నాడు.

ఆ విచిత్ర గర్భం ఆపరేషన్‌ని చూడ్డానికి ఎందరో డాక్టర్లు వచ్చారు.




ఆపరేషన్ చేశారు. ఆమె గర్భంలో సంపూర్ణ ఆరోగ్యవంతులైన ఇద్దరు మగ బిడ్డలున్నారు.

వాళ్ళు ఒకరితో మరొకరు ఎంతో మర్యాదగా మన్ననను చూపిస్తూ "నీ తర్వాత నేను వెళ్తారా తమ్ముడూ!" అంటే "అహా...నీవు పెద్దాడివి నీతర్వాతే నేను బైటి కెళ్తాలే!" అని అనుకుంటున్నారు.

—'శ్రీరాణి'

# సలహా

పెళ్ళయిన పదేళ్ళకు అప్పారావు దంపతులకు ఆ రోజున ఓ గాఢమయిన కోరిక కలిగింది. సాయంత్రం ఆఫీసు నుంచి వస్తూనే హడావుడిగా "సరూ... త్వరగా ముస్తాబు చేసుకో, మనోరమలో మంచి సెక్స్ సినిమా ఆడుతోంది వెడదాం" అన్నాడు.

'ఎ' సర్టిఫికెట్ సినిమా గురించి చెప్పుకోవటమే కానీ ఏనాడూ చూడని సరోజకు చిరకాలంగా అలాంటి సినిమా చూడాలనే కోరిక ఉంది. "ష్...అరవకండి! చంటోడికి సినిమా మాట విన పడితే! కూడా వస్తానంటాడు. అలాంటి సినిమాలు పిల్లలకు చూపించటం మంచిది కాదు" అంది.

"వాణ్ణి ప్రక్కింటి పిన్నిగారింటి దగ్గర చదువుకొంటూ ఉండమను. వాణ్ణి దానికి తీసుకు వెళ్ళవద్దు" అన్నాడు అప్పారావు.

వీధిలోకి ఆడుకొందుకు వెళ్ళిన చంటోడు పరుగు పరుగున వస్తుండగా "వాణ్ణి ఆపి బజారుకు వెళ్తున్నాము. మేము వచ్చే వరకూ కాంతమ్మ మామ్మగారింటి దగ్గర చదువుకొని పడుకో" అని చెపుదామని సరోజ అనబోతుండగానే సదరు తొమ్మిదేళ్ళ చంటోడు "డాడీ ... అమ్మతో కలిసి సినిమాకు వెళ్తున్నారా. అయితే మీకు ఓ సలహా. మనోరమలో కొత్త పిక్చరు ఏం బాగోలేదు. అది చూడకండి. వెంకట్రామాలో బొమ్మ బాగుందట" అన్నాడు పెద్ద ఆరిందాలా.

"మనోరమలో సినిమా గురించి నీకేం తెల్సు" నోరు ఆవలించి అడిగింది సరోజ.



"ప్రొద్దుట వెంకటేశులుతో కలిసి ఉదయం ఆట చూశాను" అన్నాడు చంటోడు లోనికి వెళుతూ.

భార్యాభర్తలిద్దరూ ఒకరి ముఖాలొకరు చూసుకొన్నారు.

—పి. వి. యస్సెస్సెన్రాజు

# ట్యూబ్‌లైట్

ఓ పెద్ద ఫర్నిచర్ కంపెనీ యజమాని వైకుంఠమూర్తి, తమ కంపెనీకి కావలసిన స్టాకను కొనుక్కు వచ్చేందుకు బొంబాయి వెళ్ళాడు. అక్కడ ఓ ఖరీదైన హోటల్లో దిగిన వైకుంఠమూర్తికి మతిపోగొట్టేంత అందమైన ఓ అమ్మాయితో పరిచయం అయింది.

అయితే ఆ పిల్ల భాష ఆయనకి

తెలీదు. ఈయనగారి భాష ఆ సుందరాంగికి అర్థంకాదు. తన మనసులోని భావాల్ని ఆమెకి ఎలా తెలియజేయాలో మొదట వైకుంఠమూర్తికి తట్టలేదు.

భాష అర్థం కానంత మాత్రాన చేతికి అందిన స్వర్గాన్నీ, దరిచేరిన అందాల రాశినీ వదులుకోవటం తెలివితక్కువ తనమే అవుతుందనిపించింది.

చివరికెలాగైతేనేం వైకుంఠమూర్తి ఓ ఉపాయం ఆలోచించాడు.



ఒక కాగితం తీసుకుని దానిమీద 'చిన్నకారు' బొమ్మ వేశాడు. ఆమె ముసిముసి నవ్వులు నవ్వుతూ 'సరే'నని తలూపింది. ఇద్దరూ కలసి కారుమీద ఊరంతా షికారు తిరిగొచ్చారు హుషారుగా.

వైకుంఠమూర్తి కాగితం మీద 'హోటల్' బొమ్మ వేశాడు. ఆమె నవ్వి అంగీకారసూచకంగా తలాడించింది.

ఇద్దరూ నుంచి హోటల్‌కి వెళ్ళారు. రుచికరమైన స్పెషల్ భోజనం పుష్టిగా తిన్నారు. 'బ్రేవ్' మని త్రేన్చారు.

ఈసారి వైకుంఠమూర్తి 'కాబరే డాన్సర్ల బొమ్మ' కాగితం మీద వేసి ఆ సుందరాంగికి చూపించాడు. అతని అభిప్రాయం అర్థం చేసుకున్న ఆ పిల్ల సిగ్గుపడుతూ 'సరేవెళ్దాం' అన్నట్టు తల పంకించింది.

ఇద్దరూ బార్‌కి వెళ్ళారు. అక్కడ కాబరే డాన్స్ చేస్తున్నారు కొందరు అందాల భామలు. శరీరమంతా కుదిపేస్తూ వివిధ శృంగార భంగిమల్తో ప్రేక్షకుల్ని తన్మయుల్ని చేస్తున్నారు. డాన్స్ మాంచి రంజుగా సాగుతోంది. హాల్లో జనాలు బాగా వేడెక్కిపోయి ఉన్నారు.

వైకుంఠమూర్తి, ఆమె-పక్కపక్కనే ఆనుకుని కూర్చుని కాబరేడాన్స్ చూస్తున్నారు. ఆమె వైకుంఠమూర్తి ముఖంలోకి చూసింది. చిన్నగా నవ్వాడతను.

ఆమె గభాల్న కాగితం తీసి దానిమీద అందమైన 'పెద్ద పట్టెమంచం' బొమ్మ వేసి, అతనికి చూపి అదోలా చూసింది.

వైకుంఠమూర్తి ఒక్కక్షణం ఆశ్చర్యంలో మునిగిపోయాడు. "ఇంతవరకూ ఆమెతో తనకు సంబధించిన ఏవిషయమూ చెప్పనేలేదు. తనది 'ఫర్నిచర్ వ్యాపారమని' ఆమెకెలా తెలిసింది" అని ఆలోచనలో పడిపోయాడు.

—. వి. లత

# పుణ్యభూమి

ఒక ఓడ హఠాత్తుగా సముద్రం మధ్యలో మునిగిపోయింది. అందరూ చచ్చిపోయారు. ముగ్గురు మటుకు ఎలాగో ప్రాణాలు అరచేతుల్లో పట్టుకుని ఈదుకుంటూ వచ్చి ఒడ్డున పడ్డారు. ఆనక వాళ్ళు చేరింది ఇండియాలాంటి ఒక

దేశం అని తెలిసింది. వాళ్ళలో ఒకడు ప్రఖ్యాత శాస్త్రవేత్త, ఇంకొకడు ముళ్ళ పొదలా జుట్టు పెంచుకున్న ఐంద్రజాలి కుడు. మూడో మనిషి మాత్రం నవయౌవ నంతో నవనవలాడి పోతున్న అందగత్తె.



వాళ్ళకు కనుచూపు మేరలో మద్రాసు లాంటి నగరం కనిపించింది. "ఈ దేశంలో స్థిరపడి పోవచ్చునేమో. నే వెళ్ళి కను క్కొస్తాను. మీ రిక్కడే ఉండండి." అని బయలు దేరాడు శాస్త్రవేత్త. రెండు మూడు గంటల తర్వాత ఆయన మొహం వేలాడేసుకుని తిరిగొచ్చాడు. "ఇక్కడ కుదరదు బాబూ. అసలిక్కడున్న జీని యస్ లంతా వేరే దేశాలకు వలస వెళ్ళి పోతున్నారంట" అని చతికిల బడ్డాడు.

"అయితే నేవెళ్ళి చూసొస్తా" నని అందగత్తె వెళ్ళింది. ఆవిడా రెండు గంటల్లో తిరిగొచ్చేసి "బాబ్బాబూ, ఇక్కడి మనుషులు నన్ను సాటి మనిషిగా చూడ టంలేదు. కేవలం విలాస వస్తువుగా చూస్తారు. ఇక్కడ కుదర్దు" అంది ఏడుస్తూ.

"మరయితే నేనూ వెళ్ళి ప్రయత్నిస్తా" నని నింపాదిగా నడిచి పోయాడు ఐంద్ర జాలికుడు.

సాయంత్రానికి గాని తిరిగి రాలే దాయన. మెడనిండా పూలదండలతో ముఖం నిండా ఆనందంతో దర్జాగా తిరి గొచ్చిన ఆ ఐంద్ర జాలికుడు "నాకు ఈ దేశం చాలా బాగా నచ్చింది. నేను చేసిన రెండు మూడు మ్యాజిక్ ఐటమ్స్ చూసిన ఈ ప్రజలు నన్ను దేవుడి అవతారమని భావిస్తున్నారు. నేనిక్కడే స్థిరపడి పోతా నండీ!" అన్నాడు.

—ఎస్.ఎన్. నాయకర్

# మహిమ

తిరుపతి వెంకటేశ్వర స్వామి మొక్కులు అలా అలా పెరిగిపోతున్నాయి. రామారావు కుటుంబంతో ప్రయాణమై వెళ్ళి కొండమీద కాటేజి ఒకటి తీసు కున్నాడు.

సామాన్లు ఎక్కడివక్కడ పడేసి స్నానానికి వెళ్ళాడు రామారావు.

ఇల్లు ఊడ్చేవాడొచ్చి అడక్కుండానే ఇల్లు ఊడుస్తున్నాడు. డ్రాయరున్న గదిలోకి వాడు వెళ్ళే సరికి, భర్త బల్ల మీద డబ్బుని ఉంచిన విషయం రాజ్యా లక్ష్మికి జ్ఞాపకం వచ్చి వాడిని ఓకంట కనిపెట్టూనే తనపని చేసుకో సాగింది. వాడు ఆ గది ఊడ్చి బయటకి వచ్చాక "అమ్మా! బల్లమీద డబ్బులు ఉంచారు.





మరిచిపోయినట్లున్నారు. ఇక్కడ ఇలా ఉంచినా పర్వాలేదు. తలుపులకి తాళాలు వేయక పోయినా పర్వాలేదు. పైసా పోదు కానీ కొండదిగాక మాత్రం జాగ్రత్తగా ఉండండి. తెయకుండానే దొంగతనాలు చేస్తారు" అన్నాడు.

అప్పుడే స్నానంచేసి వస్తున్న రామారావు ఆ మాటలువిని ఆగాడు.



"అవునమ్మా... ఈ కొండమీద స్వామి మహిమే అంత.మీరు సామానే కాదు డబ్బు, నగలూ, అయినాసరే ఇక్కడ వదిలిపెట్టి తలుపులు తీసిపోండి ఎవ్వరూ ముట్టుకోరు. ఎవరికీ దొంగ తనం చేయాలనే బుద్ధే పుట్టదు. ఒక వేళ ఎవరైనా చేసినా, వాళ్ళకి వెంటనే తీరని కష్టం వస్తుంది. క్షణాలమీద వాళ్ళు లెంపలువేసుకొని, దొంగిలించిన సొమ్ము తెచ్చి తిరిగి ఇచ్చేస్తారు. ఇలా ఎన్నో సార్లు జరగడంతో, ఎవరికీ కొండపైన దొంగతనం చేసే ధైర్యం లేకుండా పోయింది. రోజూ ఇన్ని వేల మంది భక్తులు కొండపైకి వస్తుంటారు కదా! ఒక్క దొంగతనం జరిగినట్లు ఎప్పు డేనా విన్నారా? పేపర్లో చూశారా? అంటూ ఏకధాటిన చెప్పుకు పోయాడు.

* * *

స్నానాలూ అవీ పూర్తి చేసుకుని, దైవదర్శనానికి సకుటుంబంగా బయలు దేరాడు రామారావు. ఇంచు మించు గుడి దగ్గరకి వచ్చేసరికి "ఏమండీ... తలు పుకి తాళం పెట్టారా?" అని అడిగింది రాజ్యలక్ష్మి.

"లేదు. నువ్వు పెట్టావను కున్నాను. తాళం నీదగ్గరే ఉందిగా" అన్నాడు రామారావు.

"అరే...నేను తీసుకోలేదండీ, మరి ఏమైనట్లు?" ఆందోళన పడింది ఆమె.

"అమ్మా...తాళాన్ని నేను కిటికీలో పెట్టాను." అంది పెద్దకూతురు మాధవి.

"అయితే... వెళ్ళి తాళం పెట్టి వద్దాం రండి" అంది రాజ్యలక్ష్మి.

"పర్వాలేదులే. ఇప్పుడు మళ్ళీ వెళ్ళి వచ్చామంటే, క్యూలో ఇంకా వెనక్కి పోవాల్సి వస్తుంది" అన్నాడు రామారావు.

దైవదర్శనం చేసుకుని తీరికగా గదికి చేరుకున్నారు వాళ్ళు. దగ్గరగా వేసిన తలుపులు అలాగే ఉన్నాయి. పెట్టె, బెడ్డింగూ అన్నీ ఉన్నచోటే ఉన్నాయి. ఎటొచ్చీ భోజనం కోసం తెచ్చుకొన్న పెద్ద స్టీల్ టిఫెన్ క్యారియరూ, రామారావు విడిచిన ఖరీదైన టెర్లిన్ బట్టలూ, 50 రూపాయలున్న రాజ్యలక్ష్మి పర్సు మాత్రం కనిపించ లేదు.

—కె. ఆర్. కె. మోహన్

# కంచె

అది-పల్లె, పట్నం కాని ఊరు. బొత్తిగా కొన్నాళ్ళుగా ఆ ఊళ్ళో దొంగల భయం ఎక్కువైపోయింది. ప్రతిరోజు ఏదో మూల దొంగలు పడటం జరుగుతోంది.

పోలీసుల సహాయం కోరితే బావుంటుందని కొంతమంది సూచించారు. సరే- పోలీసులకి ఫిర్యాదు వెళ్ళింది. దొంగతనం జరిగిన ప్రతిసారి వాళ్ళు హడావుడిగా వచ్చేసి. "దొంగల్ని పట్టేస్తాం!" అని ఊరిమీద పడి తినేసి, జేబులు నింపుకుని పోయారేగాని, దొంగతనాలు ఆగలేదు.

ఇది లాభం లేదని పెద్దలు ఓ నిశ్చయాని కొచ్చారు. ఊళ్ళోని యువజనులు వంతుల వారీగా గస్తీ తిరగాలని నిర్ణయం జరిగింది.

ఓ వారం రోజులు ఉత్సాహంగా గస్తీ తిరిగిన కుర్రకారు కొత్త సమస్యల్ని సృష్టించారు. దొంగతనాలమాటెలా వున్నా, వయసొచ్చిన ఆడపిల్లలకి భద్రత లేకుండా పోయింది..

మళ్ళీ పెద్దమనుషులు సమావేశమయ్యారు. చర్చ తీవ్రంగా సాగింది. ఊరంతా చందాలు వేసుకుని ఓ గూర్ఖాని ప్రత్యేకం తమ ఊరికి నియమించుకోవాలని ఏకగ్రీవంగా నిర్ణయించారు.

వెంటనే గూర్ఖా నియామకం జరిగిపోయింది. కచేరి చావడిలో ఓ గది అతని వసతి కోసం యిచ్చారు. గూర్ఖా వచ్చిన వారం రోజుల్లోనే ఓ దొంగని పట్టిజనానికి అప్పచెప్పేశాడు. వాళ్ళు కసి దీరా వాణ్ణి తన్ని పోలీసులకి అప్పగించారు.

ఓ నెల గడిచేసరికి దొంగతనాలు పూర్తిగా నిలిచిపోయాయి. గూర్ఖాసామర్థ్యం మీద ప్రజలకి బ్రహ్మాండమైన గురి కుదిరింది.

అతనికి డబ్బుల్తో పాటు కూరగాయలు, పాలు, పెరుగు సమృద్ధిగా యివ్వటం సాగించారు. ప్రజలు నిశ్చింతగా నిద్రపోగలిగారు. ఆ ఊళ్ళో కెల్లా ధన





వంతుడైన వరహాల శెట్టి ధైర్యంగా, కుటుంబ సమేతంగా బంధువులింటికి పెళ్ళికి వెళ్ళగలిగాడు!

నాలుగు రోజుల తర్వాత, యింటికి తిరిగొచ్చిన శెట్టి లబోదిబోమని గోల పెట్టాడు. వేసిన తాళాలు వేసినట్టే ఉన్నాయి. ఇంట్లోని నగలు, రొక్కం సమస్తం పూచికపుల్లతో సహా దోచుకుపోయారు. శెట్టి మూర్ఛపోయాడు.

ఇంత జరిగితే, గూర్ఖా ఏంచేస్తున్నట్టు? వెంటనే అతనికోసం మనుషులు వెళ్ళారు.

కచేరి చావడి గదిలో గూర్ఖా తాలూకు పూచికపుల్ల కూడా లేదు!

—బొమ్మిడి అచ్చారావు

Edited, Printed and Published by Ramoji Rao Ch. for Vasundhara Publications. Printed at Colorama Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad - 500 004.

